# చతుర

సంపుటి:5 మే 1982 సంచిక:4

## ఈ నెల సమగ్ర నవల

కేవలం నాలుగు రోజుల వ్యవధిలో అ ఊరు ఊరంతా ఆందోళనతో ఉక్కిరిబిక్కిరై భయంతో గజగజలాడి పోయింది. ఊర్లో ఎందరో చేతబడికి గురై చిత్ర విచిత్రంగా ప్రవర్తించసాగారు. మిత్రులైన ఒక జర్నలిస్ట్, ఒక డాక్టర్, మరో సైకియాట్రిస్ట్‌ల సాయంతో ఒకవైపున విద్యావంతుడైన ఆ గ్రామ యువకుడూ, చేతబడి మాంత్రికుడి సాయంతో మరోవైపున ఆ ఊరి పెద్దా ఈ భయంకర సమస్యను పరిష్కరించేందుకు పూనుకున్నారు. ఆ ప్రయత్నంలో ఊరు రెండుగా చీలి ఇరు వర్గాల మధ్య ప్రచ్ఛన్నయుద్ధం మొదలయింది. ఆ తర్వాతి పరిణామాలెలాంటివి? ఊరంతటినీ భయభ్రాంతపరచిన ఆ....

# ప్రయోగం

ఆసలు ఎలా ప్రారంభమై చివరికి ఎలా ముగిసింది?

## బుర్రా సుబ్రహ్మణ్యం

యదార్థ సంఘటనల ఆధారంగా చివరిదాకా ఉత్కంఠతతో చదివించేలా రచించిన 'ప్రయోగం' ఈ నెల చతుర సమగ్ర నవల.

ముఖ చిత్రం : జగ్ మోహన్

రెండవ కవరు :} ఎల్. ఆర్. గ్రోవర్
మూడవ కవరు :}

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.

* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతున్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.

* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*

* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.

* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.

* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు. 1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

**చతుర**

*ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ - 500 004.*

# ట్రాఫిక్ రూల్స్

వెంకటస్వామికి చిన్నప్పటి నుండీ మిలటరీ కమాండర్ అవ్వాలని మహా కోరిగ్గా వుండేది. తనో పెద్ద కమాండర్ అయిపోయి అందరి మీద అథార్టీ చెలాయిస్తుంటే, వాళ్ళంతా వంగివంగి సలాములు చేస్తుంటే, తను మీసం సవరించుకుంటూ ఠీవిగా కాలుమీద కాలేసుకుని కూర్చున్నట్లు ప్రతిరోజూ రంగు రంగుల కలలొచ్చేవి వెంకటస్వామికి. కలల్లో పడి చదువులో వెనకబడి అదే పనిగా పరీక్షలు తప్పి ఆఖరికెలాగో మెట్రిక్ అయిందనిపించాడు.

చదివిన చదువుకి ఏవుద్యోగం రాక, వున్న పర్సనాలిటీతో ట్రాఫిక్ పోలీసు ఉద్యోగం సంపాదించేడు ఎలాగో తంటాలు పడి. కమాండరయ్యే కోరిక తీరకపోయినా బుర్రమీసాల కోరిక తీరింది. పెద్ద పెద్ద మీసాలు పెంచాడు. క్రాస్‌రోడ్డు మీద ట్రాఫిక్ సిగ్నల్ ఇస్తూ ఠీవిగా నిలబడి వున్న వెంకటస్వామి పోలీస్ డ్రస్సులో వున్నా సినిమా హీరోలా వుంటాడు. డిసిప్లిన్ కూడా హీరో డిసిప్లినే. ఎవడైనా ట్రాఫిక్ రూల్స్‌కి ఓ పిసరు అటూ ఇటూ అయితేచాలు వాణ్ని పీకి పాకం పడతాడు.

ఆరోజు మిట్ట మధ్యాహ్నం. ఎండ మండిపోతోంది. ఫుల్ లోడ్‌లో వున్న ఓ లారీ ట్రాఫిక్ నిబంధనల్ని ఏమాత్రం పాటించకుండా సర్రున దూసుకుపోయింది. లారీకి ఎదురుగా ఫక్తు ట్రాఫిక్ రూల్స్ పాటిస్తూ సైకిలు మీదొస్తున్న యువకుడు పెద్ద భూతంలా ఎదురొస్తున్న లారీనిచూసి ఇంక ఈ భూమ్మీద నూకలు చెల్లిపోయాయనుకుని, అయినా ఏదైతే అదవుతుందని కళ్ళు గట్టిగా మూసుకుని, పళ్ళు గిట్టకరిచి బలం కొద్దీ బ్రేక్ వేశాడు. ప్రమాదం గుర్తించిన లారీ డ్రైవరు కూడా సడన్ బ్రేక్ వేసి స్టీరింగ్ పక్కకి తిప్పేసరికి లారీ కీచుమంటూ వేగంగా వెళ్ళి పేవ్‌మెంటును గుద్దుకుని పెద్ద కుదుపుతో ఆగింది.

ఇదంతా చూస్తున్న వెంకటస్వామి మొత్తం ట్రాఫిక్‌నంతా ఆపేసి, కోపంతో వూగిపోతూ లారీ డ్రైవరు దగ్గరికొచ్చి కాలరు పట్టుకుని-





"నేనిక్కడ వుండగానే ట్రాఫిక్ రూల్స్ అధిగమించి రాంగ్ సైడులో, అందులోనూ అంత స్పీడుగా లారీ నడపడానికి నీకెన్ని గుండెలు? ఆ సైకిలతను చనిపోతే ఏం చేసేవాడివి? ప్రాణాలు తెచ్చివ్వగలవా! అసలు నువ్వు ఎన్నాళ్ళనుండీ లారీ నడుపుతున్నావ్. లైసెన్స్ వుందా? ఏదీ బైటికితియ్ ..." అంటూ లెఫ్టైరైట్ వాయించేశాడు.

ఇంకా కళ్లు మూసుకుని సైకిలలాగే పట్టుకుని గజగజా వణుకుతున్న సైకిలిస్టుని పట్టి కుదిపి ఈ లోకంలోకి తీసుకొచ్చి "మొత్తంమీద అదృష్టవంతుడివే! రాంగ్ సైడ్‌లో వస్తున్న లారీ బారి నుండి తప్పించుకున్నావ్. రియల్లీ గ్రేట్ ఎస్కేప్. ట్రాఫిక్ రూల్స్ పట్ల నీకున్న శ్రద్ధాభక్తులే నిన్ను రక్షించాయి" అని భుజం తట్టాడు.

వెంటనే ఆ సైకిలతను "నోనో! ట్రాఫిక్ రూల్సా... పాడా! ఆ క్షణంలో ఏడుకొండలవాడు నాతో వుండబట్టి నేను బతికిపోయాను. ఆ మహానుభావుడికి నా చర్మం ఒలిచి చెప్పులు కుట్టిచ్చినా ఋణం తీరదు" అన్నాడు.

వెంకటస్వామికి ఒళ్ళు మండింది. "ఎవడా ఏడుకొండలు? నేను డ్యూటీలో వుండగా నా కళ్ళెదురుగానే డబుల్స్ నడిపిస్తున్నవా! వాడేడీ పారిపోయడా? ఊఁ... తియ్ డబ్బులు. డబుల్స్ నడిపినందుకు ఫైన్ కట్టు" అంటూ జేబులోంచి రసీదు పుస్తకం, పెన్సిల్ తీశాడు.

—లక్ష్మి



# ప్రేమ జ్వరం

ప్రేమంటే చెడ్డ భయం సత్యానికి. కాని ప్రేమకథలు చదవడం మహాఇష్టం. తను ప్రియుడి స్థానంలో ఉన్నట్టు ఊహించుకుని సంబరపడిపోవడం కద్దు. అలాంటి సత్యం అప్పుడప్పుడు ఎదురింట్లో ఉన్న మీనాక్షివంక సిగ్గుసిగ్గుగా చూస్తుండేవాడు. ఆ అమ్మాయి గట్టిగా తిరిగి చూస్తే మాత్రం తలవంచుకుని వెళ్ళిపోయేవాడు.

తనంటే అతనికి ఇష్టమని గ్రహించిందా మీనాక్షి. చొరవచేయలేక సతమతమయిపోతున్నాడని ఊహించి, ఆ పనికి తనే పూనుకుంది. సత్యం తనవంక చూసినప్పుడల్లా చిలిపిగా, ముచ్చటగా నవ్వడం మొదలెట్టి చూపులతో కవ్వించేది.

సత్యం ఏం చెయ్యాలో తెలియక రెండు రోజులు హైరానపడిపోయాడు.

సత్యానికి స్నేహితుడయిన పర్వతాలు దగ్గరకెళ్ళి తన హృదయావేదన నంతా

## మీ చేతుల్లో ఒదిగిపోయే తారామణిహారం
## మీ కన్నుల్లో వెలుగులు చిమ్మే దివ్వెల తోరణం

- చలనచిత్ర పరిశ్రమలోని ప్రతి రంగం గురించి సమగ్రమైన సమాచారాన్ని అందిస్తుంది 'సితార'

- ఆబాలగోపాలాన్ని తన అందచందాలతో ఆకర్షిస్తుంది 'సితార'

- రంగుల ముఖచిత్రాలతో, అభిమాన తారల వర్ణచిత్రాలతో, తాజాతాజా ఖబుర్లతో మిమ్మల్ని మురిపించే మరిపించే అంశాలతో ఎన్నెన్నో విశేషాలతో వారం వారం వెలువడుతుంది 'సితార'

# సితార

సమగ్ర సినీ వారపత్రిక

రూపాయి మాత్రమే

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా, హైదరాబాదు-500004

వెళ్ళుబుచ్చాడు. సలహా ఇచ్చి ఆదుకోమని బతిమాలాడు.

సూక్ష్మంలో మోక్ష మార్గం చెప్పేశాడు పర్వతాలు.

"చూడు బ్రదర్! మనకి ఇలాంటి విషయాలలో అనుభవం లేదు. కాని పాత పుస్తకాల షాపులో ఒక ఇంగ్లీషు పుస్తకం చూశాను. దాని పేరు 'ప్రేమించడం ఎలా?' దానిలో ఈ వ్యవహారమంతా ఉండుంటుంది."

పరుగెత్తికెళ్ళి ఎవరెస్ట్ విజేతలా తిరిగొచ్చాడు పర్వతాలు. చదివి చెప్పమని పుస్తకం ముందుంచాడు.

"మొదటి పాఠంలో ఏమిరాశాడంటే ప్రియురాలిని కళ్ళతో పలకరించాలి" వివరించాడు పర్వతాలు.

"కళ్ళతో ఎలారా పలకరించడం?"

"అవన్నీ నన్నడక్కు. ఏదో పద్ధతి ఉండే ఉంటుంది. లేకపోతే ఎందుకు రాస్తాడు? తర్వాత పాఠం ప్రియురాలికి ఇష్టమైన వస్తువులను బహుమతులుగా పంపాలి!"

"మీనాక్షికి ఏమిష్టమో నాకెలా తెలుస్తుంది?"

"తెలుసుకోవాలోయ్! ప్రేమించడమంటే మజాకా? ఆడాళ్ళందరికీ బంగారు నగలంటే ఇష్టం. ఒక నెక్లెస్ చేయించి పంపించు!"






"నెక్లెసా? బంగారం తులం రెండు వేలుంది. అయిదు తులాలయినా పెడితేనే గాని నెక్లెస్ గాదే"

"సరే, తర్వాతి పాఠం ప్రియురాల్ని షికారుకి తీసుకెళ్ళాలి. చేతితో చెయ్యివేసుకుని, మృదువుగా స్పృశిస్తూ నడవాలి మధ్యమధ్యలో ఒకరి శరీరం ఒకరికి తగులుతుంటే హృదయాలు పులకిస్తాయి"

"మరి ఆ సమయంలో మీనాక్షి అన్నలెవరయినా చూస్తే?"

"ప్రేమ విజయం సాధించాలంటే ఇలాంటి పరీక్షలను గుండెదిటవు చేసుకుని ఎదుర్కోవాలోయ్. నిజమైన ప్రేమ అంటే ఏమనుకున్నావు?"

ఒంటినిండా దెబ్బలు పడినట్టుగా ఒళ్లు తడుముకుంటున్నాడు సత్యం.

"ఇహ నాలుగో పాఠం ఏకాంత ప్రదేశంలో ప్రేయసీప్రియులు ఒకరి సరసన ఒకరు కూర్చుని, హృదయాలు స్పందిస్తుంటే, ప్రేమ తారకలు నృత్యం చేస్తుంటే ... ఠక్కున ఆగిపోయాడు పర్వతాలు.

"ఏమిట్రా చెప్పు...అలా నిశ్శబ్దంగా ఉన్నావేం?" సత్యం తొందర చేస్తున్నాడు.

పుస్తకంలో తర్వాత పేజీ ఒకటికి రెండు సార్లు చదివాడు పర్వతాలు. నోట్లోంచి మాట పెగిలి రావడంలేదు.

"తర్వాత ఏమంటాడ్రా? ప్రాణం తియ్యక చెప్పు"



...య తోడుగా ఉంటే చాలు...
మరింత సంతృప్తి!
GONGURA
PICKLE
priya
...నేవేళ పక్కన 'ప్రియ' ఉంటే
రుచులమయం. అదే 'ప్రియ'
...స్యం. నోరూరించే పలురకాల
...కు కావలసింది ఎన్నుకోండి.
...ా, వెల్లుల్లి లేకుండానూ 300,
...గ్రాముల సీసాల్లో దొరుకుతాయి.
...కాయ * నిమ్మకాయ * టొమాటో
...గూర * ఉసిరికాయ * చింతకాయ
... పండు మిరపకాయ * వంకాయ
...రకాలు : * మామిడికాయ * అల్లం
ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్
Marketed by:
MARGADARSI
MARKETING
PRIVATE LIMITED
Eenadu Compound
Hyderabad - 500 004

"ప్రియుడు జేబులోంచి పిస్టల్ తీసి, ఎదురుగా ఉన్న అమ్మాయిని 'ఠక ఠక ఠక'అని మూడుసార్లు పేలుస్తాడు ఆ పిల్ల ఢాంమని చచ్చిపోతుంది" అన్నాడు పర్వాతాలు.

"ఒరేయ్... ఒరేయ్! నీకేమన్నా మతి పోయిందా? ఏ ప్రేమికుడైనా అలాంటి అఘాయిత్యం చేస్తాడా? సరిగ్గా చదువు"

పర్వతాలు మళ్ళీ చదివాడు. అక్షరాలా అతను చెప్పినట్టే ఉంది. కాసేపు బుర్ర గోక్కున్నాడు. కళ్లు పుస్తకం వంకే చూస్తున్నాయి.

'ఆ.....! అర్థమయిందిరా!' 'ప్రేమ తారకలు నృత్యం చేస్తుంటే' తర్వాత పేజీలు చిరిగి పోయాయి. మరీ నాలుగు కాయితాలే వుంటే పుస్తకం ఎవడూ కొనడని ఏదో పాత డిటెక్టివ్ నవలలో పేజీలు ఇక్కడ అంటించేశాడు అదీ సంగతి."

—సమ్మెట రాధారమణి

# జవాబు(లు)

కాఫీ కప్పు కింద పెడుతూ అడిగాడు లాయర్ విశ్వనాథ్ "ఇప్పుడు చెప్పండి నన్నెందుకు పిలిపించారో?"

డాక్టర్ రాజారామ్ నెమ్మదిగా అన్నాడు "నా భార్యకి విడాకులు ఇవ్వాలనుకుంటున్నాను"

విశ్వనాథ్ ఒక్కసారిగా ఆశ్చర్యపోయాడు– "అదేమిటి డాక్టర్! పదేళ్ల దాంపత్య జీవనం సుఖంగా గడిపి ఇప్పుడు విడాకులేమిటి?" అడిగాడు తేరుకుని.

ఒక క్షణం ఆగి అన్నాడు రాజారామ్ "మా ఆవిడ ఈమధ్య రేడియోలో మహిళల ప్రశ్నలకు జవాబులు ఇస్తోంది– మీకు తెలుసు కదూ!"

"తెలుసు. ఆవిడకు అందువల్ల పెద్ద పేరుకూడా వచ్చింది. కానీ అలా జవాబులు ఇచ్చినందువల్ల విడాకులు ఇవ్వాల్సిన అవసరమేమిటి?" లాయర్ విశ్వనాథ్ అడిగాడు.

"ఒక క్షణం ఆగండి!" అని రాజారామ్ లేచి, పక్కనే ఉన్న టేప్ రికార్డర్ లో ఒక కాసెట్ వుంచాడు.

"ఇంత చిన్న విషయానికి విడాకులు ఇవ్వవలసిన పనిలేదు. కానీ ఇవ్వాల్సి రావటం నా దురదృష్టం. పత్రికలలో ఎలాటి ప్రశ్నలకు ఎలాటి జవాబులు ఇచ్చినా ఫరవాలేదు. ఇష్టంవున్న వాళ్లు చదువుతారు లేనివాళ్లులేదు. కానీ ప్రతిరోజూ నాతో కూడా అలాగే మాట్లాడితే ఎన్నాళ్లని భరించటం! తను ఎన్నో పుస్తకాలు



చదివి వుండవచ్చు కానీ నా రియాక్షన్స్ కూడా గ్రహించి......సారీ...ఎక్కువగా మాట్లాడుతున్నాననుకుంటాను. ఇదుగో-మొన్న ఆదివారం సాయంత్రం బాల్కనీలో కూర్చుని మేము మాట్లాడుకుంటున్నప్పుడు జరిగిన ఈ సంభాషణ రికార్డు చేశాను.అది వింటే నా బాధ మీకు అర్థం అవుతుంది..." అంటూనే టేప్ రికార్డర్ ఆన్ చేశాడు డాక్టర్ రాజారామ్. అందులోంచి మాటలు వినపడుతున్నాయి.

"ఈ ప్రొఫెషన్‌లో విశ్రాంతి దొరకటం అన్నదే కరువయిపోయింది. చాలా రోజుల తర్వాత ఇలా సాయంత్రంపూట చల్లగాలిలో కూర్చుని, నీతో ఆనందంగా గడిపే అవకాశం దొరికింది..." రాజారామ్.

"అవును. రెండవ ప్రపంచయుద్ధం ముందర నెపోలియన్ కూడా ఇలాగే అందమైన సాయంత్రాలు సరదాగా గడిపేవాడుట. తర్వాత ఇలాటి సాయంత్రాలు గడపలేకపోయానని వాపోతూ మి అండ్ మై లైఫ్ అనే పుస్తకంలో రాసుకున్నాడు"

"వాడిసంగతి మనకెందుకు గాయత్రీ! ఈ హాస్పిటల్లో ఉద్యోగం బోరు కొట్టేస్తున్నది నాకు. క్షణం తీరిక వుండదు. అప్పుడప్పుడు 'ఈ డాక్టర్ కోర్స్ ఎందుకు చదివానా' అనిపిస్తుందికూడాను!"

"1955లో డాక్టర్ ఫెదర్‌స్టోన్ లండన్ ఈవినింగ్ ట్రిబ్యూన్ పేపరులో ఒక వ్యాసం రాశాడు. తనలోకూడా సరిగ్గా ఇలాటి భావాలే వస్తున్నాయనీ, కాకపోతే అతను తన యాభయి ఆరేళ్ల జీవితంలోనూ..."

"గాయత్రీ!ముందు మనసంగతి ఆలోచిద్దాం. ఈ చల్లటి సాయంత్రాన్ని వృధా చేయవద్దు. కాసేపు చక్కగా కబుర్లుచెప్పుకుంటూ [illegible] సినిమాకు వెడదాం!"

"ఈ సినిమాలు అన్నవి సెల్యులాయిడ్‌తో తయారుచేసిన ఫిల్ముమీద ప్రింటు చేస్తారు.ఇవి 8యమ్. యమ్., 16 యమ్. యమ్., 35 యమ్, యమ్., 70 యమ్. యమ్. అని రకరకాల సైజుల్లో వుంటాయి, ఫిల్ము సైజుని బట్టి ప్రొజెక్టర్లు వుంటాయి. ప్రపంచంలో మొట్టమొదటగా ఈ సినిమాలను కనిపెట్టింది..."

"గాయత్రీ!" రాజారామ్ అరుపు పెద్దగా వినపడింది టేప్‌రికార్డర్లో.

డాక్టర్ రాజారామ్ లేచి, టేప్‌రికార్డర్ ఆఫ్ చేశాడు.

మాట్లాడకుండా విశ్వనాథ్ కేసి చూశాడు.

విశ్వనాథ్ దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

అప్పుడేవచ్చింది గాయత్రి రెండు కప్పులతో కాఫీ తీసుకుని. గాయత్రి కూర్చున్నది. పమిట నిండుగా కప్పుకున్నది.

"విడాకుల డాక్యుమెంట్లు తయారు చేయటానికి లాయర్ విశ్వనాథ్‌గారిని రమ్మన్నాను. నీ అభిప్రాయం ఏమిటి గాయత్రీ!" అడిగాడు రాజారామ్.

ఒక్క క్షణం ఆలోచించి పరుగున వెళ్లి ఏదో బైండ్ బుక్ తిరగేస్తూ వచ్చి "ఈ విడాకులు అన్నవి ఇటలీ,ఫ్రాన్స్‌దేశాలలో ఎక్కువ. తరువాత స్థానం అమెరికాది. ఇండియాలో విడాకులు చాలా తక్కువనే చెప్పాలి. స్విట్జర్లాండ్ మాత్రం ఎనిమిదో స్థానంలోకి వస్తుంది" అన్నది గాయత్రి పుస్తకం చదువుతూనే.లాయర్ విశ్వనాథ్ బిత్తరపోయి, చటుక్కున రాజారామ్ కేసి చూశాడు భయం భయంగా.

— సత్యం మందపాటి

ఉలిక్కిపడి లేచాడు రాజారావు.

అంత అదురుపాటులోనూ బద్ధకంగా ఆవులించి సిగరెట్టు పెట్టి, అగ్గిపెట్టె అందుకున్నాడు. నిద్ర కళ్ళతోనే అలారం వైపు చూశాడు.

రెండయింది.

అంతలో తనకు ఎందుకు మెలకువ వచ్చిందో జ్ఞాపకం వచ్చింది.

సన్నగా మూలుగులు వినిపిస్తున్నాయి. కాళ్ళూ-చేతులూ నేలమీద ఆగి ఆగి ఎవరో చరుస్తున్న చప్పుడు. తపా తపా శబ్దం!

మాట్లాడే ప్రయత్నంలో అంకిళ్ళు నొక్కుకుపోయినపుడు పడే బాధలాంటి మూలుగు! ఆ శబ్దాలూ, ధ్వనులూ వినపడటంవల్లనే రాజారావు మేలుకున్నాడు.

"కలలో అలా అనిపించి వుంటుంది" అనుకొని బద్ధకంగా ఆవులించాడు రాజారావు.

కాని......

మెలకువ వచ్చాకకూడా ఆ శబ్దాలు వినిపిస్తున్నాయి. యధాలాపంగా తెరిచి ఉంచిన కిటికీవైపు చూశాడు.

అవే ధ్వనులు!

ఒక్క ఉదుటున లేచి కిటికీ దగ్గరకు వెళ్ళి బయటకు తొంగిచూశాడు.

చీకటి!

నిశ్శబ్దం!

మళ్ళీ చప్పుడు!

అప్రయత్నంగా 'ఎవరూ' అన్నాడు రాజారావు.

జవాబు రాలేదు. ఆ గదిలోనే ఓ పక్కగా చెల్లెలు గాఢంగా నిద్రపోతోంది. గదికి అవతల గుమ్మందగ్గర పాలేరు సన్నగా గురక పెడుతున్నాడు.

ఆ శబ్దాలు ఉండీ, ఉడిగీ వినిపిస్తున్నాయి.

"సూరయ్యా! సూరయ్యా!" గట్టిగా పిలిచాడు రాజారావు.

మొదటి పిలుపుతో చెల్లెలు జానకీ, రెండో పిలుపుతో సూరయ్య నిద్రలేచారు.

"నేనే! రాజారావుని. చూడు! బయట ఏదో చప్పుడవుతోంది..."

వెంటనే తలపాగా దులిపి మళ్ళీ ఆ తువ్వాలును తలకు చుట్టుకొని, కర్రతో సహా బయటకి నడిచాడు సూరయ్య నిశ్శబ్దంగా తలుపుతీసి.

"ఎంతసేపైంది నువ్వులేచి" అంది జానకి.

"ఇప్పుడే! అదుగో - విను ఆ శబ్దాలు..."

జానకి జాగ్రత్తగా వింది.

"అవును! ఎవరూ? దొంగలంటావా?" జానకి కంగారుపడింది.

"భయపడకు. సూరయ్య వెళ్ళాడుగా..."

తాపీగా సిగరెట్టు ముట్టించాడు రాజారావు. సూరయ్య ఆ కిటికీ దగ్గరకు రావటానికి పట్టే వ్యవధిలో జానకి మంచం దిగి బట్టలు సర్దుకుంటూ రాజారావు దగ్గరికి వచ్చి నిలబడింది.

ఆ నిశ్శబ్దంలో సూరయ్య కర్రను నేలకు బాదిన చప్పుడు రాజారావుకు, ముఖ్యంగా జానకికి నిద్రమత్తును పూర్తిగా వదిలించింది.

"ఎవర్రా అక్కడ?"

నిర్భీతితో ఖంగుమన్న అతని కంఠం జానకికి అన్న పక్కనే ఉన్న దానికంటే ఎక్కువ ధైర్యాన్నిచ్చింది. సూరయ్య రెండు అడుగులు ముందుకువేసి మళ్ళీ కర్రను తాటించాడు.

"ఏమయిందిరా ... తాగావా?"

సూరయ్య కర్రను నేలమీద పెట్టిన చప్పుడు కర కర కణ కణా వినిపించింది.

"వాడెవడో తాగుబోతు వెధవ" అన్నాడు రాజారావు-జానకిని ఉద్దేశించి.

అన్న కంఠంలోంచి పారిపోతున్న ఆదుర్దాను గమనించి జానకి స్థిమితపడింది.

అంతలో...

ఒక్క ఉదుటున కర్ర అందుకొని ముందుకుదూకి పరుగెత్తుతున్న అడుగుల జడివాన, ఆ వెంటనే మరింత ముందుగా పరుగెత్తుతున్న మరికొన్ని అడుగుల వేగం వినిపించాయి జానకికి, రాజారావుకు.

"ఎవ్వడ్రా ఆడు! పారిపోతన్నాడు... ఆగు..ఆగు" అంటున్న సూరయ్యకంఠం కూడా దూరంగా వీధిమలుపు తిరిగింది.

"దొంగలేమోరా అన్నయ్యా! సూరయ్య పరుగెత్తుకు వెళ్ళాడు" అంది జానకి-రాజారావుకు దగ్గరగా వస్తూ.

"ఆ బేటరీ లైటిలా ఇయ్యి... నేను కూడా వెళ్తాను" అంటూ రాజారావు కూడా కర్ర అందుకుని చెప్పులు తొడుక్కున్నాడు.

తన మంచం పక్కగా ఉన్న టేబుల్ మీది బేటరీ లైటు తీసింది జానకి.

"మళ్ళీ అవే శబ్దాలు" అంటూ జానకి చేతిలోని బేటరీలైటును అందుకొని మెత్తగా అడుగులు వేస్తూ బయటకి నడిచాడు రాజారావు. గబగబా పడకగది తలుపులు గడియవేసేసింది జానకి. రాజారావు కిటికీ బయట కిందగావున్న గచ్చు అరుగుమీదకు వచ్చినట్లు అతని చెప్పుల గరగరవల్ల జానకి అర్థం చేసుకుంది.

"ఏమిటన్నయ్యా" అంది లోపలివైపు కిటికీ దగ్గరికివచ్చి. అప్పటికే బేటరీలైటు వెలుగులో అరుగుమీద నుంచి కిందకు చూస్తున్నాడు రాజారావు. "జానకీ! లైటు వెయ్యి" మెల్లగానే చెప్పాడతను.

"అమ్మో! నాకు భయం...అవతల సావిట్లో ఉంది స్విచ్చి" అంది జానకి కిటికీ ఊచలను గట్టిగా పట్టుకుంటూ.

"కనీసం పడగ్గదిలో లైటయినా వెయ్యి! బయటకి వెలుగు పడుతుంది! సర్లే..నేనే బయటి లైటు వేస్తాలే"అంటూ వడివడిగా సావిట్లోకివచ్చి స్విచ్ ని టిక్కుమనిపించాడు. జానకి కిటికీలోంచి బయటి అరుగుకిందకు తొంగి చూసింది. ఏమీ కనిపించలేదు. అంతలో రాజారావు మళ్ళీ అక్కడికి వచ్చాడు. లైటు వెలుగులో అన్నయ్య సన్నగా నిట్టూర్చటం చూసి "ఇంతకీ ఏమిటిట" అనడిగింది జానకి అసహనంగా.

"తూర్పు పేటలో వాడనుకుంటాను. తాగాడో..మరేమిటో..నేలమీద వెల్లకిలా పడి వున్నాడు. లేచినిలబడాలని ప్రయత్నిస్తున్నాడు. కాళ్ళూ, చేతులూ స్వాధీనములో లేవేమో మరి" అదే అరుగు కిందకు పరీక్షగా చూస్తూ అక్కడి దృశ్యాన్ని విడమరిచి చెప్పాడు రాజారావు.

"మూర్చరోగేమో! నీళ్లతేనా బిందెతో" జాలిగా అడిగింది జానకి.

"ఆగు...ఏమిటా తొందర" అంటూ ఇంకా పూర్తిగా విసుక్కోకుండానే సూరయ్య వగురుస్తూ, పరుగెత్తుకుంటూ వెనక్కి తిరిగి వచ్చేశాడు.

"ఏంట్రా సూరయ్యా...ఎక్కడికి పరుగెత్తుకెళ్ళావ్"ముందుగా జానకే అడిగింది కిటికీలోంచి.

రెండుక్షణాలు ఊపిరి తీసుకొనేందుకు ఆగి "ఆదెవడోనండి...లం......పారిపోయేడు. నేను ఈడెవడో అని చూత్తన్నాను...అంతలో ఆడు పరుగెత్తేశాడు.

ముసలమ్మ గుడిదాకా ఎంట పడ్డానండి. అక్కడాడు ఏ సందులోకో తప్పించేసు కున్నాడండీ" అన్నాడు సూరయ్య.

"వీడిసంగతేమిటి ? తూర్పుపేటేనా వీడిది" అరుగుమీదనుంచి కిందకు చూస్తూ అడిగాడు రాజారావు.

"అవునండి. ఏంటండి ఈడు ఇలా కొట్టేసుకుంటున్నాడు. తాగేసినట్టులేదండి. మూర్ఛరోగమని కూడా అనిపించటం లేదండి"

పరీక్షగా తానుకూడా వాడిని చూడ సాగాడు. వాడు ఇంకా కొట్టుకుంటూనే వున్నాడు.

"ఈడు పెద్ద అప్పిగాడి కొడుకు రాములండి...ఈడు, ఈళ్ళ బామ్మర్ది కలిసి సంతలకి బళ్ళు తోలతా రండి"

జానకి గుండె చిక్కబట్టుకుని పడక గదిలో లైటువేసి, తలుపు తీసుకొని బయటకువచ్చింది. సావిట్లోనూ, ఇంట్లోని మిగతా గదుల్లోనూ లైట్లువేసింది. అడుగులో అడుగు వేసుకొంటూ వచ్చి రాజారావు పక్కగా నిలబడింది.

"సర్లే ! నువ్వెళ్ళి వాళ్ళ వాళ్ళ నెవర్నైనా రమ్మని చెప్పు. వచ్చేటప్పుడు డాక్టరుగారిని తీసుకురా. జానకీ! నువ్వెళ్ళి పడుకో. నేను ఇక్కడేవుంటాలే కాసేపు! అన్నట్టు ఆ సిగరెట్టు పెట్టి, అగ్గిపెట్టి కిటికీలోంచి ఇలాఇయ్యి" అన్నాడు రాజా రావు గబగబా.

తనకి అక్కడ ఉండాలని ఉంది కాని అన్నయ్య తిడతాడేమో ననిపించి అయిష్టంగానే లోపలికి వెళ్ళింది జానకి. సూరయ్యబొడ్లోంచి పొగాకుకాడ బయటకి తీసి చుట్టచుట్టుకోవటానికి పాయలు తీస్తూ తూర్పుపేట వైపు నడక సాగించాడు.

'ఏమయింది వీడికి' అనుకొన్నాడు రాజారావు మరోసారి తనలో తనే.

అంతలో అటువెపు పాలేరును వెంట బెట్టుకుని పొలం వెళ్తున్న సత్తిరెడ్డి వచ్చాడు.

"ఏవయింది రాజారావ్! ఈవేళప్పుడు అరుగుమీద నిలబడ్డావ్" అంటూ అరుగు కిందపడివున్న రాములిని చూశాడు సత్తి రెడ్డి.

"ఏంటీడు! ఇలాపడున్నాడు!మూర్ఛ రోగమా? ఒరే నారాయుడూ...సూడు"

సత్తిరెడ్డిపాలేరు నారాయుడు-రాముల దగ్గరగా వచ్చి చూశాడు.

రాములు అలా కొట్టుకుంటూండటాన్ని పరీక్షగా చూసి "ఏమోనండి! ఏం తెలవ టంలేదండీ" అన్నాడు నారాయుడు.

వారి మాటల సందడికి చుట్టుపక్కల వాళ్ళుకూడా లేచారు. ఆ ఇళ్ళ బయట లైట్లు వెలిగాయి. ఆ సందులో చీకటి చాలావరకూ అటూ ఇటూ పారిపోయింది. అందరూ గుమిగూడారు. జానకి కిటికీ లోంచి బయటవాళ్ళను చూడసాగింది.

"దెయ్యం పట్టినట్లుంది" అన్నాడు ఏభై ఏళ్ళ గోవిందయ్య.

"మూర్ఛరోగం కాదు. నోట్లోంచి నురగ రావటంలేదు" అన్నాడు గోవిం దయ్యకొడుకు ప్రకాశరావు. అలోగా ఆ వార్త రెడ్డినాయుడికి తెలిసిపోయింది.

"పొద్దున్నే ఏంట్రా ఎదవగోల" అంటూ బద్ధకంగానే చిరాకుపడుతూ చుట్ట ముట్టించి జీతగాడితోపాటు రాజారావు ఇంటికి బయలుదేరాడు పక్కసందులో ఉంటున్న రెడ్డినాయుడు. అప్పటికి మరి కొంత ఊరు నిద్రలేచింది. రెడ్డినాయుడు అక్కడికి వచ్చేసరికి పెద్ద అప్పన్న, సూరయ్య, డాక్టరు కృష్ణమూర్తికూడా వచ్చారు. వస్తూనే సూరయ్య చెప్పాడు.

"తూర్పుపేటలో ఇలాంటోడే మరొ కడుకూడా ఇస్త్రితంగా ఆసనాలేత్తన్నా డండి ! నేనెళ్ళేసరికి ఈ అప్పిగాడు అక్కడే ఉన్నాడండి"

"వాడెవడు? ఆసనాలువేయటమేమిటి? రాజారావు అడిగాడు అనుమానంగా.

"ఏవోసండి! ఆడుకూడా మడిసి మనలో లేడండి. రెండుకాళ్ళూ మెళ్ళ మీదేసుకుని పిల్లిమొగ్గలేత్తన్నాడు. తల కిందులుగా నడిచేత్తన్నాడు. ముత్యాలు ...వెంకన్న.

రాజారావుకు సమాధానం చెబుతూనే పెద్దఅప్పన్న-కొడుకు రాముల్ని పరీక్షగా చూడసాగాడు. అంతక్రితమే తను వెంకన్నని చూసివచ్చాడు. వాడిప్రవర్తనకీ, కొడుకు ప్రవర్తనకీ సంబంధం కనిపించ లేదు అప్పన్నకి. వెంకన్న చేష్టలన్నీ పిచ్చి లక్షణాలుగా తోచాయతనికి. కాని రాములు...

'మూర్ఛేమో? ఛ...కాదు. పచ్చ వాతమూ కాదు. మరేంటి? పోలియో ఈ వయసులో వత్తాదా? రాదే...'

క్షణంపాటు తనకు తెలిసున్న పరిజ్ఞానంతో రాములు రోగాన్ని అంచనా వేయటానికి ప్రయత్నించాడు అప్పన్న. అతనికంతా అయోమయంగా అని పించింది.

జనం పెరిగారు. రణగొణధ్వని పెరిగింది.

గుసగుసగా చర్చలు...

"ఏమో! కాదేమో"

"అయితే అయి ఉండచ్చు"

"హఠాత్తుగా పిచ్చెక్కిందంటావా?"

"పిచ్చికాదు...గాడిదగుడ్డూ కాదు"

ఎవరికి తోచినట్లు వాళ్ళు వ్యాఖ్యానిస్తు న్నారు.

పెద్దఅప్పన్న దుఃఖం పెల్లుబికి వచ్చింది.

"ఏరా! ఏవైందిరా? ఒరే రావులూ... నేన్రా... నీ అయ్యని. అదేంట్రా! అలా కాళ్ళూ సేతులూ కొట్టేసుకుంటా వేంట్రా..." అంటూనే రాముల్ని రెండు జబ్బలూ పట్టుకుని పైకిలేపి నిలబెట్ట బోయాడు. కాళ్ళలో పట్టులేక పడిపో బోయాడు రాములు. సూరయ్య అసం కల్పితంగా రెండు అడుగులు ముందుకు వేసి వాడిని రెండోవైపు పట్టుకున్నాడు.

తూర్పుపేటలోనుంచీ, పాతవీధి నుంచీ, రెడ్డినాయుడు సందులోంచీ, పెద్దగరువు నుంచీ గుంపులు గుంపులుగా జనం రాజారావు ఇంటికి రాసాగారు.

వాళ్ళలో కొందరు అప్పటికే వెంకన్నని చూశారు.

వెంకన్నని చూడనివాళ్ళకి వాడి విన్యాసాలని వర్ణించి చెబుతున్నారు.

కలకలం ఎక్కువయింది.

అరుగుమీద తువ్వాలుపరిచి రాములుని పడుకోబెట్టారు సూరయ్య, అప్పన్న.

డాక్టర్ కృష్ణమూర్తి - రాములుని పరీక్షించసాగాడు. నాడి చూశాడు. స్టెత్‌కి పని చెప్పాడు.

రాజారావు చేతిలోని బ్యాటరీలైటుతో రాములి కళ్ళు, నాలిక పరిశీలించాడు.

మరోసారి రాముల్ని ఆపాదమస్తకం చూసి అతని చేతిని తిన్నగా సరిచేయ బోయాడు.

సాధ్యం కాలేదు.

"కాసిని వేడినీళ్ళు కావాలి. ఇంజక్షన్ చేస్తాను" అన్నాడు డాక్టర్ కృష్ణమూర్తి రాజారావుతో.

"ఓ ఎస్. అలాగే..." అని, కిటికీ

దగ్గరగా వెళ్ళి బయటనుంచే జానకితో "కాసిని వేడినీళ్లు పెట్టు" అన్నాడు రాజారావు.

"ఉండండి! నేను ఎల్తాను" అంటూ సూరయ్య లోపలికి వెళ్ళాడు.

"ఇంతకి ఏమయిందట ఈడికి"

రెడ్డినాయుడు ఉండబట్టలేకపోయాడు. తను అడగకుండానే ఎందుకు చెప్ప లేదని డాక్టరును బెదిరిస్తున్నట్లు ధ్వనించిందా కంఠం.

రెడ్డినాయుడి ప్రశ్నకు డాక్టరు ఏం జవాబు చెబుతాడో వినాలని అందరూ రెండుక్షణాలు నోళ్ళకు తాళాలు వేశారు.

డాక్టర్ కృష్ణమూర్తి చిన్న ఇంజక్షను సీసాను బొటనవేలు, చూపుడువేలు మధ్య ఉంచి అటూ ఇటూ బలంగా కుదుపుతూ రాజారావు వైపు రెండు అడుగులు వేసి అతనికే చెబుతున్నట్లు అన్నాడు-

"ఇప్పుడు ఇంజక్షను ఇస్తాను. పేషెంటు మూడు-నాలుగు గంటలు నిద్ర పోతాడు. ఆ తర్వాతగాని ఏ విషయం నిర్ధారణగా చెప్పలేను"

ఆ మాటలు గుంపులో వెనకగా నిల బడినవాళ్ళకి సరిగా వినిపించలేదు.

"ఏంట్రా... ఏంటంటన్నారు"

"నిన్నటిదాకా రాయిలా తిరిగినోడే కదరా..."

మళ్ళా రణగొణధ్వని పెరిగిపోయింది.

రెడ్డినాయుడు ముందుకు నాలుగు అడుగులు వేసి "ఏంటండి డాట్రుగారూ! రోగం ఏంటో సెప్పలేకపోతే మీరేం వైజ్జం సేత్తారు" అన్నాడు వెటకారాన్ని, పెద్దరికాన్ని కలగలుపుతూ.

సూరయ్య చిన్న అల్యూమినియం గిన్నెతో వేన్నీళ్లు తెచ్చాడు.

జానకి మళ్ళీ కిటికీ దగ్గరికి చేరింది.

"ఈడికేవయిందంట" అంటూఅప్పుడే వచ్చాడు తూర్పుపేట పెద్ద'బెమ్మంతాత'

"అక్కడ ఎంకన్న కేవయిందో ఈడికీ అదే అయ్యుంటది" అన్నాడు అప్పటికే రెండునిమిషాల క్రితం వచ్చిన రాములు బామ్మర్ది నాగులు.

డాక్టరు కృష్ణమూర్తి సిరంజిని వేడి నీళ్ళలో పడేసి సూదిని బాక్సులోంచి తీశాడు. తర్వాత సిరంజిని బయటకుతీసి సూది దానికి అమర్చి నీళ్లనే ఓసారి లోపలికి ఎక్కించి మళ్ళీబయటకి పిచికారి చేసేశాడు.

అందరూ ఆసక్తిగా కృష్ణమూర్తి వైపు చూస్తున్నారు. కాని కొందరికి లోలోపలే అనేక సందేహాలు గందర గోళ పరుస్తున్నాయి. రాములి జబ్బు ఇంజక్షనుకు లొంగేదికాదని వాళ్ళ అనుమానం.

ఏమంటే ఏం గొడవ వస్తుందో, ఎవరు తప్పు పడతారోనని వాళ్ళ భయం!

నాగులు మాత్రం భయపడదలుచుకో లేదు.

"రాజారావు బాబూ! ఇండీసను. సెయ్యొచ్చో సెయ్యకూడదోనండి... ఎందుకేనా మంచిది తెల్లారేదాకా సూద్దా వండి" అన్నాడు నాగులు.

"అంటే మేమంతా వెర్రివెధవలమనా నీఉద్దేశం? ఏ పని చెయ్యొచ్చో, ఏది చెయ్యకూడదో మాకు తెలియదా? పెద్ద చెప్పొచ్చాడు పెద్దమనిషి..." రాజారావు కోపంగా నాగులు మీద కేకలేశాడు.

దాంతో బ్రహ్మంతాత కలగచేసు కున్నాడు. "అదికాదండే! ఆడుసెప్పిందీ నిజవే. అవతల ఆ ఎంకన్నగాడి యెవ్వారం అదోలాఉంది...ఇక్కడ ఈడి ఇసయం ఇలా ఉంది. అసలు ఇది

మందులకు తగ్గే రోగవేనా అని నా, అను మానం..." రాజారావు సమాధానం కోసం ఆగాడు బ్రహ్మంతాత.

కాని గోవిందయ్య జవాబు చెప్పాడు–

"రోగాలు మందులకుకాక మంత్రాలకు తగ్గుతాయా? భలేవాడివే బ్రహ్మం తాతా" అన్నాడు గోవిందయ్య. అతను కూడా ఇంచుమించు బ్రహ్మంతాత వయసు వాడే!

"ఏవో! ఎవరి నమ్మకాలాళ్ళయి... అప్పన్నా! నీ ఇట్టంరా! మద్దెలో మా కెందుకు గొడవ"

రెడ్డినాయుడు రాజకీయం ప్రయోగించాడు.

అప్పటి వరకూ అప్పన్నకి ఆ ఆలోచనే రాలేదు. 'డాక్టరుగారు మందిస్తే ఈడికి నయవయిపోతుందిలే' అనుకొన్నాడు. రెడ్డినాయుడు మాటలు విని అతని మనసు ఏదో శంకించింది.

కాని కొడుకును ఆ స్థితిలో చూడలేక పోతున్నాడతను.

'అంతగా ఏవన్నా అయితే అప్పుడే చూసుకుందాం' అని నిర్ణయించుకున్నాడు.

"ఆల్ల మాటలకేంగానీండి... డాక్టరు



గారిని ఇండీసను ఇచ్చెయ్యమనండి"
అన్నాడు రాజారావు వైపు తిరిగి.

అప్పటికే ఇంజక్షను సిరంజి మందుతో సహా డాక్టర్ కృష్ణమూర్తి చేతుల్లో సిద్ధంగా ఉంది.

సూరయ్య, అప్పన్న, నాగులు-రాముల్ని కదలకుండా పట్టుకున్నారు.

డాక్టర్ కృష్ణమూర్తి కాంపోజ్ ఇంజక్షను చేశాడు రాములుకి.



రెడ్డినాయుడికి కోపం వచ్చేసింది.

"మీరూ మీరూ నిర్ణయం చేసుకొంటూంటే ఇంక మేవెందుకిక్కడ..." అంటూ కోపంగా తన ఇంటికి వెళ్ళిపోయాడు.

అప్పటికి తెల్లారింది.

"డాక్టరుగారూ! మనం లోపలికి వెళ్దాం రండి! కాస్త కాఫీ తాగి వెంకన్న ఇంటికి వెళ్దాం" అంటూ లోపలికి దారి తీశాడు రాజారావు.

కృష్ణమూర్తి అతన్ని అనుసరించాడు.

"ఒరే అప్పన్నా! నువ్వో, మీవోడో ఉండండిక్కడ..." అనేసి పాలు తీయటానికి సూరయ్య కూడా వెళ్ళిపోయాడు.

గోవిందయ్య, సత్తిరెడ్డి కూడా ఇంటి దోవపట్టారు. నారాయుడు పొలం వెళ్ళాడు.

రెడ్డినాయుడు వెళ్ళిపోవటంతో ఆయన సందులో వాళ్లు, పాత వీధి వాళ్ళు కూడా ఒక్కొక్కరు జారుకోసాగారు.

వాళ్ళలో ఒక్కొక్కళ్ళు ఒక్కోరకంగా తీర్మానించుకున్నారు. కొందరి అభిప్రాయాలు కలిశాయి. విభేదించిన వాళ్ళు తర్కించుకోసాగారు.

"తాతా! నువ్వెళ్లు. నీ మాట కాదన్నానని ఏవనుకోకు. ఈడు మనలో పడితే సాలని నా ఏడుపు. ఒరే నాగులూ! తాతని ఇంటికి తీసుకెళ్ళు. ఈడికాడ నేనుంటాలే" అన్నాడు అప్పన్న.

"అదే నేననేదిని. ఆడికి అమ్మోరో, గాలో, దూలో సోకుంటే మందులు ఇకటించి ఆడి పేణం మీద కొత్తడనే నా బగుం" అంటూ గొణుక్కుంటూ తూర్పు పేట వైపు బయలుదేరాడు 'బెమ్మంతాత'.

పెద్ద గవుపు మీది వాళ్ళూ, మిగతా వాళ్ళూ బ్రహ్మంతాతను అనుసరించ సాగారు.

రాజారావు, కృష్ణమూర్తి బయటకు వచ్చేసరికి రాములు దగ్గర అప్పన్న, రోడ్డు వెంటపోయే అతన్ని పరామర్శిస్తున్న నలుగురైదుగురు మాత్రమే ఉన్నారు.

"నిద్రపట్టినట్టుందండి" అన్నాడు అప్పన్న రాజారావుని ఉద్దేశించి.

"చూద్దాం... ఇంకో రెండు మూడు గంటల్లో మెలకువ వస్తుందని డాక్టరుగారు చెప్పారుకదా... ఈలోగా మేము వెంకన్న ఇంటికి వెళ్లొస్తాం"

రాజారావుతో వెనకే నడుస్తూ డాక్టరు కృష్ణమూర్తి-రాములు వైపు సంతృప్తిగా చూశాడు.

* * *

వెంకన్న పద్మాసనం వేసుకొని కూర్చున్నాడు.

ముత్యాలు కుళ్లి కుళ్లి ఏడుస్తోంది.

రాజారావును చూశాక ఆమె బాధ మరీ ఎక్కువయింది.

"నా పెనిమిటి కేవయిపోయిందీ నాయనోయ్! ఈడికేదో దెయ్యం పట్టింది దేవుడోయ్!" ముత్యాలు ఏడుపు తారస్థాయికి వచ్చింది.

"చచ! ఊరుకో... డాక్టరుగా రొచ్చారు" అంటూ ముత్యాలును సముదాయించింది పక్కింటి పరాలు.

ఏడెనిమండుగురు మాత్రమే అక్కడ చోద్యం చూస్తున్నారు.

వెంకన్న ఏదో యోగనిద్రలో ఉన్నట్లున్నాడు.

అక్కడ జరుగుతున్న హడావుడి వాణ్నేమీ కదిలించలేదు.

ఏదో మంత్రాల్లా గొణుగుతున్నాడు. శబ్దం మాత్రం బయటికి వస్తోంది.

వివరం తెలియటం లేదు.

డాక్టర్ కృష్ణమూర్తి జాగ్రత్తగా వెంకన్నని గమనిస్తున్నాడు.

వెంకన్న చేష్టల్ని, రాములి చేష్టల్ని బేరీజు వేయసాగాడు రాజారావు.

"వేరే టెస్ట్ చేయనక్కర్లేదు. ఇతనికీ ఆ ఇంజక్షను ఇవ్వటం అవసరం. కాని.."

కృష్ణమూర్తి మాటలు పూర్తయ్యేలోగా వెంకన్న హఠాత్తుగా లేచి నిలబడ్డాడు.

గబగబా ముత్యాలు కూడా లేచి నిలబడింది. వరాలు – ముత్యాలుకు సాయంగా కదిలింది.

"ఊఁ... హుప్"

"ఊఁ...హుప్" అంటూ రెండు చేతులూ నడుం మీద పెట్టుకుని గుంజీలు తీయసాగాడు.

"వెంకన్నా... వెంకన్నా!"

పలకరింపుగానే గట్టిగా కేకేశాడు రాజారావు.

"అయ్‌బాబోయ్! తెల్లారుజావు నుంచీ ఈడిలాగే సేత్తన్నాడండి.. తలకిందలుగా నడిసేత్తన్నాడండి."

వెంకన్న మనలో లేడని ముత్యాలు గుర్తు చేసింది.

అంతలో హఠాత్తుగా మళ్ళీ నేలమీద చతికిలబడ్డాడు వెంకన్న.

"హుప్... హుప్" అంటూ రెండు కాళ్ళనూ మెడమీదకు చేర్చాడు.

ఎడమ చేతి మీదుగా రెండు మొగ్గలు వేశాడు. మళ్ళా అలాగే కుడిచేతి మీదుగా రెండు మొగ్గలు వేశాడు.

"వీడిని కదలకుండా పట్టుకో... డాక్టరుగారు ఇంజెక్షను చేస్తారు"

రాజారావు మాటలు పూర్తవకుండానే ముత్యాలు, వరాలు – వెంకన్నని పట్టుకున్నారు.

"అదే నేను చెప్పబోయానిందాక! ఆ ఇంజక్షను మరొకటి లేదు నా దగ్గర. ఆసుపత్రిలో కూడా లేదు. ఎవర్నైనా పెంటపాడో, గూడెమో పంపి తెప్పించండి" డాక్టర్ కృష్ణమూర్తి సిగ్గుపడుతూ చెప్పాడు.

"అయ్యయ్యో! సర్లెండి... ఎవర్నైనా పంపిద్దాం! మీరు ఆసుపత్రిలో ఉంటారు కదా! ఇంజక్షను బాటిలు తెచ్చి మీకు ఇమ్మని చెబుతాను"

రాజారావు చుట్టూ చూశాడు–ఎవర్ని పంపిద్దామా అని!

నాగులు కనిపించాడు.

"నాగులూ! ఇలారా! ఇంజక్షను ఒకటి ఉంటే మీ రాములికి చేసేశారట. నువ్వు సైకిలు మీద పెంటపాడు వెళ్ళి మందులు పట్రా!"

కృష్ణమూర్తి ఇంజక్షన్ రాసిచ్చాడు.

కాని నాగులు వెళ్ళటానికి ఇష్టపడ లేదు. పైగా–

"నేనెల్లటవేంటండి! అవతల మా వాడికి పేనమ్మీదికొత్తే... ఎవర్నైనా పంపండి" అన్నాడు.

"వాడి ప్రాణాలకు నీ ప్రాణాలేమీ అడ్డెయ్యక్కర్లేదు కాని నువ్వెళ్ళు" అంటూ గట్టిగా మందలిస్తూనే ప్రిస్క్రిప్షను, డబ్బులూ ఇచ్చాడు రాజారావు.

అయిష్టంగానే అక్కడి నుండి కదిలాడు నాగులు.

"వీడిని ఎటూ పోనివ్వకు! కాస్సేపున్నాక డాక్టరుగారు వచ్చి ఇంజక్షను చేస్తారు. నువ్వు అనవసరంగా కంగారు పడకు" అనేసి రాజారావు డాక్టర్ కృష్ణమూర్తితోపాటు రోడ్డెక్కాడు.

వాళ్ళిద్దరూ పదడుగులు వేసేసరికి వెంకన్న తలకిందులుగా నడుచుకుంటూ

రోడ్డుమీదకు వచ్చేశాడు.

ఆశ్చర్యపోయాడు రాజారావు.

గబగబా ఎదరకు పరుగెత్తి వెంకన్నను పట్టుకొని బలవంతంగా ఇంటివరకు లాక్కెళ్లి కూర్చోపెట్టాడు రాజారావు. ఇద్దరు ముగ్గురు అతనికి సాయం చేశారు.

"మళ్లీ కదిలితే స్తంభానికి కట్టెయ్యండి" అన్నాడు రాజారావు కొంచెం ఒగురుస్తూ.

"మేం చూసుకుంటాం లెండి! మీరెళ్లండి! అవతల మీకేం పన్లున్నాయో పాపం" అంది ముత్యాలు.

మొగుణ్ని కట్టెయ్యమన్నందుకు తన మీద కోపంవచ్చి నిష్టూరంగా మాట్లాడిందని అర్థంచేసుకున్నాడు రాజారావు.

నిట్టూరుస్తూ వెనుతిరిగి కృష్ణమూర్తిని కలుసుకుని నడక సాగించాడు.

* * *

మెయిన్‌రోడ్డు మీదకు వచ్చి అద్దె సైకిలు తీసుకున్నాడు నాగులు.

ఊళ్ళోంచి రోడ్డుమీదకు వస్తున్నాడు ఎంతో మంది అతన్ని పలకరించారు. తన 'బామ్మర్ది' రాములి గురించి వివరాలు అడుగుతోంటే ఒక్కొక్కరికి ఒక్కోలా చెప్పసాగాడు నాగులు.

"ఏమోనండే! అదేంటో తెలియలేదు మాయదారి రోగం" అన్నాడొకడితో

"దెయ్యం పట్టినట్టుందండే" అన్నాడింకొకడితో.

"గాలో దూళో మనకేం తెలుత్తాది" అన్నాడు మరొకరితో.

ఇంకొందరితో "డాట్టుగారు ఇండీసనిచ్చారు. మరేం జరుగుతుందో సూడాలి"



అన్నాడు.

ఇంకా స్పృహలో రాములికి తెలి వొస్తుందో రాదో తెలుసుకోవాలని నాగులికి ఆతృతగా ఉంది. అందుకే ఆఘ మేఘాలమీద సైకిలును పరిగెత్తించాడు. అరగంట తిరక్కుండా మళ్ళీ ముదునూరు వచ్చేసి షాపులో సైకిలు ఇచ్చేసి ఆసు పత్రిలోనే ఓ గదిలో ఉంటున్న డాక్టరుకు మందులు ఇచ్చేశాడు.

పరుగులాంటి నడకతో రాజారావు ఇంటికి వచ్చేశాడు నాగులు.

పెద్ద అప్పన్న, రాజారావు రాములిని గమనిస్తున్నారు.

రాములికి ఇంకా స్పృహ రాలేదు.

తొమ్మిదయింది.

స్కూలుకు వెళుతున్న పిల్లలు మాత్రం గుంపులు గుంపులుగా వచ్చి రాములిని చూసిపోతున్నారు.

"నువ్వు ఇంటికెళ్ళి మొహం కడు క్కుని కాఫీ తాగిరా...నేను ఉంటాలే ఈడికాడ" అన్నాడు నాగులు అప్పన్నను ఉద్దేశించి.

తను రాములిని, మొదట చూసినప్ప టికీ, ఇప్పటికీ పరిస్థితిలో తేడా కనిపిం చింది అప్పన్నకి.

మత్తుమందిచ్చాక సాఫీగా పడుకు న్నాడు రాములు. కొంచెం ధైర్యం వచ్చింది అప్పన్నకి.

"సరే" అని వెళ్ళిపోయాడు అప్పన్న.

"డాక్టరుగారికి మందులు ఇచ్చేశావా?" రాజారావు అడిగాడు నాగుల్ని.

"ఆఁ! ఇదిగో చిల్లర"

బనీను జేబులోంచి చిల్లర తీసి నిర్ల క్ష్యంగా అరుగుమీద పెట్టాడు నాగులు.

"రాములికి మెలకువవస్తే చెప్పు. నేను లోపల ఉంటాను" అనేసి రాజారావు లోపలికి వెళ్ళిపోయాడు.

పిల్లలు "ఏమయ్యింది? దెయ్యం పట్టిం దిట్టకదా" అంటూ నాగులును వివరాలు అడగసాగారు.

"మీరెళ్లండెహె" అంటూ వాళ్లని కసురుకున్నాడు నాగులు.

రాజారావు పేపరు చదువుకుంటూ పావుగంట తరువాత అలసటగా మగత లోకి జారాడు. జానకి అప్పటికే వంట చేసేసి, పుస్తకాలు సర్దుకుని సైకిలు బయటకు తీసింది. సూరయ్య పొలం వెళ్లాడు.

నిద్రపోతున్న అన్నయ్యని లేపాలా, వద్దా అని ఓ క్షణంపాటు సందేహించింది. తరువాత మెల్లిగా అతన్ని తట్టి లేపి "నేను స్కూలుకు వెళుతున్నాను" అంది.

తలుపు లోపల గడియపెట్టి మళ్ళీ బద్ధ కంగా నిద్రలోకి జారుకున్నాడు రాజా రావు.

"ఏవిటి నాగులూ! ఒక్కడివే కూర్చు న్నావ్" అంటూ నాగులును జానకి పలక రించటం వరకూ జ్ఞాపకముంది రాజా రావుకు.

జానకి పెంటపాడు స్కూల్లో టెంత్ చదువుతోంది. ముదునూరుకు, పెంట పాడుకూ మధ్య దూరం మూడుమైళ్ళు. ఆ వూరునుంచి నలుగురు ఆడపిల్లలు, పది మంది మగపిల్లలూ రోజూ సైకిళ్ళమీదే పెంటపాడు వెళ్ళవస్తారు. మగపిల్లల్లో నలుగురు కాలేజీలో చదువుతున్నారు.

రెడ్డినాయుడి మనవరాలు రాజేశ్వరి కోసం ఎదురుచూడసాగింది జానకి.

సైకిలును రోడ్డుమీద పెట్టి తను రెండో అరుగుమీద కూర్చుంది. ఊరికే కూర్చో వటం ఎందుకని నాగులును పలకరించింది.

తెల్లవారుఝామున రాములు చేసిన

శబ్దాలకు జానకి భయపడింది.

ఆ ధ్వనులు జ్ఞాపకం వచ్చేసరికి జానకి గుండె మళ్ళీ ఝల్లుమంది.

"చచ్చేంత భయమేసిందనుకో పొద్దున్న" అంది జానకి నాగులుతో.

"అవునండి మరి! అర్ధరాత్రేల అదాటుగా నిద్రలేస్తే భయమెయ్యదండిమరి" అన్నాడు నాగులు.

రెడ్డినాయుడు మనవరాలు రాజేశ్వరి రావటంతో జానకి సైకిలు ఎక్కింది.

కాని ఫెడలు జారటంతో జానకి చేతుల్లోంచి అదుపుతప్పి సైకిలు పడిపోయింది. తను పడటంతోపాటు రాజేశ్వరి సైకిలును కూడా పడేసింది జానకి సైకిలు.

జానకి, రాజేశ్వరి మాత్రం కింద పడలేదు.

సైకిళ్ల పడిన శబ్దానికి రాజారావుకు బద్ధకం వదిలిపోయి బయటకు వచ్చాడు.

అప్పటికి సైకిళ్ళను పైకి లేవదీసి హేండిల్ బారు వంకరను సరిచేస్తున్నారు జానకీ, రాజేశ్వరీ.

"కొంచెం జాగ్రత్తగా వెళ్ళండి! ఏపంత కంగారు" జానకిని మందలించాడు రాజారావు.

రాజేశ్వరి, జానకి వెళ్లిపోయారు.

రాజారావు సిగరెట్టు వెలిగించి రెండో అరుగుమీద కూర్చున్నాడు. ఆ ఇంటికి పడమటి ముఖద్వారం ఉండటంతో అరుగు మీద ఎండ పడటంలేదు.

రాములు బద్ధకంగా అటూ ఇటూ కదలటం గమనించాడు రాజారావు.

"ఒరే! రాములూ...రాములూ! ఎలాగుందిరా?"

రాములుని తట్టి లేపుతూ కేకేశాడు నాగులు.

పాతిక ముప్పై లంఖణాలు చేసిన వాడిలా నీరసంగా మెలకువ తెచ్చుకున్నాడు రాములు. ముందుగా రాజారావు కనిపించాడు.

మెల్లిగా తల పక్కకు తిప్పి ఆతర్వాత నాగులును చూశాడు. రాజారావు ఇంటి అరుగుమీద తాను ఎందుకు అలా పడుకొని ఉన్నాడో రాములికి అర్థంకాలేదు. నిదానంగా లేచి కూర్చుని గోడకు జార్లబడ్డాడు. నాగులు వాడికి సాయంచేశాడు.

"రాములూ! ఎలా ఉందిరా?"

రాజారావు పలకరించాడు.

"నీరసంగా ఉందండి! ఏటండి నేసి ఉన్నాను...!"

ఏంట్రా నాగులూ? ఏంటలా తెల్ల మొహమేత్తన్నావ్?"

నూతిలోంచి వినిపించినట్లుంది రాముల స్వరం. అప్పటికి అప్పన్న తిరిగి వచ్చేశాడు. అతనితోపాటు రాములు భార్య పేరంటాలు కూడా వచ్చింది.

"పెరట్లో పొయ్యిదగ్గర దాలిలో పాల న్నాయి! గ్లాసులోపోసి తీసుకువచ్చి వీడికియ్యి" అన్నాడు రాజారావు పేరంటాలుతో.

ఆమె లోపలికి వెళ్ళింది.

"ఏంట్రా! రాతిరెక్కడికెల్లావ్? ఈడ పడిపోయావేమిటి? ఇప్పుడెలా వుంది?" అప్పన్నకొడుకును పరామర్శించసాగాడు

నాగులు మాత్రం ఆందోళనతో ఉక్కిరిబిక్కిరవుతున్నట్లు కనిపించాడు.

గట్టిగా బిగించేసిన నట్లు మెల్లిమెల్లిగ వదులు చేస్తున్నట్టు అనిపించసాగింది రాములుకి. కూర్చోవటానికి, మాట్లాడటానికి చాలా ప్రయాసపడుతున్నాడు.

రాములుకి స్పృహ రావటం గమనించి మళ్ళీ జనం మూగసాగారు.

"తెలివొచ్చేసిందీడికి"



"అయ్ బాబోయ్! రాతిరి సూడాల్సిం దీణ్ని! మనలో లేడసలు"

"కాళ్లూ సేతులూ కొట్టేసుకొంటూ సిన్నపిల్లాడిలా ఉంగా ఉంగా అంటూ ఒకటే బాధపడిపోయాడు"

"ఒక్క రాతిరికే ఎంత నీరసపడి పోయాడో"

వాళ్ళందరూ తనగురించే అలా అంటు న్నారని రాములు అర్థంచేసుకున్నాడు.

వాడిని ఆ పరిస్థితిలో వీధిలో ఉంచటం మంచిదికాదని రాజారావు "నాగులూ! వీడిని సావిట్లోకి తీసుకురండి" అన్నాడు.

అప్పన్న, నాగులు-రాములునిపట్టుకొని మెల్లిగా సావిట్లోకి నడిపించుకువెళ్లి బల్లపై కూర్చొబెట్టారు.

"నేను కూరుసోలేనండి!" అంటూ నడుం వాల్చాడు రాములు.

బయట చేరిన జనం గుమ్మం దగ్గిర మూగారు.

పేరంటాలు గ్లాసులో వేడిగా పాలు తీసుకువచ్చింది.

ఓపిక తెచ్చుకుని కూర్చుని పాలు తాగాడు రాములు.

మళ్ళీ బల్లమీదే వెల్లకిలా పడుకు న్నాడు. అప్పన్న తన తువ్వాలును కొడుకు తలకింద వత్తుపెట్టాడు.

"వాణ్ని కాస్సేపు మాట్లాడించకండి. నాగులూ! నువ్వెళ్లి డాక్టరుగారిని పిలుచు కురా! ముందు వెంకన్న ఇంటి దగ్గర చూడు. ఇంజక్షను చేయటానికి ఆయన అక్కడికి వెళ్లి ఉండవచ్చు" అన్నాడు రాజారావు.

ధుమధుమలాడుతూ నాగులు బయ టకు వచ్చి రోడ్డెక్కాడు.

గుమ్మం దగ్గిర మూగిన జనాన్ని అప్పన్న పంపించేశాడు.

పేరంటాలు, అప్పన్న రాములు దగ్గర బల్లమీదే చెరో పక్కన కూర్చున్నారు. అతని పరిస్థితిని గమనిస్తూ రాజారావు సావిట్లోనే ఓ పక్కగా స్టూలు వేసుకుని కూర్చున్నాడు.

రాములుకు కొంచెం కొంచెంగా అంతా జ్ఞాపకం రాసాగింది.

నాగులు, రాములు, వెంకన్న క్రితం రాత్రి 9 గంటలకి కబుర్లు చెప్పుకుంటూ మెయిన్ రోడ్డు వరకూ వెళ్లారు. రోడ్డు వారగా ఉన్న కిళ్లీ కొట్టులో బీడీలు కొనుక్కొని ఆ కొట్టు పక్కగా ఉన్న ఆంజనేయస్వామి గుడి అరుగుమీద కూర్చుని లోకాభిరామాయణం మొదలుపెట్టారు.

పావుగంట గడిచింది. రెడ్డినాయుడి పాలేరు, సీతయ్య అటు వచ్చాడు.

సీతయ్య రావటంతోనే నాగులు "మీరు ఇక్కడే ఉండండ్రా! ఇప్పుడే వత్తాను" అంటూ సీతయ్యతో కలిసి చిలకంపాడు బాకులకేసి నడిచి వెళ్ళిపోయాడు.

అప్పటివరకూ నాగులు-వెంకన్నకీ, రాములుకీ దెయ్యాలూ, భూతాలు, చేతబడుల కథలు చెప్పాడు.

నాగులు వెళ్లిపోయినతర్వాత రాములు, వెంకన్న వాటిగురించే చర్చించుకున్నారు.

"నాకుమాత్రం సచ్చే బయవనుకో! దెయ్యాలు, భూతాలు పట్టుకుంటే మడుసులు అరుసుకుపోతారంట" అన్నాడు రాములు.

"నాకూ బయమే! ఈ నాగులుగాడు సెప్పొద్దురా బాబూ అంటే ఇనడు. ఆడికెంతసేపూ ఆ ఊసే! పైగా ఆడికి ఆటిమీద నమ్మకంకూడా లేదంట" అన్నాడు వెంకన్న.

"మావోడికి అన్నిసయాలూ తెలుసు మా తులసమ్మక్క సచ్చిపోకముందుమేము ఎప్పుడేనా ఆళ్ళూరు కెళ్తే ఎన్ని కబుర్లు సెప్పేవోడో! అదుచ్చిపోయినా మా మీద అభిమానం కొద్దీ ఆడు మాకాడే ఉండిపోయాడు. ఆడికీ ఎనకాముందు ఎవరూ లేరు పాపం" అంటూ రాములు నాగులు మీద జాలిపడ్డాడు.

"అదికాదొరే! దెయ్యాలో, బూతాలో పట్టినప్పుడు మనకి ఎక్కడిలేని బలవూ వత్తాదంట! మనకు తెలీని ఎన్నో ఇద్దెలు వచ్చేత్తాయంట! అయన్నీ దెయ్యాల మెమేసనంట" నాగులు చెప్పిన కథల ప్రభావంలో మైమరిచిపోతూ అన్నాడు వెంకన్న.

"పోనియ్యెహె! ఎదవకబుర్లు! రేపాది వోరానికి బేరం దొరికిందా?" మాట తప్పిస్తూ రాములు అడిగాడు.

రాములూ, వెంకన్న ఆదివారం నుంచి బుధవారం వరకూ బళ్ళను అద్దెకు తోలి గురువారం నాటికి ఇంటికివచ్చేస్తారు. శుక్రవారం, శనివారం ఎడ్లకి విశ్రాంతి ఇచ్చి, బళ్ళకు అవసరమైతే చిన్న చిన్న మరమ్మత్తు చేసుకుంటారు. ముదునూర్లో అలాంటివాళ్లు మరో పదిమంది వరకూ ఉన్నారు.

"అత్తిలి సావుకార్లు మరీ అన్యాయం సేసేత్తన్నార్రా? పదేళ్ళ నుంచీ ఒకటే రేటు. గూడెం నుంచి గణపారం బండి కట్టుకెళ్లే ఏబైఇత్తన్నారు. నువ్వు ఇంటెపు రావు. నీపనే నయం"

బేరం దొరికిందో లేదో చెప్పకుండా తప్పించుకోజూశాడు వెంకన్న.

నాగులు మళ్ళీ అక్కడికి రావటంతో వారి సంభాషణ ఆగిపోయింది.

అడపా దడపా లారీలు, ఆర్.టి.సి

బస్సులు వస్తూ పోతున్నాయి. ఒకళ్ళో ఇద్దరో సైకిళ్ళ మీద అటూ ఇటూ పోతున్నారు.

ఇంచుమించు ఊరంతా సద్దుమణిగింది.

"అవునొరే... ఎంకన్నా! ఇయాలా, రేపా అమాస... మరీ సీకటిగా ఉంది"

నాగులు ధర్మ సందేహాన్ని వెంకన్న తీర్చలేకపోయాడు. రాములే చెప్పాడు మర్నాడు 'అమాస' అని.

"ఎందుకేనా మంచిది నడండెహె! పోదాం" అన్నాడు వెంకన్న భయం భయంగా.

"ఏటంత కంగారూ! అప్పుడే నిద్ర ముంచుకొచ్చేత్తందేటి?"

నాగులు వెంకన్నని వారించాడు.

"వారం నుంచీ ఊళ్ళో లేడుకదా! ఆళ్ళ ఆడోళ్ళేవన్నా అంటారేమో!"

రాములు వేళాకోళం ఆడాడు వెంకన్నని.

"శ...శ! అదేంలేదు!"

సిగ్గుపడుతూనే బీడీ ముట్టించాడు వెంకన్న.

"ఒరే! నాకు కడుపు ఉబ్బుకొచ్చేత్తోంది... అటెంపు ఎల్దాం! సాయం రండ్రా" అంటూ నాగులు మెయిన్‌రోడ్డు మీద చిలకంపాడు వైపు గబగబా అడుగులు వేయసాగాడు.

రాములు, వెంకన్న-నాగులు వెనకాలే బయల్దేరారు.

నాగులు కొంత దూరం వెళ్ళాక ఖాకీలాగు బెల్టు విప్పి రోడ్డు వారగా పల్లంలోకి దిగి కూర్చున్నాడు.

అతన్ని దాటి మరికాస్త ముందుకు వెళ్ళి మైలురాయి దగ్గర ఆగారు రాములు, వెంకన్న.

ఇద్దరూ రోడ్డు మీదే అంచులో పక్కపక్కగా కూర్చున్నారు.

రాములు కాళ్లు బార్లా చాపి, చేతులు వెనక్కు పెట్టి కాలుమీద కాలు వేశాడు.

వెంకన్న కూడా అలాగే చతికిలబడి చేతులు వెనక్కు చాపి కాళ్లు ఎదరకు బార్లా చాపాడు.

వాళ్లు అటువైపు ఎప్పుడు వచ్చినా ఆ మైలురాయి దగ్గిరే అలాగే కూర్చోవటం అలవాటు. వాళ్ళ కాళ్ళ మడమలకి చిన్న చిన్న రాళ్ళలాంటివి గుచ్చుకుంటున్నాయి. వాటిని మడమలతోనే చెల్లాచెదరు చేసి సాపీగా కూర్చున్నారు.

అప్పుడే ఓ లారీ అటువైపు వచ్చింది. లారీ బాగా దగ్గిరగా వచ్చాక ఇద్దరూ ఎడమ చెయ్యి ఆధారంగా చేసుకొని కాళ్లు కదపకుండా ముందుకు జరిగారు.

లారీ దూసుకు వెళ్ళిపోయింది. ఆ వెలుగులో తాము ఎక్కడ కూర్చున్నారో చూశాడు వెంకన్న.

"అయ్యబాబోయ్."

ఉలిక్కిపడి లేచి నిలబడ్డాడు వెంకన్న.

"ఏంట్రా! ఏవయింది" అంటూ రాములు కూడా లేచి నిలబడ్డాడు.

వెంకన్న నోరు తడారిపోయింది. గుటకలుమింగుతూ "సూడు! సూడు!" అన్నాడు.

"ఏంట్రా! ఎక్కడ? ఏంటిసూడాలి?" చిరాకుపడ్డాడు రాములు.

"ఇదిగో? ఈడ...మన కాళ్ళకింద.."

కంగారుగా పక్కకు తప్పుకొని రాములు కూడా చూశాడు.

"అమ్మనాయనోయ్"

రాములు కూడా పెద్ద కేక పెట్టాడు.

అప్పటికి నాగులు కాలకృత్యం పూర్తయింది.

"ఏంటలా సిందులు తొక్కుతున్నారు? ఏవయింది?"

నాగులు వేళాకోళంగా అడిగాడు.

రాములు లేని ధైర్యం తెచ్చుకుంటూ–

"ఒరే నాగులూ! ఏంట్రా ఇది... ఈడ సూడు" అన్నాడు.

నాగులు అగ్గిపుల్ల గీసి చూశాడు.

అరగజం మేర, నలుచదరంగా...

నల్లటి ముగ్గులు...

చదరంలో ఏవో బొమ్మలు!

ముగ్గులు అస్తవ్యస్తంగా చెరిపేసి ఉన్నాయి.

చెరిగిన ముగ్గులకు పక్కనే అస్తవ్యస్తంగా బొగ్గులు...!

అగ్గిపుల్ల అరిపోయింది.

మరో పుల్ల వెలిగించాడు నాగులు.

రాములు, వెంకన్న ఒకరి ముఖాలు ఒకరు చూసుకొంటున్నారు.

"మీరు కాని ఈ ముగ్గుల్ని తొక్కేరేంట్రా" కంగారుగా అడిగాడు నాగులు.

"మేం సూడలేదు! ఈడ కూసున్నాం: రాళ్లు గుచ్చుకుంటున్నట్లనిపిస్తే కాళ్లతోనే సెల్లాసెదురు సేసేశాం..."

ఇద్దరూ ఒకేసారి చెప్పారు. వెంటనే చేత్తో అరికాళ్ళకు, మడమలకు అంటుకున్న నలుపును తుడిచేసుకోసాగారు.

గబగబా రోడ్డు పల్లంలోకి దిగి పంట కాలవలో కాళ్ళు కడిగేసుకున్నారు.

పంట కాలవలోంచి పైకి వస్తోంటే కాళ్ళకి బురద అయింది. మైలురాయికి ఆ బురదను తుడుచుకోసాగారు.

"ఒరే! నాగులూ! ఈడ ఇంకా ఏంటో ఉన్నాయిరోయ్"

గాభరాగా అరిచాడు రాములు.

బురదని మైలురాయికి పట్టిస్తోంటే ఆ పక్కనే ఉన్న కొబ్బరి చిప్పలకు వాళ్ళ కాళ్లు తగిలాయి. మరో అగ్గిపుల్ల వెలిగించి చూశాడు నాగులు.

"ఈట్లో ఎంట్రుకలు, గోళ్ళు ఉన్నాయిరోయ్"

నాగులు ఉత్సాహంగానే అన్నా, ఆ చెప్పటంలో కొంచెం బెదిరింపు కనిపించింది.

ముగ్గురూ ఒక్క అంగలో రోడ్డు మీదకు వచ్చేశారు.

పది దాటింది.

రాములుకి, వెంకన్నకు మనసు మనసులో లేదు.

"పెమాదవంటావా?"

వెంకన్న ఆందోళనగా అడిగాడు నాగులుని.

"ఏవో! నేనేం సెప్పను! సేతబడి సేసేవోళ్లు ఇలాగే సేతారు. అయినా మీకు బయవేంట్రా! మీకు ఎవరు సేతారు సేతబడి! మీకు కిట్టనోళ్లెవరూ లేరు కదా" ధైర్యం చెప్పాడు నాగులు.

రాములు నోటమాట లేదు.మనసులో కలవర పడిపోతున్నాడు

మళ్లీ ముగ్గురూ కిళ్లీకొట్టు దగ్గరకు వచ్చారు. అప్పటికే కిళ్లీకొట్టు కట్టేసి వుంది. భయం భయంగా, బాసిం పట్టు వేసి గుడి అరుగుమీద కూర్చున్నాడు వెంకన్న. రాములు నిశ్చేష్టుడై అలాగే నిలబడి ఉన్నాడు. నాగులు వెంకన్న పక్కకు చేరి బీడీ ముట్టించాడు.

"ఎంతసేపలానిలబడతావ్! కూకో! బయవేనా తగ్గుద్ది" అంటూ నాగులు రాములుని చెయ్యిపట్టుకు లాగి పక్కనే కూర్చోపెట్టుకున్నాడు.

తీవ్రంగా ఆలోచిస్తూ అలాగే కూర్చుండిపోయాడు వెంకన్న.

"ఏంట్రా! తపస్సు సేసేవోళ్ళా కూసుండిపోయావేంటి? బీడీయేనా కాల్చు"

నాగులు వెంకన్నకి బీడీ ఇచ్చాడు. అనాలోచితంగానే వెంకన్న బీడీ అందుకున్నాడు.

బీడీ నాగులే అంటించాడు. బాసింపట్టు మీదే నిటారుగా కూర్చున్నాడు నాగులు.

అరుగుమీదే గొంతుకూర్చున్నట్లు ముణగ దీసుకుని కూర్చుని మోకాళ్లమీద గెడ్డం పెట్టి ఆలోచించసాగాడు రాములు.

"అచ్చం ఈడు ఆసనాలేత్తున్నట్లు కూకున్నాడు"

నాగులు అలా అనేసరికి మామూలుగా సర్దుకున్నాడు వెంకన్న.

"నీకేవయిందిరా రాములూ! అలా బిగుసుకుపోయావేంటి"

రాములుకి ఆ మాటలు వినిపించ లేదు. వాడిని కుదిపాడు నాగులు.

"ఆఁ...ఏం లేదు"

తొట్రుపడ్డాడు రాములు.

"సర్లెండి! నడవండి ఇళ్లకు పోదాం! గొప్ప మొగోళ్లే"

వేళాకోళంచేస్తూ నాగులు-రాముల్ని, వెంకన్ననీ బయలుదేరదీశాడు.

"సాలా పొద్దోయింది! ఈణ్ణింటికాడ దిగెట్టి మన వెల్దాం" అన్నాడు నాగులు.

"అబ్బే! నాకేం బయం. నేనెల్లిపోతాను... మీరెల్లిరండి"

వెంకన్న మేకపోతు ధైర్యం ప్రదర్శించాడు.

కాని రాములు, నాగులు- వెంకన్నను ఇంటి వరకూ దిగబెట్టారు.

నాగులు బీడీమీద బీడీ కాల్చసాగాడు.

రాములు మనసులో ఏదో శంక...అనాసక్తంగా ఉన్నాడు.

హఠాత్తుగా "నాకేదోలా ఉందెహె" అన్నాడు రాములు.

"ఏదోలా ఉండటవేటి? ఓర్నీయవ్వా! ఇంకా అదే ఆలోసిత్తన్నావా? ఛ! ఛ! అయన్నీ మర్సిపో ... మనకేం కాదు" ధైర్యం చెప్పాడు నాగులు.

ఊరు పూర్తిగా నిద్రపోయింది. తాడేపల్లిగూడెంలో సెకండ్‌షో సినిమా చూసివచ్చిన నలుగురైదుగురు సైకిళ్లమీద అటువైపు వెళ్లారు.

"కాళ్ళూ, సేతులూ దిగలాగెత్తన్నయ్"

నాగులు ఆదివరకు చెప్పిన విషయాలన్నీ గుర్తుకు రాసాగాయి రాములుకి.

నాగులేమీ మాట్లాడలేదు.

"ఏటలా కాళ్లూ సేతులూ సచ్చుబడిపోయినట్లు మెల్లిగా నడుత్తావ్ ... తొరతొరగా నడెహె! మంచి నిద్దరొత్తంది"

నాగులు వడివడిగా అడుగులు వేశాడు. రాములు వెనకబడి పోయాడు. నడుస్తున్నవాడల్లా హఠాత్తుగా కూర్చుండిపోవడం వరకూ బాగానే గుర్తుంది రాములుకి.

తరవాత నోరు రెండు దవళ్లనూ ఎవరో పట్టి బలవంతంగా దగ్గరకు నొక్కేస్తున్నట్లనిపించింది.

కూర్చున్నవాడల్లా వెల్లకితలా పడిపోయాడు.

రాములు దబ్బున కిందపడటంతో నాగులు వెనక్కి వచ్చాడు.

* * *

"రాత్రి మసీదిలో పడిపోయానుగదా! ఈడకెలా వచ్చాను?"

అస్పష్టంగా గొణుక్కున్నాడు రాములు. ఆ విషయాలన్నీ జ్ఞాపకం రావటంతో వాడిలో మళ్లీ భయం ఆవహించింది. ఎవరో ఆదేశిస్తున్నట్లుగా రాములు

మళ్ళీ మెల్లిగా కాళ్ళూ, చేతులూ ముణగ దీసుకోసాగాడు.

అప్పన్న, పేరంటాలు, రాజారావు రాముల్ని చూస్తూనే ఉన్నారు.

"అదే..."

"అ...దే..."

"అ...అ..."

"ఆ...అ..."

మళ్ళీ రాములుకి మాట పడిపోయింది. కాళ్ళూ చేతులూ కొట్టుకోసాగాడు.

బల్లమీద శబ్దం గట్టిగా వినిపించ సాగింది.

''రావులూ...ఒరే...''

''ఏంటిది? ఏవయింది మళ్లీ''

''రాములూ...రాములూ''

అప్పన్న కంగారుగా బల్ల దిగి రాములు కాళ్ళూ, చేతులూ కదలకుండా పట్టుకుందామని ప్రయత్నించాడు.

పేరంటాలు – వాడు బల్ల మీంచి పడిపోకుండా రాములు గుండెల మీద చేతులువేసి పట్టుకుంది.

రాజారావు స్టూలు మీదనుంచి ఒక్క ఉదటున లేచి రాములు దగ్గరకు వచ్చాడు. అతనికి ఏమీ అర్థంకాలేదు.

అప్పుడే డాక్టర్ కృష్ణమూర్తి వచ్చాడు. ఆయన వెనకాలే సత్తిరెడ్డి గాభరాగా వచ్చి "డాట్రుగారూ! మీరోమాటు రండి! మా నారాయుడి తమ్ముడినోసారి సూడండి" అన్నాడు.

నారాయుడు కూడా సత్తిరెడ్డితోపాటు వచ్చాడు.

"మీ కాళ్ళట్టుకుంటాను డాట్రుగారూ! మావోడి పేణాలు మీ సేతుల్లేదతన్నా! అర్జెంటుగా రండి బాబూ!"

నారాయుడు కళ్లనీళ్లు పెట్టుకుంటూ డాక్టరు కృష్ణమూర్తిని బతిమాలసాగాడు.

"ఏమైంది మీ తమ్ముడికి?"

రాజారావు ఆదుర్దాగా అడిగాడు.




సత్తిరెడ్డి పాలేరు నారాయుడి తమ్ముడి గురించి అప్పటికే ఊళ్ళో పాకిపోయింది. సీతయ్యని వెంటపెట్టుకుని రెడ్డినాయుడు కూడా నారాయుడి పాకదగ్గరకు వచ్చాడు. సీతయ్యకీ, నారాయుడు తమ్ముడు భీముడుకీ దగ్గరి స్నేహం.

సీతయ్య చొరవగా భీముడి దగ్గరకు వెళ్ళి "ఏవయిందిరా! ఏంటలా నిలువు కళ్లేసుకు సూత్తన్నావ్" అంటూ పలక రించాడు. భీముడు మాట్లాడలేదు. నారా యుడు పెళ్లాం గంగమ్మ దిగాలుగా భీముడి దగ్గరే నిలబడి ఉంది. రెడ్డినాయుడు చుట్టకాలుస్తూ భీముడినీ, గంగమ్మనీ మార్చి మార్చి చూస్తున్నాడు.

సీతయ్య భీముడిని పట్టి కుదిపాడు. అయినా భీముడు నోరు విప్పలేదు. రాజా రావు, సత్తిరెడ్డి, డాక్టర్ కృష్ణమూర్తి, నారాయుడు వచ్చారు.

"మామూలుగానే ఉన్నాడే" అన్నాడు రాజారావు రాములునీ, వెంకన్ననీ గుర్తుకు తెచ్చుకుంటూ.

"రండి డాట్రుగారూ! మీ కోసవే సూత్తన్నాం"

వెటకారంగా అన్నాడు రెడ్డినాయుడు.

అవేమీ పట్టించుకోకుండా కృష్ణ మూర్తి తన పనిలో నిమగ్నమయి పోయాడు.

భీముడి కళ్లు నిస్తేజంగా ఉన్నాయి. ఏదో లోకంలో ఉన్నట్లు కూర్చున్నాడు:

"రెండు రోజుల్నించి బోయనం సెయ్యట్లేదండి! మొన్న రెడ్డినాయుడి గోరి పన్లోకి ఎల్లాడండి! నిన్న అసలు ఇంట్లోంచే కదల్లేదండి"

గంగమ్మ చెప్పింది.

డాక్టర్ కృష్ణమూర్తి రొటీన్‌గా భీముడిని కూడా పరీక్షచేశాడు.

"ఈడసలు ఆకలికి ఆగలేడండి! అంతా ఆడిదంతా దొర్ల పద్దతి! టైము పెకారం బోయినం సేత్తాడండి."

నారాయుడు కూడా తమ్ముడి గురించి డాక్టరుతో చెప్పాడు.

"ఇంజక్షను చెయ్యమంటావా? నీకు అభ్యంతరం లేకపోతే వెంటనే వెళ్ళి ఇంజక్షను పట్రా! ఎందుకేనా మంచిది, ఓ అయిదారు పట్రా! ఈ ఊరికేదో పట్టు కుంది!"

డాక్టర్ కృష్ణమూర్తి కొంచెం బాధగానే అన్నాడు.

సత్తిరెడ్డి దగ్గర డబ్బులు తీసుకుని నారాయుడే సైకిలు మీద పెంటపాడు వెళ్ళాడు ఇంజక్షన్లు పట్టుకురావటానికి.

రెడ్డినాయుడికి మనసు కుతకుత ఉడికి పోసాగింది.

తన ప్రమేయం లేకుండా ఎవరి మటుకు వాళ్ళు సొంతంగానో, తన 'ప్రత్యర్థుల' సలహాతోనో తమ తమ



విషయాలు చూసుకోవటం ఆ ఊరి మాజీ ప్రెసిడెంటుగా రెడ్డినాయుడికి తల కొట్టేసి నట్లయింది.

కాని అసలైన రాజకీయ నాయకుడిలా తన అంతరంగాన్ని బయట పెట్టకుండా మామూలుగా ప్రవర్తించాడు రెడ్డినాయుడు.

"ఇంతకీ నీ ఉద్దేశమేవిటి సత్తిరెడ్డీ"

తన ఉద్దేశాన్ని చెప్పటానికి ఉపోద్ఘాతంగా అడిగాడు రెడ్డినాయుడు.

సత్తిరెడ్డి ఏ అభిప్రాయాన్ని చెప్పే లోపుగా గంగమ్మ పింగాణీ కంచంలో అన్నం పెట్టి, ఊరగాయ ముక్కవేసి భీముడి ముందు పెట్టింది.

"పురుగులు! ఈ పురుగులు తింటే సచ్చిపోతాం... వద్దు... వద్దు"

గట్టిగా అరిచేశాడు భీముడు అన్నం కంచాన్ని చూడగానే.

"ఇదండీ వొరస! మొన్న రోడ్డు మీద ఏదో పొట్లం కనిపిత్తే తీసిసూశాడంటండి. అందులో జుట్టు, ఇంకా ఏంటో ఉన్నాయంటండి"

గంగమ్మ చెప్పింది జనాంతికంగా.

"తిండంలో నిజంగానే భీముడిలాంటోడీడు! ఇదేం సోద్యం"

రెడ్డినాయుడే మళ్ళీ కల్పించుకున్నాడు.

"అవును! మామూలుగా కొంచెం ఎక్కవే తింటాడీడు. పని కూడా అలాగే సేత్తాడు"

సత్తిరెడ్డి అప్రయత్నంగానే రెడ్డినాయుడితో ఏకీభవించాడు.

"అదే నేననేది. సుబ్బరంగా తినేవోడు ఈ బేవుడిట్టా అయ్యాడు. ఆ పెద్ద అప్పిగాడి కొడుకు రాములుగాడు మాటా, సేతా లేకుండా పడిపోయాడు. ఎంకన్నగాడేమో చర్కస్ పీట్లు చేత న్నాడు.ఏంటిదీ?ఇయన్నీ ఇంజచ్చన్లకీ, ఆపరేసన్లకీ తగ్గేయేనా?"

రాజారావునీ, కృష్ణమూర్తినీ చూస్తూ సత్తిరెడ్డిని ఉద్దేశించి అన్నాడు రెడ్డినాయుడు.

రెడ్డినాయుడికి ఆ ఊరి మొత్తం మీద ప్రస్తుతం ప్రధాన ప్రత్యర్థి రాజారావే!

రెడ్డినాయుడి ధోరణి రాజారావుకు చిరాకెత్తించింది. కాని తమాయించుకున్నాడు. అందరిలోనూ అల్లరిపడటం అతనికి ఇష్టం లేదు. పైగా నలుగురూ తననే చివాట్లు వేస్తారని అతని భయం. రాజారావు వయసులో రెడ్డినాయుడి కంటే చాలా చిన్నవాడు కావటం అందుకు కారణం!

ఊరంతా అక్కడ గుమిగూడ సాగింది.

ఒక్క రోజులో అది మూడో అనుభవం వారికి. అదివరలో వాళ్ళంతా ఆ ఊరిలో రకరకాల రోగాలు చూశారు. కాని ఈ ముగ్గురి ప్రవర్తన పూర్తిగా వాళ్ళకి కొత్త!

ఎవరి భయం వాళ్ళది.

డాక్టరు కృష్ణమూర్తి అందరి మాటలనూ జాగ్రత్తగా వింటూ మౌనంగా కూర్చున్నాడు.

నారాయుడు ఇంజక్షన్లు తీసుకు వచ్చాడు. కాని రెడ్డినాయుడు, అతని తరఫువాళ్ళు డాక్టర్ కృష్ణమూర్తికి అడ్డు పడ్డారు.

"పెద్ద అప్పన్న కొడుకు రాములుకి ఇండీషను చేశారు. కాని ఏం గుణం కనిపించలేదుగా?"

"షేమం ఎంకన్నని సూసొచ్చాం! ఆడికీ తెలివొచ్చాక మళ్ళీ ఎప్పటిలాగానే ఉన్నాడు"

"ఈడికి ఇండీషను ఇచ్చినా అంతే!"

అందరి మాటలూ విన్నాక రెడ్డి నాయుడే అన్నాడు "ఇంతకీ ఏం సేద్దామంటారు?" అని.

"ఈ ఎవ్వారం సూత్తాంటే అమ్మోరికి కోపం వచ్చిందనిపిస్తాంది! ఊరోళ్లంతా సందా వేసుకొని జాతర సేద్దాం"

పాత వీధి పెద్ద పర్వతాలు నిక్కచ్చిగా చెప్పేశాడు.

"అంతా నీఇష్టమేనేంటి! ఏడాది మద్దెలో జాతర సెయ్యాలంటే ఊరాళ్లందరినీ ఒప్పించాల" రెడ్డినాయుడు సాలోచనగా అన్నాడు.

"మా పాతీదోళ్ళంతా సిద్ధమే"

పర్వతాలు పెద్దరికం వెలగబెట్టాడు.

కాని నారాయుడు ఎవరిమాటలూ వినదల్చుకోలేదు. "డాక్టరుగారూ! మీరు వొయిద్దెం సెయ్యండి. భీముడు నా తమ్ముడు. నా ఇట్టం! నాకెవరి సలహాలు అక్కర్లేదు" అన్నాడు.

రాజారావు, సత్తిరెడ్డి ధైర్యం చూసుకుని డాక్టరు కృష్ణమూర్తి భీముడికి ఇంజక్షను ఇచ్చాడు. తరువాత రాజారావు, కృష్ణమూర్తి, సత్తిరెడ్డి అక్కడినుంచి వెళ్లిపోయారు–నారాయుడికి ధైర్యంచెప్పి.

తన మాటలు లెక్కపెట్టనందుకు ముఖం చిన్నబుచ్చుకుని రెడ్డినాయుడు కూడా కదిలాడు. సీతయ్య కూడా అతణ్ని అనుసరించాడు.

సాయంత్రం అయింది.

జానకి, రాజేశ్వరి, మిగిలినవాళ్లు మెయిన్‌రోడ్డు మీదనుంచి ఊరు మలుపు తిరగ్గానే భీముడి సంగతి వాళ్ళ చెవిని పడింది.

రకరకాల ఆలోచనలతో, రెడ్డినాయుడి ప్రవర్తనతో రాజారావు విసిగిపోయి నిస్త్రాణగా ఇంట్లో పడుకున్నాడు.

జానకి ఇంట్లోకి వస్తూనే భీముడి గురించి ఆసక్తిగా సూరయ్యని అడిగింది.

"ఏమోనండే! అంతా మాయలా ఉంది. ఈళ్ల సేతలు సూత్తాంటే మనకి పిచ్చెక్కేలా ఉంది" అన్నాడు సూరయ్య.

"లేనిపోనివి ఊహించుకుని అనవసరంగా భయపడకండి" అంటూ ఇద్దరినీ మందలించాడు రాజారావు. అప్పటికి రాముల్ని ఇంటికి తీసుకుపోయాడు పెద్ద అప్పన్న.

రాములుకీ, వెంకన్నకీ ఎలా ఉందో సూరయ్యనే అడిగి తెలుసుకుంది జానకి. పొద్దున స్కూలుకు వెళ్తోంటే తనతో రాజేశ్వరి చెప్పిన మాటలు జ్ఞాపకం వచ్చాయి ఆమెకి.

"పొద్దున్న మా నాన్న చెప్పాడు. ఎవరేనా చేతబడి చేయిస్తే ఇలాగే ప్రవర్తిస్తారట. ఊళ్ళో అందరికి అలా అనే అనుమానంగా ఉందిట. చేతబడికి వైద్యం చేయిస్తే తగ్గదట. మళ్లీ ఆ చేతబడిని తిరగ్గొట్టించకపోతే వాళ్లిద్దరూ రోజురోజుకీ ఎండిపోయి చచ్చిపోతారుట..."

జానకికి గుండె ఝల్లుమంది. సూరయ్యని తోడుగా ఉండమని వంట పూర్తి చేసింది. రాత్రి భోజనం చేస్తున్నపుడు రాజారావుతో చెప్పింది –

"అన్నయ్యా! అమ్మని తీసుకువచ్చెయ్! నాకు భయమేస్తోంది!"

"భయమెందుకు? లేనిపోనివి ఊహించుకుని మనసు పాడుచేసుకోకు! అంతగా భయంగా ఉంటే నువ్వుకూడా గూడెం వెళ్ళి చంద్రకళ దగ్గిరే ఉండు. అక్కడినుంచే స్కూలుకు వెళ్లు"

విశాఖపట్టణంలో ఉంటున్న పెద్ద మేనమామగారింటికి చాలాకాలం తరవాత

చుట్టపు చూపుగా వెళ్లిన తల్లిని తీసుకు రావటంకంటే తనకు కాబోయే భార్య చంద్రకళ దగ్గరే చెల్లెలిని ఉంచటం మంచి దనుకున్నాడు రాజారావు.

చంద్రకళకీ, రాజారావుకీ ఎప్పుడో పెళ్ళి కుదిరిపోయింది. ఆమె డిగ్రీ పూర్తి చేసిన తరువాతే పెళ్ళి చేసుకుంటా నన్నాడు రాజారావు. చంద్రకళకి కూడా డిగ్రీ చదవాలనే ఉండటంతో కూతుర్ని గూడెంలోనే చూరపుదుట్టాలింట్లో ఉంచి చదివించసాగాడు రాజారావు చిన్న మేన మామ సీతారామయ్య. ఆయన ముదునూరు లోనే ఉంటాడు. కాని కుటుంబ సమేతంగా తీర్థయాత్రలకు వెళ్లటంవల్ల జానకిని గూడెంలో దిగబెడదామనుకున్నాడు. లేకపోతే చిన్న మేనమామగారింటికి పంపే వాడే!

భోజనం పూర్తిచేసి సిగరెట్టు ముట్టించుకుని బయటి లైటు వేసి వీధి అరుగుమీదకు వచ్చి కూర్చున్నాడు రాజారావు.

సూరయ్య ఆ రాత్రికి ఇంటికి వెళ్లి పడుకుంటానని చెప్పి వెళ్లిపోయాడు.

జానకి ఇల్లంతా సర్దేసి పడకగదిలో కూర్చుని చదువుకోసాగింది. కాని ఆమె దృష్టి పుస్తకాలమీద లగ్నం కావట్లేదు. మనసులో రూపుదిద్దుకుంటున్న అవ్యక్తమైన భయాన్ని అణచుకోవటానికే జానకి పుస్తకాలు ముందేసుకుంది.

రాజారావు బయట కూర్చోవటం గమనించి ఆ వీధిలోని మిగిలిన పెద్దలు ఒక్కొక్కరూ అతని దగ్గరకు రావటం ప్రారంభించారు.

ఉపోద్ఘాతం అక్కర్లేకుండానే ఒకరి కొకరు ఆ రోజు జరిగిన సంఘటనల గురించి చర్చించటం మొదలెట్టారు. అలాంటి అనుభవాలు వారికి కొత్త. అదివరలో ఆ ఊరిలో వాళ్లెరూ అలా ప్రవర్తించటం వాళ్ళు చూడలేదు. అందుకే అక్కడ చేరినవారంతా ఎవరికి తోచినట్లు వాళ్లు వ్యాఖ్యానించసాగారు - ఆ రోజున ఊళ్ళో జరిగిన సంఘటనల గురించి.

డాక్టరు కృష్ణమూర్తి రాకతో అందరూ నిశ్శబ్దంగా ఉండిపోయారు.

చేతోనే అరుగుమీద దులిపి "రండి! రండి" అంటూ కృష్ణమూర్తిని ఆహ్వానించాడు రాజారావు.

అప్పుడే గోవిందయ్య, అతని కొడుకు ప్రకాశరావు కూడా వచ్చారు.

ప్రకాశరావు చొరవగా వచ్చి రాజారావు పక్కన చోటు చూసుకున్నాడు.

"ఒక్క రోజులోనే ఏంటండీ ఈ యిపరీతాలు" ఆశ్చర్యంగానూ, బాధగానూ అన్నాడు సత్తిరెడ్డి.

"ఇవన్నీ ఒక రకమైన భయాలా, భ్రాంతులా" అన్నాడు కృష్ణమూర్తి.

"అంటే చీకట్లో ఝడుసుకున్నా రంటారా ఆ ముగ్గురూ?"

గోవిందయ్య అసలు విషయం ఏమై ఉంటుందో తెలుసుకోగోరుతున్నట్లు కూపీలాగుతూ అడిగాడు.

డాక్టర్ కృష్ణమూర్తి గొంతు సవరించుకుని చెప్పటం ప్రారంభించాడు.

"నేను చెప్పే మాటలు అభూతకల్పనలుగానో, కథలుగానో, పుస్తకాల్లో మాటలుగానో అనిపించవచ్చు మీకు. కాని వాస్తవం ఇది. మేక-బ్రాహ్మడు కథ మీకు తెలుసు. నలుగురు దొంగలు ఒక మేకని కుక్క అనేసరికి ఆ బ్రాహ్మడు ఆ మేకని కుక్కే అనుకున్నాడు. ఒక రకంగా అలాంటిదే ఇది కూడా! ఒక

విషయాన్ని పదేపదే చెప్పి- అంటే చెవిలో పోరు పెట్టినట్లన్నమాట- అది నిజమని ఎదుటివాడిని నమ్మించవచ్చు. దెయ్యాలు, భూతాలు, దేవుడు, శక్తులు ఇవన్నీ అలాంటివే"

కృష్ణమూర్తి ఓ క్షణంపాటు ఊపిరి తీసుకోవటానికి ఆగాడు.

ఆ క్షణాన్ని సద్వినియోగం చేసుకున్నాడు సత్తిరెడ్డి.

"అంటే ఇప్పుడీళ్ళందరికీ దెయ్యం పట్టిందంటారా? అందరికీ ఒకే దెయ్యం పడుతుందని నాకు తెలవదు మరి" అన్నాడు సత్తిరెడ్డి.

"ఆయన్ని చెప్పనివ్వండి" అంటూ గోవిందయ్య కృష్ణమూర్తికి అండగా నిలిచాడు.

తూర్పుపేట నుంచి పెద్దఅప్పన్న, నాగులు, బెమ్మంతాత, మరో నలుగురు కూడా రాజారావు ఇంటికి వచ్చారు. అక్కడ పదిమందీ సమావేశం అయ్యారన్న సంగతి రెడ్డినాయుడికి తెలిసిపోయింది. సంగతేమిటో తెలుసుకోవటానికి పాతవీధి పర్వతాలుని రాజారావు ఇంటికి పంపించాడు రెడ్డినాయుడు.

ఎక్కువమంది అక్కడ చేరడంతో జానకి చదువు కట్టిపెట్టి కిటికీ దగ్గరకు చేరింది కుతూహలంగా!

తన మాటలకు విలువ దొరికిందన్న సంతోషంతో కృష్ణమూర్తి హుషారుగా సిగరెట్టు వెలిగించాడు – రాజారావు దగ్గిర్నుంచి సిగరెట్టు పెట్టె అందుకొని.

"మీరు అడిగారు కనుక చెబుతున్నాను. మీరు గత రెండేళ్లుగా చూస్తూనే ఉన్నారు నన్ను. లేనిపోని విషయాలు నెత్తిన వేసుకోవటం నా పద్ధతికి విరుద్ధం. రాజారావు లాంటి చదువుకున్నవాళ్లు, మిగిలిన మీ లాంటి పెద్దల సహకారంతోనే నేను ఇక్కడ పబ్లిక్ హెల్త్ సెంటర్‌లో డాక్టరుగా ఉండగలుగుతున్నాను. నాకు చేతనైన మేరకు ఈ ఊరివాళ్ళకు వైద్యం చేస్తున్నాను."

బాసింపట్టు వేసుకుని సర్దుకు కూర్చున్నాడు కృష్ణమూర్తి. రాజారావు ప్రభృతులు అతని మాటలను శ్రద్ధగా వింటున్నారు. అందరికంటె జాగ్రత్తగా వింటున్న వ్యక్తి పర్వతాలు.

"ఇవాళ మన ఊళ్ళో ముగ్గురు వ్యక్తులు విచిత్రంగా ప్రవర్తిస్తూండడం చూశాం మనం. ఒకరి ప్రవర్తనకు, మరొకరి ప్రవర్తనకు సంబంధం లేదు. కారణం ఏమిటంటారు?"

చుట్టూ చేరిన జనాన్ని ప్రశ్నార్థకంగా చూశాడు డాక్టర్ కృష్ణమూర్తి.

"ఏమో! మాకేంతెల్సు! మీరేసెప్పాల" అన్నాడు తూర్పుపేట నుంచి వచ్చిన వారిలో ఒకడు.

"ఆళ్లు ఎందుకలా అయిపోయారో మాకు తెలవదు కాని ఆళ్ల ముగ్గురికీ మందులకులొంగే రోగాలు కావనిపిత్తోంది" అన్నాడు బెమ్మంతాత.

"అదే నేను చెప్పబోయేదికూడా! మీకున్న అభిప్రాయమే చాలామందికికలిగి ఉండవచ్చు. రోగాలు శారీరక రోగాలు, మానసిక రోగాలు అని రెండు రకాలు. కొంతమంది శారీరక రోగాల్ని కూడా అమ్మవార్లకీ, దేవుళ్ళకి అంటకడతారు. అలాగే మానసికరోగాల్ని దెయ్యాలకూ, భూతాలకూ, క్షుద్రశక్తులకీ ఆపాదిస్తారు. అదీకాకపోతే ప్రతి మానసిక రోగాన్ని పిచ్చికింద జమకట్టేస్తారు. తొందరపాటు లేకుండా నిదానంగా ఆలోచించటం అవ

సరం. ఇప్పుడు రాములుకీ, వెంకన్నకీ, భీముడికీ మానసికంగా కలిగిన కొన్ని భ్రాంతులవల్లా, భయాలవల్లా వాళ్లు అలా ప్రవర్తిస్తున్నారు."

రాజారావు సిగరెట్టు పెట్టెలోదే మరో సిగరెట్టుతీసి వెలిగించుకోవటానికి కృష్ణమూర్తి ఓ క్షణం ఆగాడు. రాజారావు కూడా సిగరెట్టు వెలిగించాడు.

జనాల్లో గుసగుసలు బయల్దేరాయి. ఒకరికొకరు తమకు తెలిసున్న అనుభవాలను తెలియచెప్పసాగారు.

"మా అత్తారూళ్లో ఒకడు అచ్చం ఎంకన్నలా పిల్లి మొగ్గ లేశాడంట!తర్వాత తెలిసింది–ఆడికెవడో సేతబడి సేయించ్చారని. రెండొందలు కరుసెట్టి తిరగొట్టించుకున్నారు"

"అంతెందుకు... మా పినబావగారి బామ్మర్దికి ఆడి తోడల్లుడే సేతబడి సేయించాడంట! ఆడుకూడా మనరాములుగాడిలాగే కాళ్ళూ సేతులూ తపతపా కొట్టుకున్నాడంట...న్నాలోజుల తర్వాత మేకని బలిచ్చి ఆ పెయోగాన్ని తిరగొట్టించారంట...."

కృష్ణమూర్తి మళ్ళీ ప్రారంభించాడు. జనం మాట్లాడటం ఆపేశారు.

"నాకు తెలుసు. మీరు వాళ్ళ ప్రవర్తనకి చేతబడి అనో, గాలి సోకిందనో మరొకటో పేరు పెడతారని. కాని చేతబళ్లు, గాలిసోకటాలు, దెయ్యాలు,భూతాలు అవన్నీ కేవలం మన భయాలే! ఆ భయాలను ఆధారం చేసుకొని కొంతమంది తమ పబ్బం గడుపుకొంటూ ఉంటారు"

అంతలో నాగులు అందుకున్నాడు.

"అద్సరేసండీ ! ఒకేళ మావోడికి మీరు సెప్పినట్టు మనసు సెదిరిందనే అనుకుందాం! మరైతే మీరు ఇండీషను ఇచ్చారుకదా! ఆడికి తెలివొచ్చాక మళ్ళీ ఇదుసుకుపడిపోయాడేంటి? మిగతావోళ్ళకి కూడా మీరు ఇచ్చిన మందులవల్ల ఏం లాబం కనిపించటంలేదుగా"

తన బామ్మర్దికి వచ్చిన రోగం మందులతో తగ్గదని, దానికి మంత్రం వేయించటమో, మరేదో చేయించాలని నాగులు ఉద్దేశం.

నాగులు అలా మధ్యలో కల్పించుకోవటంతో రాజారావుకు కోపం వచ్చింది.

"ఏంరా! మధ్యలో పెద్దమొగాడిలా కల్పించుకొంటున్నావ్! వైద్యంచేయించుకోవటం ఇష్టంలేకపోతే మీ ఏడుపు మీరు ఏడవండి! ఆ మాట ముందే చెబితే మాకు ఇంజక్షనైనా కలిసివచ్చేది. పెద్దఅప్పన్న 'ఊ' అన్నాకే రాములుకి వైద్యం చేశారు డాక్టరుగారు" అన్నాడు రాజారావు.

దాంతో తలొకడు తలోమాటా అనసాగారు నాగులుని. కొందరు అతన్ని సమర్థించారు. కొందరు తిట్టిపోశారు.

సరిగ్గా అదే సమయంలో పెద్దగరువు నుంచి ఏసుపాదం పరుగెత్తుకుంటూ రాజారావు ఇంటికి వచ్చాడు.

"అయ్‌బాబోయ్! డాట్రారు! మీరు ఇక్కడున్నారాండీ! ఆసుపత్రి కాడికెలితే మీరెక్కడికెల్లారో తెలవదన్నారండి. మా జాన్‌గాడికి ఏవయిందోనండి ... ఇంట్లో దీపాలార్పేయ మంటన్నాడండి...కళ్ళకి తువ్వాల కట్టేసుకుంటన్నాడండి. మీరో పాలి వచ్చి సూడండి డాట్రారు ... మా జాన్ బాబుని రచ్చించండి".

జనంలో కలకలం...

"పెద్దగరువులో . జాన్‌గాడికి ఏదో అయిందంట"

"పదండి...అన్నీ చూసొద్దాం..."

అక్కడ చేరినవాళ్ళంతా పెద్దగరువు వైపు పరుగులు పెట్టారు.

రాజారావు, కృష్ణమూర్తి—ఏసుపాదం వెంట పెద్దగరువుకి బయల్దేరారు.

పర్వతాలు మాత్రం రెడ్డినాయుడి ఇంటిదారి పట్టాడు.

బెమ్మంతాత, మరి కొంతమంది తూర్పు వీధికి వెళ్ళిపోయారు.

జానకి తలుపు వేసుకొని బిక్కుబిక్కుమంటూ ఒంటరిగా ఉండిపోయింది.

రకరకాల ఆలోచనలతో ఆమె భయపడసాగింది.

'తూర్పు పేట నుంచి పెద్ద గరువుకి పాకింది... ఏమిటిది? ఏదేనా రోగమా? దెయ్యాలా? లేకపోతే అందరూ అనుకొంటున్నట్లు చేతబడా? చేతబడి చేస్తే ఇంత మందికి ఒకేసారి చేయొచ్చా?'

ఏ ప్రశ్నకి ఆమె సమాధానం చెప్పుకో లేకపోయింది.




తెల్లారింది.

వింతగా ప్రవర్తిస్తున్నవారి సంఖ్య మరో రెండుకు పెరిగింది.

ముసలమ్మ గుడికి దగ్గరగా ఉంటున్న కొట్టు సోమయ్య ముసలి తండ్రి తాతబ్బాయి, ఆ దుకాణానికి ఎదురింట్లో ఉంటున్న వెంకటేశం ఎత్తుగా ఉన్న ఇళ్ళని చూసి, చెటను చూసి భయంతో అరుస్తున్నారు.

తాతబ్బాయి కొట్టు అరుగుమీదే రాత్రిళ్లు నిద్రపోతూ ఉంటాడు. క్రితం రాత్రి—కొట్టు దగ్గరకు వచ్చిన వాళ్ళూ-వీళ్ళూ చెప్పుకొన్న 'ఊరి కబుర్లు' విన్నాడు. దుకాణం మూసేసిన తర్వాత ఓ అరుగు మీద మంచం వేసుకొని పడుకున్నాడు. అర్ధరాత్రి వేళ లఘుశంకకు లేచాడు. పొరపాటున కాలుజారి ఆ ఎత్తు అరుగు మీద నుంచి పడబోయాడు. కాని పక్కగా ఉన్న స్తంభాన్ని పట్టుకొని పడకుండా నిలదొక్కుకున్నాడు.

"ఆ క్షణంలో ఏం జరిగిందో ఏమోనండి మరి! మేము వచ్చి మా నాన్నని పట్టుకొని మంచం మీద పడుకోబెట్టే వరకూ అరుస్తూనే ఉన్నాడండి. స్తంభం దగ్గిరే కూలబడి 'అమ్మో, అయ్యో' అంటూ కేకలు పెట్టాడండి" అన్నాడు సోమయ్య - తండ్రి గురించి డాక్టరుకు చెబుతూ.

వెంకటేశం గురించి వాళ్ళ ఇంట్లో వాళ్లు ఇంకోలా చెప్పారు. "రాత్రివేళ ఎలకలు తిరగటం వల్ల ఓ పెంకుముక్క మా వాడి మీద పడిందండి! 'అమ్మోయ్... బాబోయ్... ఇల్లు కూలిపోతోంది... మీద పడిపోతోంది' అంటూ భయం భయంగా పక్క మీంచి లేచిపోయాడండి అక్కడి నుంచి ఎత్తుగా కనిపించేది ఏది చూసినా అలా అరుస్తున్నాడండి" అంది వెంకటేశం తల్లి.

రాజారావు, కృష్ణమూర్తి ముఖ ముఖాలు చూసుకున్నారు.

నిన్నటి రోజున వాళ్ళిద్దరి మాట ఎంతో గౌరవం ఇచ్చినవాళ్లంతా ఇప్పుడు వాళ్ళని చూసి నిర్లక్ష్యంగా ప్రవర్తించట

మొదలుపెట్టారు.

దానికి సాయం రెడ్డినాయుడి మాటలు వాళ్ళ మీద ఎక్కువ ప్రభావం చూపించ సాగాయి.

ఊరంతా గుంపులు గుంపులుగా విడి పోతోంది. ఎవరిమటుకు వాళ్ళు తమ ఉద్దేశం ప్రకారం జరగాలని, తాము అనుకుంటున్నదే నిజమనీ అనుకోవటం మొదలుపెట్టారు.



జానకి స్కూలుకు వెళ్లిపోయాక రాజారావు గూడెం వెళ్ళాడు పౌల్ట్రీ చూసుకోవటానికి. డాక్టర్ కృష్ణమూర్తి ఆసుపత్రిలోనే ఉండిపోయాడు.

ముదునూర్లో కొంతమంది విచిత్రంగా ప్రవర్తిస్తున్నారనే విషయం ఆ చుట్టుపక్కల ఊళ్ళకి కూడా పాకింది. గూడెంలో కొందరు రాజారావుని అడిగారు కూడా "ఏమిటి సంగతి" అని.

"ఏమోమరి! నాకూ తెలీయదు! ఒక్కొక్కళ్ళూ ఒక్కో విధంగా అనుకొంటున్నారు" అన్నాడు రాజారావు.

ఆ మధ్యాహ్నం రెడ్డినాయుడు ముదునూరులో పంచాయితీ ఆఫీసు దగ్గర కొలువుతీరాడు.

పర్వతాలు అక్కడే ఉన్నాడు. గోవిందయ్యకీ, సత్తిరెడ్డికీ, బెమ్మంతాతకీ పెద్దగరువు పాత పంచాయతీ మెంబరు డేవిడ్‌కీ కబురు పంపాడు రెడ్డినాయుడు.

అందరూ వచ్చారు. పంచాయతీ ఆఫీసు గదిలో అంతమంది సమావేశం అయి చాలా రోజులయింది. పంచాయతీ గుమాస్తాగానూ, లైబ్రేరియన్‌గానూ పనిచేసే సదాశివమూర్తి ఓ పక్కగా



నిలబడ్డాడు.

మాజీ ప్రెసిడెంటు హోదాలో రెడ్డి నాయుడు ఆ గదిలో ఉన్న ఒకే ఒక కుర్చీలో కూర్చున్నాడు. మిగిలినవాళ్ళు బెంచీమీద ఇరుక్కుని కూర్చున్నారు.

"రాజారావు చదువుకున్నాడే! మంచోడే! తనుజ్జోగం సెయ్యడం మానేసి ఆ పనిని మరోడికి ఇప్పించి, సొంతంగా పౌల్ట్రీ నడుపుకొంటూ ఆడి కాళ్ళమీద ఆడు నిలబడ్డోడే! కాని, ఆడికి ఊరి యవ్వారాలెందుకంట? మీరే సెప్పండి! మనం ఇంతమందిమి పెద్దోళ్ళం ఉన్నాం కదా! మనూరోళ్ళ బాగోగులు మనయి కాదా? ఆడికి తోకలాగా ఆ డ్రాటు గాడొకడు. అసలేంటీ పరిత్తితి? సివరికి ఈ ఊర్ని ఏం సేద్దామని ఆళ్ళ ఉద్దేశం?"

ఇరవై నాలుగ్గంటల పాటు అణుచుకున్న ఉక్రోషాన్ని వెళ్ళగక్కాడు రెడ్డినాయుడు.

గోవిందయ్య, సత్తిరెడ్డి ఛర్రున లేచారు రెడ్డినాయుడిమీద!

"ఏం? మీరొక్కరే ఈ ఊర్ని పరిపాలిత్తారా? రాజారావు సేసిన తప్పేంటి? సమయానికి ఊరోళ్ళని ఆదుకోడం తప్పా? మాకు మీ రాజకీయాల్తో పనేంలేదు. రేపొచ్చే పంచాయతీ ఎలచ్చన్లలో రాజారావు మీకు పోటీగా నిలబడతాడేమోనని మీకు బయంగా ఉంటే మీ ఏర్పాట్లు మీరు సేసుకోండి ... మీరు నెగ్గితే మంచిదే! కడుపులో ఏదో కుళ్ళెట్టుకుని అనవసరంగా ఆ కుర్రాడిని ఏవన్నా అంటే మేం ఊరుకోం''

సత్తిరెడ్డి సూటిగానే చెప్పాడు. గోవిందయ్య కూడా మధ్య మధ్యలో సత్తిరెడ్డికి వంత పాడాడు.

పర్వతాలుకి పౌరుషం ముంచుకొచ్చింది - వాళ్ళిద్దరూ రెడ్డినాయుడిని అలా అనేటప్పటికి!

"ఇన్నేళ్లనించి ఈయన సెప్పినట్టు ఊరంతా ఇంది ... ఇప్పుడు మాత్రం ఎందుకినకూడదూ? పెసిరెంటుగోరు ఊరోల్లకి అన్నాయం సేత్తానంటున్నాడా? ఇంత మందికి ఇన్ని ఇపరీతాలు జరుగుతాంటే ఆటినెల్లాగో వోలా ఆపాలనే కదా సెబుతోంటా? వయిజ్జం అన్నారు, ఇండీసన్లు అన్నారు... ఏమయిందిప్పుడు? ఊరంతా అల్లలాగే అయిపోతే ఎవడు సమాదానం సెబుతారు?"

పర్వతాలుని తగ్గమన్నట్లు సైగ చేశాడు రెడ్డినాయుడు.

"మీరు పెద్దోళ్ళగదా! అసలాళ్ళకి ఏంటయుంటదో ఆమాత్రం కనిపెట్టలేరా? అసలిషయం పక్కనెట్టి మనలో మనం పోట్లాడుకోవటవేంటి?"

తన ఉద్దేశాన్ని బయటకు చెప్పకుండా వాళ్ళచేతే చెప్పిద్దామని ఎత్తువేశాడు రెడ్డినాయుడు.

"నా ఉద్దేశం ఎవరో మనూరోల్లమీద పెయోగం సేసుంటారని! లేకపోతే ఇంత మంది ఇన్నిదాలుగా అయిపోవటమేంటి"

బెమ్మంతాత పెద్దరికాన్ని ప్రదర్శించాడు.

పెద్దగరువు మెంబరు డేవిడ్ కూడా అలాగే అనుకుంటున్నాడు.

"ఇంకా సేపు ఆగితే మావోళ్లు వచ్చేత్తారు పిప్పర్నించి...గడ్డమీద పెళ్ళడగటానికెళ్లారు. నిన్న పొగలంతా అల్లకి అల్లకి అలా అయింది. రాత్తేల మా జాన్ గాడికి అయింది. ఇయాల పొద్దుటేల ఆ కొట్టు సోమయ్యఅయ్య తాతబ్బాయిగోరికీ, ఆ ఎంకటేశంగోరికి ఇంకోలా అయింది. అందుకే మావోల్లకి అనుమానం వచ్చి పిప్పరెల్లారు" అన్నాడు డేవిడ్.

ఆ పెద్దలంతా అలా అక్కడ మాట్లాడు కొంటూనే ఉన్నారు. పక్కనే ఉన్న రామాలయంలో కొందరు పిల్లలు అల్లరిచేస్తూనే ఉన్నారు. "పెద్దోల్లంతా సమావేశమయ్యారు" అనుకుంటూ ఒకళ్ళు, ఇద్దరూ చొప్పున పంచాయతీ ఆఫీసు బయట పోగవుతూనే ఉన్నారు.

సరిగ్గా అప్పుడే –

"డాక్టుగారికి పెమాదంజరిగిపోయింది. సీతయ్యగాడూ, నాగులుగాడూ సైకిళ్ళ మీదెడుతూ పొరపాటున డాక్టుగారి మీద పడ్డారంట. ఆయనకి ఓ సెయ్యి, ఓ కాలు ఇరిగిపోయాయంట" అంటూ వచ్చాడు రాజారావు పాలేరు సూరయ్య.

సత్తిరెడ్డి, గోవిందయ్య గబగబా బయటికి వచ్చి సూరయ్యతోపాటు వెళ్లారు డాక్టర్ కృష్ణమూర్తిని చూడటానికి.

వాళ్ల వెనకాల తాపీగా బయలుదేరాడు రెడ్డినాయుడు–పర్వతాలుతో సహా.

బెమ్మంతాతని తూర్పు వీధిలో ఉండే కుర్రాడొకడు ఇంటికి తీసుకువెళ్లాడు.

దేవిడ్ అందరికంటె ఆఖరున ఆ గదిలోంచి బయటకు వచ్చాడు.

* * *

డాక్టర్ కృష్ణమూర్తి ఆసుపత్రి నుంచి బయటకు వచ్చి రాములునీ, వెంకన్ననూ, భీముడినీ, మిగిలినవాళ్లనీ ఓసారి చూసి వద్దామని ఊరి వైపు వస్తూండగా సీతయ్య, నాగులు సైకిళ్ళమీద ఆయనకి ఎదురువచ్చారు. సరిగ్గా అదే సమయంలో సత్తిరెడ్డి పాలేరు నారాయుడు పెద్ద గడ్డిమోపు మోసుకొంటూ కృష్ణమూర్తి వెనకనుంచి గబగబా అడుగులు వేసుకుంటూ వస్తున్నాడు.

గడ్డిమోపు కృష్ణమూర్తిని దాటి నాలుగు అడుగులు ఎదరకు వచ్చింది.

అంతే!

"అరెరెరె..." అంటూ సీతయ్య, నాగులు ఒకళ్ళమీద ఒకళ్లు పడ్డారు సైకిళ్ళతో సహా.

సీతయ్య, నాగులుతోపాటు వారి సైకిళ్లు కూడా డాక్టర్ కృష్ణమూర్తిమీద పడ్డాయి.

తప్పించుకోబోయే ప్రయత్నంలో కృష్ణమూర్తి కుడికాలు ఓ సైకిలు చక్రంలో పడింది. కుడిచేతిని ఆ సైకిలు హేండిలు బార్ కదలకుండా చేసింది.

గడ్డిమోపును దభీలున నేలమీద పడేసి ముందు సీతయ్యని, తర్వాత నాగులునీ లేవదీశాడు నారాయుడు.

వాళ్లిద్దరూ సైకిళ్ళను పైకిలేవదీశారు.

సైకిలు చక్రంలోంచి కృష్ణమూర్తి కాలును బయటకు తీశాడు నారాయుడు.

కొన్ని ఊచలు విరిగిపోయి కృష్ణమూర్తి కాల్లో దిగబడ్డాయి.

చేతి దగ్గర ఒక ఎముక బయటకు పొడుచుకు వచ్చింది.

"అయ్ బాబోయ్! సూళ్లేదండి డాక్టారు! ఈడి గడ్డిమోపు అడ్డం వచ్చేసిందండీ ... తప్పయిపోయిందండీ... చమించండి డాక్టారూ" అంటూ సీతయ్య, నాగులు ఆయన్ని ప్రాధేయపడసాగారు.

నారాయుడే చేతులమీద మోసుకుంటూ డాక్టర్ కృష్ణమూర్తిని ఆసుపత్రిలోకి తీసుకువెళ్లాడు.

కృష్ణమూర్తికి బాధ భరించలేనంత ఎక్కువగా ఉంది. కాల్లోంచి రక్తం కారుతోంది. అప్పటికప్పుడే కాలు, చెయ్యి బాగా వాచిపోయాయి.

"గూడెం వెళ్ళటానికి ఏర్పాట్లుచెయ్యి"

అని మాత్రం అనగలిగాడు కృష్ణమూర్తి-కాంపౌండరుతో.

సత్తిరెడ్డి, గోవిందయ్య వచ్చారు.

"ఏవయిందండసలు? దెబ్బలు బాగా తగిలినట్టున్నాయే"

సత్తిరెడ్డి పరిశీలనగా చూశాడు.

నారాయుడు జరిగినదంతా చెప్పాడు. కాంపౌండరు రక్తం కారకుండా తాత్కాలికంగా కట్టు కట్టాడు.

రెడ్డినాయుడు రాగానే సీతయ్య ఏడుపు ముఖం పెట్టి అసలు విషయం చెప్పాడు.

"మన ఫేను బాగుచేయించటానికి పెంటపాళ్ళో మెకానిక్కుకి ఇచ్చాం కదండీ! ఆడియాల ఇత్తానన్నాడండి... తీసుకొద్దామని నేను సైకిలుమీదెల్తన్నానండి... ! ఈ నాగులుగాడు పెంటపాడు మసీదు కాణ్నించి ఆళ్ళ బామ్మర్దికి కట్టటానికి తాయెత్తు తెద్దావని బయల్దేరాడండి. ఇద్దరం పక్కపక్కగా సైకిళ్లు తొక్కుకుంటూ వత్తన్నావండి. ఇంతలో ఈనారాయుడుగాడి గడ్డిమోపు అడ్డంవచ్చి దారి కాపళ్లేదండి. ఒకళ్ళ మీదొకళ్ళ వడిపోయావండి... పాపం డాట్టుగార్ని మేం సూళ్లేదండి..."

"గుడ్డి లం...కుల్లారా! ఒళ్లు తెలీటం లేదంట్రా..." అంటూ ఫెడేల్న సీతయ్య దవడమీద కొట్టాడు రెడ్డినాయుడు. అదే ఊపులో నాగుల్ని జుట్టు పట్టుకొని వంచి వీపుమీద దబదబా బాదేశాడు.

సత్తిరెడ్డి, గోవిందయ్య-రెడ్డినాయుడిని సముదాయించారు.

"ఎదవనా 'కొడుకులు... ఒళ్ళుపై తెలవటం లేదు. ఇంతటితో సరిపోయింది గాని ఇంకేవైనా అయితే డాట్టుగారికి ఎవ్వరా సమాదానం సెప్పేది...! నీయమ్మ... మీ లాంటోళ్ళని కాళ్ళూ, సేతులూ ఇరిసెయ్యాల"

రెడ్డినాయుడు అరుస్తూనే వున్నాడు.

గోవిందయ్య, సత్తిరెడ్డి వాళ్ళిద్దర్నీ అక్కడినుంచి పంపేశారు.

మెయిన్ రోడ్డుమీద ఖాళీగా వెళ్తున్న టేక్సీని తీసుకువచ్చాడు సూరయ్య.

ఆసుపత్రికి తాళం వేసి కాంపౌండరు కృష్ణమూర్తితో తాడేపల్లి గూడెం బయల్దేరాడు. సూరయ్య కూడా వాళ్ళతోపాటు టేక్సీలో కూర్చున్నాడు.

దోవలో పౌల్ట్రీ దగ్గర ఆగి రాజారావును కూడా తీసుకువెళ్లాడు కృష్ణమూర్తి.

రాజారావుకు మతిపోయింది.

'సీతయ్య - రెడ్డినాయుడు పాలేరు. డాక్టరుగారు నాతో పాటే ఉంటున్నారని రెడ్డినాయుడే కావాలని ఈ పని చేయించాడా' అని ఆలోచించాడు రాజారావు.

ఆమాటే కృష్ణమూర్తితో అన్నాడు. కాని సమాధానం చెప్పే స్థితిలో లేక, నిస్త్రాణగా, బాధగా నవ్వి ఊరుకున్నాడు కృష్ణమూర్తి.

డాక్టరుగార్ని ఆసుపత్రిలో చేర్పించిన తర్వాత కాంపౌండరు, సూరయ్య ముదునూరు వచ్చేశారు.

రాజారావు - కృష్ణమూర్తి భార్యకీ, బంధువులకు టెలిగ్రామ్ ఇచ్చి, మరోసారి ఆసుపత్రికి వెళ్లి మళ్లీ మర్నాడు వస్తానని చెప్పి అక్కడినుంచి వచ్చేశాడు.

'జానకి భయపడుతుందేమో, ఇంటికి వెళ్ళటం మంచిది' అనుకున్నాడు. కాని 'సూరయ్య ఉంటాడులే' అని తనకు తాను సమాధానం చెప్పుకుని 'ఓసారి చంద్రకళను చూసి వెళ్దాం" అనే ఉద్దే

శంతో రిక్షా ఎక్కాడు రాజారావు.

గుమ్మంలోనే ఆపేశాడు – చంద్రకళ దూరపు చుట్టం దుర్గయ్య "ఏం రాజారావు... బావున్నావా? ఈమధ్య బొత్తిగా కనబడటం లేదే!గూడెం రావటం లేదా?" అంటూ!

రాజారావు పేరు వినిపించగానే చంద్రకళ బయటకు వచ్చింది.

"రా! బావా! రా! లోపల కూర్చుని మాట్లాడుకుందాం" అని అతనిని లోపలికి తీసుకువెళ్ళింది.

దుర్గయ్య భార్య గోపాలరత్నం మంచినీళ్ళు తీసుకువచ్చి ఇచ్చింది.

ఊళ్ళో సంగతులు చెప్పాడు రాజారావు.

అన్నీ విన్న తర్వాత "ఈమధ్య హైదరాబాద్ చుట్టుపక్కల కూడా ఇలాంటి సంఘటనలు జరిగినట్లున్నాయి. ఎవరో చేతబడి చేసి ఉంటారు. ఎందుకేనా మంచిది. నువ్వు ఆ విషయాల్లో తల దూర్చకు అని" ఓ సలహా పారేశాడు దుర్గయ్య.

ఆయన వెళ్ళిపోయాక రాజారావు, చంద్రకళ కబుర్లలో పడ్డారు.

"నీ ఉద్దేశం ఏమిటి? వాళ్ళందరూ అలా ప్రవర్తిస్తూండటానికి కారణం ఏమిటి?" అని అడిగింది చంద్రకళ రాజారావును.

"డాక్టరుగారు చెబుతున్నదాన్ని బట్టి మామూలు మాటల్లో అది చేతబడి మహత్యమే అనిపిస్తోంది. అయితే చేతబడి, దెయ్యాలు, భూతాలపట్ల నాకు ఏమాత్రం నమ్మకంలేదు. కావాలనే ఎవరో ఇలా ఊరివాళ్ళని భయపెట్టిస్తున్నారని నా అనుమానం. అదే నిజమైతే ఏ హిప్నోటిస్టునో, సైకియాట్రిస్టునో తీసుకువచ్చి వాళ్ళకి నయం చేయించాలని నా ఉద్దేశం! కాని ఊళ్ళోవాళ్ళందరి ఒప్పించగలగాలి కదా! నా ఒక్కడివల్ల ఏమవుతుంది?"

నిరాశగా జవాబు చెప్పాడు రాజారావు.

అతన్ని అనునయించటానికి మరింత దగ్గరగా జరిగింది చంద్రకళ.

"నువ్వు ఇంత బేలగా ఇదివరకెప్పుడూ మాట్లాడలేదు. అంతో ఇంతో ఊళ్ళో మంచి పేరున్న నువ్వే ఇలా అధైర్యపడిపోతే ఎలా? జాగ్రత్తగా నచ్చచెప్పి వాళ్ళని ఒప్పించు. నీ ప్రయత్నం వృధా అవదని నా నమ్మకం" అంది చంద్రకళ.

"చేతబడి పేరు చెప్పి ఇంతమందిని ఎలా భయపెట్టగలిగారో నాకు అర్థం కావటంలేదు. ఊళ్ళోవాళ్ళని ఆ భయం నుంచి ఎలా తప్పించాలో కూడా నా ఆలోచనకు అందటంలేదు. అమ్మేమో విశాఖపట్నం వెళ్ళింది. జానకి భయపడుతోంది– ఒంటరిగా ఉండటానికి. సూరయ్య ఉంటాడుకదా అని ధైర్యం చెప్పాననుకో! చిన్నపిల్లకదా... దాని భయం దానిది"

రాజారావు సమస్యని అర్థంచేసుకుంది చంద్రకళ.

"పోనీ, జానకిని కొన్నాళ్ళపాటు ఇక్కడే ఉంచు. ఊరు సద్దుమణిగాక తీసుకువెళ్ళవచ్చు. దుర్గయ్యగారూ ఏమీ అనుకోరు. పైగా మన ఖర్చులు మనమే భరిస్తాం కదా"

చంద్రకళ చెప్పిన సలహా బాగానే ఉందనిపించినా, అలా చేయటం పిరికితనమనిపించింది రాజారావుకి.

'అందరికీ నీతులు చెబుతూ తన చెల్లెలికి ఏ ప్రమాదం జరగకుండా దూరంగా పంపించేశాడు రాజారావు అని ఎవరేనా అంటారేమో అని భయపడ్డాడు రాజారావు.

"అబ్బే! ఎందుకూ అనవసరంగా. రాత్రికి నేను ఎలాగూ ఇంట్లోనే ఉంటాను. పగలు అది స్కూలుకి వెళ్ళిపోతుంది ... ఇంకేం భయం" అన్నాడు రాజారావు.

కాస్సేపు పిచ్చాపాటీ మాట్లాడుకున్నాక "ఇక వెళ్తాను" అంటూ బయలుదేరాడతను.

వీధి చివరివరకూ వచ్చి సాగనంపింది చంద్రకళ.

బస్సుదిగి, నడుచుకుంటూ ఊళ్ళోకి వెళ్లాడు రాజారావు.

పెద్ద గరువుదాటి, ముసలమ్మ గుడి వరకూ వచ్చాడు. అక్కడినుంచి మలుపు తిరిగితే తన వీధిలో ప్రవేశిస్తాడు.

టైము చూస్తే పదకొండుకి అయిదు నిమిషాలు తక్కువుంది.

చెప్పరాని భయంతో అప్పటికి ఊరు పూర్తిగా మాటుమణిగింది.

అప్రయత్నంగానే రెడ్డినాయుడి సందు వైపు చూశాడు రాజారావు.

"కుక్కలు...కుక్కలు ... వచ్చేస్తున్నాయి" అని అరుచుకుంటూ పాత వీధిలో ఉండే పరమానందం ఒగుర్చుకుంటూ పరుగెత్తి వస్తున్నాడు – రెడ్డినాయుడి సందులోంచి. అతని వెనకాల వాళ్ళు వాళ్లు కూడా పరిగెత్తుతున్నారు – పరమానందాన్ని పట్టుకుందామని!

పరమానందం రాజారావుని చూసి ఆగిపోయాడు.

"కుక్కలు వస్తున్నాయండి. కరిస్తే పిచ్చెక్కుతుంది...త్వరగా వెళ్లిపోండి" అన్నాడు పరమానందం ఆయాసపడుతూ రాజారావుతో.

'ఏదోవాడు' అనుకున్నాడు రాజారావు.

అతని మనసు బరువెక్కింది.

వెంటనే తమాయించుకుని "పరవాలేదు. భయపడకు. మనూళ్ళో అసలు కుక్కలే లేవు. నాతోరా! ఇంటికి తీసుకు వెళ్తాను" అంటూ పరమానందం చెయ్యి పట్టుకున్నాడు రాజారావు.

అంతలో వాళ్ల వాళ్లు వచ్చి పరమానందాన్ని చెరో రెక్క పట్టుకొని "ఏవనుకోకండి రాజారావు బాబూ! సాయంత్రం నుంచీ ఇదే వరస! మా ఇంటి పక్కన ఓ కుక్క పిల్లల్ని పెట్టిందండి! ఓ కుక్క పిల్లని వీడు ముద్దు చేయబోతే ఆ కుక్క గుర్రుగా మీదకొచ్చి తరిమిందండి. అప్పటినుంచీ వాడివెంట తిరగలేక మాకు ప్రాణాలు మీదికొస్తున్నాయండి" అన్నాడు పరమానందం బంధువొకడు.

వాళ్లు అతన్ని తీసుకువెళ్లిపోయేరు.

ఆ హడావుడికి ఒకళ్ళిద్దరు బయటికి వచ్చినా ఎవరూ ఏమీ మాట్లాడలేదు. రాజారావు ఇంటికి వచ్చేసి, భోజనం చేయకుండానే పడుకున్నాడు.

* * *

ఆ రోజు రాత్రి సీతయ్య బాగా తాగేసి గుడిసెకి వెళ్ళాడు.

సీతయ్య భార్య నాగరత్నం వాడికి భోజనం పెట్టింది.

మత్తుగా నాలుగు మెతుకులు కతికి గోనెపట్టా మీద వాలిపోయాడు సీతయ్య.

పిల్లాడిని ఓ పక్కగా పడుకోపెట్టి సీతయ్య పక్కలో ఒరిగింది నాగరత్నం అటుతిరిగి!

ఎప్పుడో కాని నాగరత్నానికి మొగుడి సుఖం దొరకదు. ఏదో పని వంక పెట్టి సీతయ్యని పొలంలోనో, ఇంటి

దగ్గరో ఉండిపొమ్మంటూంటాడు రెడ్డి నాయుడు.

మధ్యాహ్నం - ఆసుపత్రిలో అంత మంది ముందు రెడ్డినాయుడు తనని అలా కొడతాడని కొంచెం కూడా ఊహించలేదు సీతయ్య. ఆ అవమానం భరించలేకే తన మెడలో ఉన్న బంగారపు ఆంజనేయస్వామి బిళ్ళని పాతిక రూపాయలకి తాకట్టు పెట్టేసి, రెడ్డినాయుడి పశువుల పాకలోనే 'ఐక్లాన్ మందు' కొట్టేశాడు సీతయ్య- నాగులుని తోడు తెచ్చుకొని. బీడీల ఖర్చు, చిరుతిండి నాగులు భరించాడు.

"దగ్గరగా జరుగెహె" అన్నాడు సీతయ్య.

" నేనెందుకు ? ఆ నాగులుగాణ్ని రమ్మనాల్సింది. దొంగమొకం ఎదవని"

నాగరత్నం మరింత ముడుచుకు పడుకుంది.

"ఇయాల అయ్యగోరు కబురంప లేదేంటి ?"

"సాల్లే ! సోద్దెం ! అయ్యగారు నాక్కబురంపటమేంది?"

"అది కాదే ఎర్రిమొగమా! నాకోసం. మజ్జాన్నం కాణ్నించి నేనటు ఎల్లనే లేదుగా ! అందుకని"

సీతయ్యకు మత్తు ఏమాత్రం దిగ లేదు. బలంగా నాగరత్నం నడుంమీద చెయ్యేసి ఒక్క ఉదుటున దగ్గరికి లాక్కున్నాడు.

"అయ్య నాయ్నోయ్ ! ఏంటిది ? పేణాలో బతకనీవా?"

సంసార పక్షంగా మూల్గింది నాగరత్నం సీతయ్య వైపు తిరుగుతూ.

"నీ పేణాలకి నా ఫేణాలడ్డేతాను! నా అంతటోడు లేపోతే నాయుడుగోరే గలంతు."

నాగరత్నం ఎముకలు ఫెటఫెటమన్నాయి.

"మోటు ఎదవ్వి !" అంది నాగరత్నం తృప్తిగా.

" నెలకోసారో, రెండుసార్లో ఈ ఛాన్సు దొరుకుద్ది! మరేం చెయ్యను"

ఆయాసపడుతూ నసిగాడు సీతయ్య.

"అదిగో ! సీరిప్పమాక" అంటూ సీతయ్య చెయ్యిని బలంగా విసిరికొట్టింది నాగరత్నం.

"మా గురువుగోరు ఏం సెప్పారో తెల్సా! ఆడది సీరతోటీ, మగాడు పంచి తోటీ పడుకోకూడదంట! ఆయన సెప్పినట్టు సెయ్యకపోతే ఒళ్ళంతా పుళ్ళడిపోద్దంట"

"పగటేల కూడానా ! మీ గురువు మంచోడిలాగే ఉన్నాడు. ఆళ్ళావిణ్ని అసలు బట్టలే కట్టుకోనీడేమో మీగురువు! పోన్లే కరుసు తప్పుద్ది"

"కరుసు మాటేమో నాకు తెలవదు కాని ఓపాలి నిజంగానే సూశాను... ఆళ్లింటికెళ్లేసరికి గురువుగారు, ఆయన పెళ్లాం ఒంటిమీద నూలుపోగైనా లేకుండా కూకోని ఊసులాడుకుంటున్నారు. నేనెళ్ళాక ఆయన బట్టలు కట్టుకున్నాడు"

చాలా కాలం తరవాత దొరికిన అవకాశాన్ని సీతయ్య దుర్వినియోగపరచ లేదు.

నాగరత్నం పూర్తిగా నగ్నంగా తయారయింది. సీతయ్యని కూడా నగ్నంగా చేసింది నాగరత్నం.

వాళ్లిద్దరు కిందా మీదా అవుతున్నారు. ఇద్దరూ నిదానంగా ఊపిరి తీసుకుంటున్నారు.

అదే దశలో...

బొద్దింక ఒకటి పిల్లాడి మీదుగా పాకింది. వాడు భయంతో పెద్దగా కేక పెట్టాడు.

అదే సమయానికి ... దగ్గరగా తీసున్న తలుపు సందులోంచి దూరిన పిల్లి పిల్లాడి కేకతో బెదిరిపోయి ఛెంగున దూకి నాగరత్నం మీద పడింది.

పిల్లి కాలిగోళ్లు నాగరత్నం వీపుమీద బలంగా దిగాయి. సన్నగా రక్తపు చారిక లేర్పడ్డాయి.

సన్నసన్నగా ప్రారంభమైన మంట క్రమక్రమంగా పెద్దదయింది.

త్వరత్వరగా పంచె కట్టుకుని పిల్లాణ్ని సముదాయించసాగాడు సీతయ్య.

పొద్దుటినుంచీ చెమటతో తడిసి ఎండిన జాకెట్టును తొడుక్కుంది నాగరత్నం.

పిల్లి రక్కులు మరింత ఎక్కువగా మండాయి.

పిల్లి దూకటంతో అసలే భయపడింది నాగరత్నం. దానికి సాయం సీతయ్య గురువుగారు చెప్పిన సంగతులు పదేపదే గుర్తుకు రాసాగాయి.

అంతే!

పర్రున జాకెట్టు చింపి పారేసింది.



కట్టుకున్న చీరను ఊడబెరికింది.
దిసెమొలతో వీధిలోకి వచ్చింది.
"ఇలా ఉంటే ఎంత బావుంటుందో"
అంటూ పరుగులు పెట్టసాగింది నాగ
రత్నం.
అప్పటికి సూర్యోదయం కావటానికి
ఇంకా రెండు గంటలు వ్యవధి ఉంది.
పొలంపనులు చూసుకోవటానికి బయ



ల్దేరినవాళ్లు నాగరత్నాన్ని ఆ స్థితిలో చూశారు.

తెల్లగా తెల్లవారటానికి ముందే ఊరంతా మేల్కొంది.

"నాగరత్నం బట్టలు లేకుండా తిరుగుతోందంట"

"దానికి బలవంతంగా సీరకడితే ఒంటిమీద పుళ్లు లేస్తున్నాయంట"

"అవును నేను చూశాను! దాని ఈపు మీద జానెడు పొడుగున పుళ్లున్నాయి"

మిగతావాళ్లని చూడటానికి వెళ్లినట్టే నాగరత్నాన్ని చూడటానికి కూడా ఊళ్లో వారు చాలా మంది వచ్చారు.

నాగరత్నాన్ని చూడటానికి మగవాళ్ల కంటే ఆడవాళ్లే ఎక్కువ మంది ఎందుకు వచ్చారో రాజారావుకి అర్థం కాలేదు.



సుమారు ఎనిమిది గంటలవేళ మేల్కొన్నాడు రాజారావు.

ఊళ్ళో ఎప్పుడూ ఉండే సందడిలేదు.

నిస్తబ్దత!

భయం!

అనుమానం!

ఆశ్చర్యం!

ఆందోళన!

రెడ్డినాయుడి పాలేరు సీతయ్య భార్య నాగరత్నం నగ్నంగా ఊళ్ళో తిరుగుతోందనే విషయం రాజారావుతో చెప్పాడు సూరయ్య.

మరో పది నిముషాల్లో డేవిడ్ వచ్చాడు.

పెద్దగరువులో మరో ఇద్దరు ఆడ వాళ్లు మనుషుల్ని చూస్తేనే భయపడు తున్నారనే వార్తని మోసుకొచ్చాడు డేవిడ్.

పాతవీధిలో ఇద్దరు మొగాళ్ళు నీళ్ళంటే భయపడుతున్నట్లు, కనీసం వాళ్లు మంచి నీళ్లు తాగటానికికూడా వ్యతిరేకిస్తున్నట్లు చెప్పాడు పెద్ద అప్పన్న వచ్చి.

రాములు పరిస్థితిలో కాని, వెంకన్న ప్రవర్తనలో కాని, భీముడి స్థితిలో కాని, మిగతావాళ్ళ విషయంలోకాని ఏమాత్రం మార్పులేదని కూడా పెద్ద అప్పన్న చెప్పాడు. వాళ్లు కొంతసేపు బాగానే ఉంటున్నారు. అంతలోనే మళ్లీ మైకంలో పడిపోతున్నారు!

సరిగ్గా అప్పుడే...

టముకు వినిపించింది రాజారావుకి.

సూరయ్య బయటకి వచ్చి విన్నాడు.

"ఇయాల ఉదయం తొమ్మిదిగంటలకి పంచాయతీ ఆఫీసుకాడ వున్న రామా లయం గుళ్ళో మీటింగుంది. కాబట్టి అందరూ రావల్సిందొహో..."

ధమా ధమా చప్పుడుచేస్తూ, నిము షానికొకసారి చాటింపు వేస్తున్నాడు మల్లన్న.

చాటింపు విని సత్తిరెడ్డి, గోవిందయ్య, ఆయన కొడుకు ప్రకాశరావు, రాజారావు ఇంటికి వచ్చారు.

క్రితంరోజున పంచాయతీ ఆఫీసులో రెడ్డినాయుడు అన్నమాటలన్నీ పూసగుచ్చి చెప్పాడు గోవిందయ్య. వాళ్ళందరికీ దేవుడంటే భయంఉన్నా, దెయ్యాలమీద,

క్షుద్రశకులమీద నమ్మకం లేదు.

"సరే! మీరంతా రండి!నేనూ స్నానం చేసి వచ్చేస్తాను" అని చెప్పి మీటింగుకు వెళ్ళటానికి సిద్ధమయ్యాడు రాజారావు.

ఇంచుమించు ఊళ్ళో వాళ్ళంతా గుడి దగ్గర హాజరయ్యారు.

పెద్దగరువులో ఉంటున్న వాళ్లు ఓ పక్కగా కూర్చున్నారు.

మిగతా వాళ్లంతా మరో పక్కగా కూర్చున్నారు.

రడ్డినాయుడు, సత్తిరెడ్డి, పర్వతాలు, బెమ్మంతాత, గోవిందయ్య రామాలయం అరుగుమీద ఎడం ఎడంగా కూర్చున్నారు. వాళ్ళందరికీ దూరంగా డేవిడ్ ఓ పక్కగా కిందే చతికిలపడ్డాడు.

వచ్చినవాళ్ళలో ఆడవాళ్లు చాలా తక్కువమంది ఉండటంతో,. వాళ్ళంతా గుడిలోపల కటకటాలలో నిలబడిఉన్నారు. రెడ్డినాయుడు మొదలు పెట్టాడు...

"మనూళ్ళో ఇలాంటి విపరీతాలు ఇది వరకెప్పుడూ జరగలేదు. ఊళ్ళో సాలా మందికి అమ్మోరు సోకిటం తెలుసు; కలరాసోకి వాంతులు, ఇరోసనాలు అవటం తెలుసు; ఒకళ్ళకో, ఇద్దరికో దెయ్యం పట్టడం తెలుసు.కాని ఇంతమంది ఇలా ఇసిత్రంగా అయిపోవటం ఇదివరకెప్పుడూ జరగలేదు. రాజారావు లాంటోళ్లు ఈళ్లందరికీ ఏయో రోగాల పేర్సెప్పి వయిజ్జం సేయించినా లాభంకనపళ్ళేదు."

సరిగ్గా అప్పుడే రాజారావు,ప్రకాశరావు అక్కడికి వచ్చారు. వాళ్ల వెనకాల నారాయుడు, సూరయ్యకూడా వచ్చారు.

"అదిగో! రాజారావుకూడా వచ్చాడు. రావయ్యా! ఇలా రా" అంటూ రెడ్డి నాయుడు రాజారావుని ఆహ్వానించాడు. అక్కడికి వెళ్లకపోతే బావుండదనే ఉద్దేశంతో అరుగుపక్కనే నుగాంధ కోసం నిలబడ్డారు ఆ ఇద్దరూ !

సత్తిరెడ్డిని మరీబలవంతంచేసి పక్కనే కూర్చోపెట్టుకున్నాడు రెడ్డినాయుడు.

"అందువల్ల ఊల్లో మళ్లీ అందరూ నిర్భయంగా, నిచ్చింతగా బతకాలంటే ఏం సేయమంటారో,మీరేసెప్పండి! అందరూ ఏంసేద్దామంటే అలాగే నడుచుకుంటాను నేను. ఊళ్ళో వాళ్లందరూ కులాసాగా ఉండాలనేదే నా అభిప్రాయం"

రెడ్డినాయుడు ఉపన్యాస ఫక్కీలో చెప్పాల్సింది చెప్పాడు.

"అమ్మోరికి జాతర సేత్తే అన్ని ఇపరీతాలు ఆటంతటయే ఎగిరిపోతాయ్"

పర్వతాలు రెండురోజుల్నించి అదే పాట పాడుతున్నాడు.

"జాతర సేయిత్తే ఆడి కుటుంబానికి పదో పరకో గిడతదని సూత్తన్నాడు పర్వతాలు"

జనంలోంచి ఎవరోవ్యాఖ్యానించారు.

పర్వతాలు కుటుంబంలోని వాళ్ళే చాలా కాలం నుంచీ ముసలమ్మగుడికి పూజారులుగా ఉంటున్నారు.ఏటా ఉగాదికి రివాజుగా ముసలమ్మగుళ్ళో జాతర చేయటం ఆ ఊరి ఆచారం.

ఊళ్ళో ఏవైనా రోగాలూ, జబ్బులూ వ్యాపించినా, కరువు కాటకాలు వచ్చినా ఏడాదిమధ్యలో అప్పుడప్పుడు జాతర చేస్తారు. అయితే, అందుకు ఊరివాళ్లంతా ఒప్పుకోవాలి. అందరూ చందాలు వేసుకొని చేసే ఊరి పండగ అది.

పర్వతాలు స్వార్థం పదిమందికీ అర్థమయిపోవటంతో అసలువిషయం వదిలేసి అతన్ని దుయ్యబట్టటం ప్రారంభించారు అక్కడ సమావేశమైన జనం.

"సరే!అయితే, జాతర సేయించద్దను కుంటే అలాగే సేద్దాం! మరైతే ఏం సేద్దారో సెప్పండి"

రెడ్డినాయుడు మళ్లీ కలగజేసుకొని రణగొణధ్వనిని కొంతవరకు ఆపాడు.

"ఇండీషనుకు మావోడికి ఏమీ గుణం కాపళ్లేదు. మిగిలినోళ్ల పెవరన్నోనూ మాచుపేంలేదు...ఈళ్ళందరినీ సూత్తాంటే ఊరోళ్ళకి ఎవరో సేతబడి సేయించుంటా రని అనిపిత్తాంది"

పెద్ద అప్పన్న తన ఉద్దేశాన్ని చెప్పాడు.

ఆ మాటలకి రెడ్డినాయుడు ముఖంలో చిన్న మెరుపు కనిపించింది రాజారావుకి.

'సేతబడి' అనే మాట వినిపించగానే నాగులు, సీతయ్యా కూడా సర్దుకు కూర్చో వటం గమనించాడు రాజారావు.

గుళ్ళో కటకటాల వెనుక నిలబడి ఉన్న ఆడవాళ్ళలో ఒక్కసారిగా కల కలం ఎక్కువయింది.

"అయ్ బాబోయ్! సేతబడంట!"

"సేతబడంటే పెయోగవేగా! అమ్మ నాయనోయ్!"

"నాకూ అలాగే అనిపించింది ఈల్లం దర్నీ సూశాక! అయినా నాకెందుకులే అని ఊరుకున్నాను"

"సేతబడికి మందులు పన్చేత్తాయేంటి అల్ల పిచ్చికాని"

"ఆ సేసినాడెవడో బొంగతొత్తు కొడుకు! ఆడికేం మాయరోగవో"

ఆడవాళ్లు వాళ్ళలో వాళ్లు మాట్లాడు కొనే మాటలు వాళ్ళకే వినిపించనంత ఎక్కువగా రొద పెరిగిపోయింది.

గోవిందయ్య వెనక్కి తిరిగి వాళ్ళని మందలించాడు.

"ఏమిటా అరుపులు? కాసేపు మాట్లాడకుండా ఉండలేరూ! అసలు వీళ్ళని రానియ్యడం మనదే బుద్ధితక్కువ"

మళ్లీ ఓ క్షణం ఆ ప్రదేశమంతా నిశ్శబ్దంగా ఉండిపోయింది.

డేవిడ్ లేచి తన ఉద్దేశాన్ని చెప్పాడు–

"నిన్న మావోడి గురించి పిప్పరెల్లొచ్చాం.గద్దెమీద రావులమ్మ సెప్పింది– మా జాన్‌గాడికి సేతబడి జరిగిందని. మీరూ మీరూ ఏం సేసుకుంటారో మాకు తెలవదు. మేంమాత్రం మావోడికి సేసిన సేతబడిని తిరగ్గొట్టించుకుంటాం ..."

డేవిడ్‌కి నచ్చచెబుతున్నట్టుగా గొంతు సవరించుకుని రెడ్డినాయుడు అందుకున్నాడు–

"మీ జాన్‌గాడొక్కడే కాదుకదా! ఈ వూళ్లో ఇంతమందికి సేతబడే జరిగ్గుంటది. ఒకడికి సేతబడైతే, ఇంకోడికి దెయ్యవట్టి, మరోడికి గాలి తగులదా? అందరికీ సేత బడే జరిగుంటది! ఏం సత్తిరెడ్డీ! నీ అభిప్రాయమేమిటి?"

రెడ్డినాయుడి మాటలకి సత్తిరెడ్డి ఇరుకున పడ్డాడు. 'ఏం చెప్పమంటావ్' అన్నట్టు రాజారావువైపు చూశాడు సత్తిరెడ్డి.

అంతవరకూ అక్కడ జరిగిన చర్చ రాజారావుకు ఏమాత్రం నచ్చలేదు. స్పెష లిస్టులను పిలిపించో, లేకపోతే వాళ్ళనే పెద్దాసుపత్రికి తీసుకువెళ్ళో వైద్యం చేయించటం మంచిదని అతని ఉద్దేశం.

రాజారావు అందర్నీ ఉద్దేశించి మాట్లాడాడు.

"నా మాటలు జాగ్రత్తగా వినండి! మానసిక భ్రమలవల్లా, భయాలవల్లా ఇలా జరిగేందుకు అవకాశం ఉందని డాక్టరుగారు చెప్పనే చెప్పారు. మందు లకూ, వైద్యానికీ తగే రోగాలను,

లకు చేతబడి అనో, మరొకటో పేరుపెట్టి అనవసరంగా వాళ్ళ ప్రాణాలకు ప్రమాదం తీసుకురావద్దు"

రెడ్డినాయుడు తరఫువాళ్లు వెంటనే గోలగా అరవటం మొదలెట్టారు...

"పెద్ద పోటుగాడు చెప్పొచ్చాడ్రా! వయిద్దెం సేయిత్తాడంట! సేయించారుగా! అందరికీ రంగునీళ్ల ఇండిషన్లు చేశారు. ఏమయింది? తుస్సుమంది"

"సైకిళ్ళ మీదడి కాలిరిగితే తనకి వైజ్జం చేసుకోలేకపోయాడు కాని ఊళ్ళో అందరికీ వైజ్జం సేత్తాడంట! ఆ డాక్టుకి ఈడు తోడు! ఊరోళ్లని సమంగా బతకనిచ్చేలా లేరీళ్లు!"

"నాలుగచ్చరం ముక్కలు సదివితే సాలు నోటికొచ్చినట్లు మాటాడ్డమే"

ఒక్కొక్కళ్ళూ ఒక్కోలా రాజారావును దుమ్మెత్తిపోయసాగారు.

అందరి మాటలూ నిదానంగా విన్నాక రాజారావు మళ్లీ మొదలు పెట్టాడు.

"నా ఉద్దేశం నేను చెప్పాను! డాక్టరు గారు చేసిన ఇంజక్షన్లవల్ల ఉపయోగం లేదని గుండెలమీద చెయ్యేసుకు చెప్పండి! వాళ్ళందరివీ మానసిక రోగాలు కాకపోతే ఇంజక్షను ఇచ్చాక వాళ్ళంతా ఎందుకు నిద్రపోయారు? స్పృహ వచ్చాక కాస్సేపు ఎందుకు మామూలుగా మాట్లాడారు? అంతలో వాళ్ళకి తమ భయాలు,భ్రాంతులు జ్ఞాపకం వచ్చాయి కనుకే మళ్లీ మామూలుస్థితిలో పడిపోయారు. కొన్నాళ్ల పాటు వైద్యం చేస్తే వాళ్ళంతా గ్యారంటీగా కోలుకుంటారు. మీరందరూ ఒప్పుకుంటే స్పెషలిస్టుల్ని పిలిపించి వైద్యం చేయిద్దాం! గుణం కనిపించకపోతే చెప్పు తీసుకుని కొట్టండి నన్ను"

రాజారావు ఆవేశపడటాన్ని సత్తిరెడ్డి గమనించాడు.

"పోన్లే రాజారావ్! ఎవరిట్టం ఆళ్ళది. మనం సెప్పి సూత్తాం. కాదంటే ఆళ్ళ కర్మ!"

రాజారావు మరేమీ అన్లేకపోయాడు.

బెమ్మంతాతకీ, డేవిడ్‌కీ రాజారావు మీద గౌరవం ఉంది. అతని మాటని వాళ్లు ఎప్పుడూ కాదనలేదు. కాని రాములుకీ, వెంకన్నకీ, భీముడికీ, జాన్‌కి ఇంజక్షన్లు చేసినా, వాళ్ళకి తగ్గలేదనే ఉద్దేశంతోనూ, పిప్పరలో గద్దెమీద జాన్‌కి చేతబడి జరిగిందని చెప్పటంతోనూ • వాళ్లు కూడా చేతబడికి విరుగుడు చేయించటమే మంచిదనే అభిప్రాయానికి వచ్చారు.

రాజారావు అభిప్రాయాన్ని తనపక్షం వాళ్లు వ్యతిరేకించడం రెడ్డినాయుడికి కొండంత బలాన్నిచ్చింది. వాళ్లు అలా చేయటం వల్ల అంతవరకూ రాజారావు చెప్పినట్లు నడుచుకుందామనుకున్న చాలా మందిలో కొంచెం మార్పు వచ్చింది.

"ఇంతకీ ఇప్పుడు సేయాల్సిన పనేంటి! ఈ మీటింగు తొరగా కానితే మరి నేను ఎల్లాల. అవతల సాలాపనుంది నాకు" అన్నాడు రెడ్డినాయుడు.

"మంతరగాళ్ళని రప్పించండి. లేదా ఈల్లందర్నీ ఆళ్ళకాడికి తీసుకెల్లండి"

జనంలో ఒకడు సలహా ఇచ్చాడు.

పర్వతాలు-రెడ్డినాయుడి దగ్గరకు వెళ్లి చెవిలో ఏదో గుసగుసలాడాడు.

"ఏంటారాస్యాలు! అవేంటో మాకూ సెప్పండి. ఇని ఆనందిత్తాం"

ఇంకెవరో పర్వతాలుని వేళాకోళం చేశారు.

"మరేంలేదు. ఎలాగైనా జాతరే

జరిగేట్టు సూడమని బతిమాల్తున్నట్టు న్నాడు"

గోవిందయ్య కొడుకు ప్రకాశరావు రెడ్డినాయుడి వర్గంమీద ఉన్న కసికొద్దీ చులకనగా వ్యాఖ్యానించాడు.

గోవిందయ్య కొడుకుని కసిరి "నీ కెందుకురా పెద్దాళ్ళ గొడవ! నువ్వు అవతలికెళ్లు" అని అక్కడి నుంచి బల వంతంగా ప్రకాశరావుని పంపేశాడు.

"పర్వతాలు సెప్పేదేంటంటే, సేత బడి మంతరగాణ్ని పిలిపించటానికీ, ఆ తరవాత సేతబడిని తిరగ్గొట్టించటానికి అయ్యే కరుసులన్నిటినీ పంచాయితీయే బరిత్తే బావుంటుందంటన్నాడు"

రెడ్డినాయుడు పర్వతాలుని వెనకేసు కొని వసున్నాడనిపించింది గోవిందయ్యకీ, సత్తిరెడ్డికీ!

పర్వతాలు రెడ్డినాయుడి చెవిలో చెప్పిన మాటలు వాళ్లిద్దరికీ సన్నగా వినిపించాయి. నిజానికి పర్వతాలు "సందాల ఊసెత్తరేంటి?" అన్నాడు రెడ్డి నాయుడు చెవిలో. ఆమాటే అడుగుదామని నోటిదాకా వచ్చింది గోవిందయ్యకి. కాని రహస్యం చెప్పిన పర్వతాలు, విన్న రెడ్డి నాయుడు తన మాటని కాదని అబద్ధం ఆడితే...?

అంతమందిలో పరువు పోతుందనీ, పెద్దరికం గంగలో కలుస్తుందనీ భయపడి కిమ్మనలేదు గోవిందయ్య. సత్తిరెడ్డికీ అలాంటి సందేహమే వచ్చి మాట్లాడకుండా ఊరుకున్నాడు.

"అవును. కరుసులన్నింటినీ పంచా యితీ బరించటం మంచిది"

పర్వతాలు నిజంగానే ఆ సలహా ఇచ్చాడని నమ్మి దేవిడ్, బెమ్మంతాత కూడా అతనికి వత్తాసు పలికారు.

"కానీ..."

రెడ్డినాయుడు అందరివైపు ఓరకంటి తోనూ, నేల చూపులతోనూ చూస్తూ తన ఉద్దేశాన్ని బయటపెట్టాడు.

"పంచాయతీ సొమ్ముని కరుసు సేయ టానికి నాకేం పపర్సు లేవు. ఇప్పుడు నేను పెసిడెంటునికాను. కేవలం మీలా మామూలుమనిషిని! పంచాయతీలన్నిటినీ పెబుత్వం రద్దుసేసి సాలాకాలమయింది కదా! రేపొచ్చే మార్చిలో ఎలచ్చన్లు జరుగుతాయంట! అప్పుడు నేను పోటీ సెయ్యాల...మీరంతా నన్ను గెలిపించాల. అంతకతుంది. మాజీ పెసిడెంటుగా నేను ఇప్పుడు పంచాయతీ సొమ్ముని పెజల కోసం కరుసుపెట్టటం సాద్దెంకాదు. అంచేత...మరో మార్గమేవన్నా సెప్పండి! అలాగే సేద్దాం!"

ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. రెండు క్షణాల తరవాత పర్వతాలే ఓ సలహా చెప్పాడు.

"మనూరి జనాబా రెండేలు. మనిషికి అయిదురూపాయల సొప్పున సందాలేసు కుంటే పదేలు జమదతాయి. ఇక్కడ అయ్యేకరుసులికీ, మంతరగాడియ్యటానికీ సరిపోద్ది! ఏవంటారు రెడ్డినాయుడుగోరూ?"

దేవిడ్‌కి ధర్మసందేహం వచ్చింది.

"అసలు మంతరగాళ్ళెవరైనా తెలిసీ నోళ్లున్నారా? ఉంటే అళ్లు మనూరొచ్చి ఈళ్లందరికీ సేతబడికి ఇరుగుడు సేత్తారా? అళ్లు ఎంతుచ్చుకుంటారు? ఈ ఇవరాలేవీ తెలవకుండా ఏంటి సొద...?"

బెమ్మంతాతకూడా దేవిడ్‌కి భరోసాగా నిలిచాడు.

"నిజమే! దేవిడ్ సెప్పింది నిజమే! ముందు ఆ ఇసయం చూదండి"

వెంటనే రెడ్డినాయుడుఅందుకున్నాడు-
"అయిద్రాబాద్‌కి దగ్గర్లో పెదమంగ లారం అనే ఊరుందా? ఆ ఊల్లోకూడా మనూల్లో జరిగినట్టే ఎవరో ఊరోల్లందరికీ సేతబడి సేయించారంట! అప్పుడు ఆ ఊరోల్లంతా ఓ మంతరగాణ్ని తీసుకొచ్చి అందరికీ నయంచేసేసారంట! పెదమంగ లారంలో మనకి తెలిసునోడున్నాడు. అణ్నట్టుకొని రెండ్రోజుల్లో మంతరగాణ్ని మనూరు తీసుకొచ్చేత్తాను! ఎటొచ్చీ, అసలు సంగతి తేలాల. ఆ మంతరగాడు మూడేలరూపాయలు తీసుకొంటాడంట! పూజలకీ, కోల్లనీ, మేకల్నీ బలియ్యటానికీ ఇంకో రెండు మూడేలు సులాగ్గా కరుసవు తాయి. ఆ మంతరగాణ్నీ, ఆల్ల మనుసు లినీ తీసుకురాటానికి రైలు కరుసులు అయ్యీ ఎంత తక్కువేసుకున్నా అయి దొందలు కావాలి. మరి, దీన్నిబట్టి మనం ఆలోచించాల"

రెడ్డినాయుడి బట్టతలమీద పూర్తిగా చమటలు కమ్మేశాయి!

పైకండువాతో చమటనుఅద్దుకొంటూ కంటికి ఎదురుగా కనిపించినవాణ్ని "ఒరే! ఓ సెంబుతో మంచిసీల్లట్రా!" అని పురమా యించాడు.

రాజారావుకి రెడ్డినాయుడి పన్నాగం అర్థమయిపోయింది.

"ఊరువాళ్ళ మంచిని కోరేదెవరో, నిజంగా ప్రజల కష్టనష్టాలగురించి పట్టించు కొనేదెవరో ముందు ముందు మీకే తెలు సుంది" అని సత్తిరెడ్డికీ, గోవిందయ్యకీ చెప్పేసి రాజారావు అక్కడినుండి ఇంటికి వచ్చేశాడు.

రెడ్డినాయుడు సంతృప్తిగా నిట్టూ ర్చాడు. పర్వతాలు బహిరంగంగానే గుండెలమీద చెయ్యేసుకుని "అమ్మయ్య" అన్నాడు తేలికపడ్డ మనసుతో!

"అయితే రెడ్డినాయుడుగోరు సెప్పిన లెక్కప్రకారం ఆరువేలు వుంటే సరిపోతా యన్నమాట! మడిసికి మూడూపాయల సొప్పున సందాలు పోగేత్తే సరిపోద్ది" అన్నాడు బెమ్మంతాత.

"అలాగే కానివ్వండి! అదేదో వెంటనే తెవిల్చేత్తే, మరి రేత్రికే నేను బయల్దేర తాను" అని విషయాన్ని తేల్చేశాడు రెడ్డి నాయుడు.

"అదెలా కుదురుద్ది! మా ఇంట్లో ఎవ రికీ సేతబడి జరుగలేదు. మేము సందా ఇవ్వం" అన్నాడు జనంలో ఒకడు.

"ఎవరెవరి ఇళ్లల్లో సేతబడి జరిగిందో ఆల్లంతా కలిసి డబ్బులు పోగేసుకొని ఆ మంతరగాణ్ని పిలిపించుకోండి"అన్నాడు మరొకడు.

"జనాభా లెక్కలకి పనికొచ్చేవోల్లమే గాని డబ్బులియ్యమంటే ఎక్కణ్నించి తేం" అన్నాడు ఇంకొకడు.

పరిస్థితి విషమించేలా కనిపించింది రెడ్డినాయుడికి.

"అలా అంటే ఎలా? ఊరందరికోసం సేత్తున్న పనిది. నా స్వార్దంకోసవా? నా యింట్లో పెళ్ళా!"

రెడ్డినాయుడు అలా నిష్టూరమాడ టంతో పర్వతాలు కలగజేసుకున్నాడు.

"అయ్‌బాబో! అదేంటండి మీరు కూడాను! వార్డు పెద్దలే సందాలు పోగేసి రేత్రికి డబ్బులు తెచ్చిత్తారు! మీరు పెయాణానికి సిద్ధంగా ఉండండి"

డేవిడ్‌కి, బెమ్మంతాతకి భయంవేసింది. తమ వార్డులలో చందాలు పోగుచేసే భారం మీద పడుతుందని.

చివరికి అంతే జరిగింది.

సత్తిరెడ్డి, గోవిందయ్య మంత్రగాడిని

రప్పించటంలో తమకేం ప్రమేయం లేద న్నట్లు ఆ విషయం గురించి ఏమీ మాట్లాడకుండా అక్కడి నుంచి లేచి వచ్చేశారు.

జనంలో ఎవరో అరిచారు-

''ఊళ్ళో పెద్దల దగ్గిర్నుంచి తలా వందో, రెండొందలో వసూలు చేయండి! ఊరోల్లు కొంత ఇత్తారు. మొత్తంమీద పని జరిపించెయ్యండి''

సరిగ్గా అప్పుడే...

జనంలో ఒకడు "బాబోయ్! అమ్మోయ్" అని అరుస్తూ విరుచుకు పడిపోయాడు.

అతని చుట్టూ జనం మూగేసరికి మరింత బెంబేలెత్తిపోయి ఎంత మంది పట్టుకుందామని ప్రయత్నించినా ఆగ కుండా పసుగెత్తుకొని వెళ్లిపోయాడు.

"ఇంత మందుండగానే ఈడెవడికో సేతబడి సోకింది. ఇలా అయితే వారం తిరక్కుండా ఊరంతటికీ సేతబడి జరిగి పోద్దో, ఏటో"

బెమ్మంతాత బాధగా అన్నాడు.

ఆ సంఘటనతో ఊరు మొత్తం భయంలో మునిగిపోయింది

ఎవరికైనా తుమ్ము వచ్చినా, జలుబు చేసి దగ్గొచ్చినా, నిద్రలేక ఒళ్లు వెచ్చబడినా "చేతబడి జరిగిపోయింది" అని భయపడిపోసాగారు గ్రామప్రజలు!

ఆ సాయంత్రం ఆరు గంటలకి ఊళ్ళో బలవంతంగా పోగు చేసిన సొమ్ము నాలుగు వేలు.

రాజారావు వీధిలోని వాళ్లెవరూ పైస కూడా చందా ఇవ్వలేదు.

సత్తిరెడ్డి పాలేరు నారాయుడు, కొట్టు సోమయ్య, వెంకటేశం కుటుంబం కూడా



చందాలివ్వబోమని ఖచ్చితంగా చెప్పే శారు.

"సరే! ఏంసేతాం! నేనో రెండేలు సందా ఇత్తాను! మొత్తం డబ్బెట్టి మంతర గాణ్ని తీసుకొత్తాను" అన్నాడు రెడ్డి నాయుడు.

ఆరాత్రి 9 గంటలకి తాడేపల్లిగూడెంలో గోదావరి ఎక్స్‌ప్రెస్ ఎక్కాడు రెడ్డి నాయుడు!

* * *

నీట్‌గా ఇన్‌షర్ట్‌చేసి, చేతిలో సూట్ కేసుతో ముదునూరు బస్‌స్టాప్‌లో బస్సు దిగాడు ముప్ఫై ఏళ్ళ వ్యక్తి.

రోడ్డు వారగా ఆంజనేయస్వామి గుడిని ఆనుకుని ఉన్న కిళ్ళీ దుకాణం దగ్గరకు వచ్చి "రాజారావు ఇంటికి ఎలా వెళ్లాలి?" అని అడిగాడు కిళ్ళీకొట్లో కూర్చున్నతన్ని!

"ఏవూరు బాబూ మన్ది?"

"హైదరాబాద్! రాజారావు నా ఫ్రెండ్. అయిదేళ్ళ క్రితం మేమిద్దరం ఒకే ఆఫీసులో పని చేసేవాళ్ళం. అతన్ని చూడాలని వచ్చాను! నా పేరు ప్రభాకర్. రాజారావు ఇంటికి ఎలా వెళ్ళాలో చెబుతారా?"

"మీరు ఇప్పుడు ఏం పని సేత్తన్నారు?"

"హైదరాబాద్‌లో పత్రికా విలేఖరిగా పని చేస్తున్నాను"

"అయితే మా ఊల్లోని ఇసయాలన్నీ మీ పేపర్లో ఏతారా?"

"మీ ఊళ్ళో ఏం జరిగింది?"

"అయ్ బాబోయ్! ఏం జరగటమేం టండీ! ఊరు ఊరంతటికీ సేతబడి సేశా రండి. ఒకళ్లేమో మాటాపలుకూ లేకుండా పడిఉన్నాడాండీ! ఇంకోడేమో ఆసనా లేత్తన్నాడాండీ! ఒకావిడేమో బట్టలిప్పు కొని తిరిగేత్తందండి! ఆ భీముడుగా డేమో తిండి తింటంలేదండీ! ఆడికి అన్న వెడితే పురుగులు కనిపిత్తన్నాయం టండీ..."

ప్రభాకర్ నిశ్చేష్టుడై పోయాడు — కిళ్ళీకొట్టు యజమాని చెప్పిన మాటలకి.

ఓ సోడా కొట్టించుకొని, తాగాడు.

తాపీగా సిగరెట్టు ముట్టించి "అయితే మీ ఊరువాళ్లు ఏం చేద్దామనుకుంటు న్నారు" అని అడిగాడు విషయాలు రాబట్టటానికి.

"మాజీ పెసిరెంటుగోరు హైదరాబాద్ ఎల్లారండి. మంతరగాణ్ని తీసుకొత్తారం టండి! ఈ మాపటికో, రేపటికో ఆళ్లు వొచ్చేత్తారండి!"

"ఇంతకీ రాజారావు ఇంటికి ఎలా వెళ్ళాలో చెప్పలేదు!"

"తిన్నగా ఊళ్ళోకెళ్ళిపోండి! అబ్బే వద్దులెండి! అంత దూరం నడిసెల్లలేరు. రిచ్చా ఎక్కెయ్యండి! రాజారావు ఇంటి కంటే ఆదే దింపేత్తాడండి"

కిళ్లీకొట్టు యజమానే రిషాని కేకేసి ప్రభాకర్‌ని రాజారావు ఇంటికి తీసుకు వెళ్ళమని చెప్పాడు.

రోడు దాటాక "ఇదిగో! అబ్బాయి గోరండీ! ఆడికి రూపాయి పావళా ఇవ్వండి సాలు" అని కేక పెట్టాడు కిళ్ళీకొట్టు యజమాని.

తనని ఆ కొట్టుదగ్గర మిగతావాళ్లు వింతగా చూడటం గమనించాడు ప్రభాకర్.

కాని, వాళ్ళగురించికాక ఊళ్ళో జరిగిన చేతబడిగురించి ఆలోచించసాగాడు— రిక్షాలో పోతూనే.

రోడ్డు మొదటి మలుపుతిరగ్గానే ఎడమ

వైపున పబ్లిక్ హెల్త్ సెంటర్ కనిపించింది. కుడివైపున పెద్ద గరువు మీద కొన్ని గుడిసెలు, ఓ మాదిరి ఇళ్ళూ వున్నాయి.

మరో అయిదు నిముషాల తర్వాత ఇంకో మలుపు వచ్చింది. ఆ మలుపులో ఎడమపక్కన ముసలమ్మగుడీ, గుడిని ఆనుకొని పెద్దచెరువూ, ఆ చెరువుగట్టున అప్పర్ ప్రైమరీ స్కూలు కనిపించాయి.

రిక్షా స్కూలువైపుగా కాక, కుడివైపు తిరిగి ఓ వీధిలోకి ప్రవేశించింది. రెండు పెంకుటిళ్ళ తరువాత మూడో ఇంటిదగ్గర ఆగింది రిక్షా.

రిక్షా దిగుతూ టైముచూసుకొన్నాడు ప్రభాకర్.

'తొమ్మిది' అనుకున్నాడతను.

ఇంటిముందు రిక్షా ఆగటాన్ని కిటికీలోంచి చూసింది జానకి.

పెరట్లో స్నానం చేస్తున్న రాజారావు దగ్గరికి పరుగెత్తుకు వెళ్ళి "అన్నయ్యా... అన్నయ్యా! ఎవరో వచ్చారు. సూట్‌కేసుంది చేతిలో. పేంటూ, షర్టూ వేసుకున్నాడు. టకప్ చేశాడు" అని చెప్పింది.

'ఎవరై ఉంటారు' అని క్షణం ఆలోచించి సూరయ్యని పిలిచి "చూడు ఎవరో వచ్చారు! కూర్చోపెట్టు! రెండు నిమిషాల్లో వచ్చేస్తాను" అని చెప్పి హడావుడిగా స్నానంచేయసాగాడు రాజారావు.

సూరయ్యవచ్చి ప్రభాకర్‌ని— సావిట్లో కుర్చీవేసి కూర్చోపెట్టాడు!

జానకి కాఫీ పెట్టటానికి వంటింట్లోకి వెళ్ళింది.

తడి తల తుడుచుకుంటూ లుంగీమీద సావిట్లోకి వచ్చాడు రాజారావు.

"నమస్కారమండీ! నేను హైదరాబాదులో రిపోర్టరుగా పని చేస్తున్నాను. మీ ఊళ్లో చాలామందికి చేతబడిజరిగిందని తెలిసింది. కొంచెం ఇన్‌ఫర్మేషను కోసం వచ్చాను" అన్నాడు ప్రభాకర్!

"ఓర్నీ! నువ్వా! ఏమిట్రా ఫోజు! అవునూ, అప్పుడే నీకెలా తెలిసింది ఈ విషయం? అన్నట్టు నువ్వు వస్తున్నట్టు ఉత్తరం రాసి ఏడవలేకపోయావా?" అంటూ దగ్గరకువచ్చి భుజంమీద గట్టిగా చరిచాడు రాజారావు.

"హమ్మయ్య! నువ్వు పాత రాజారావువే! ఏమీ మారలేదు. ఉద్యోగం మానేసినట్టు, ఈ వూళ్ళోనే స్థిరపడినట్లు నువ్వు నాకు తెలియజేసి ఉంటే, ఇవాళ నేను వస్తున్నట్టు నీకు ఉత్తరం రాసి ఏడిచి వుండేవాడిని! నువ్వు అలా ఏడవలేదు. నేను ఇలా ఏడవలేదు. మెయిన్ రోడ్డు మీద కిళ్లీకొట్టువాడు మాత్రం నన్ను ప్రశ్నమీద ప్రశ్నతో ఏడిపించేశాడు" అన్నాడు ప్రభాకర్.

జానకి కాఫీలు తెచ్చింది!

"మా చెల్లెలు జానకి. టెంత్ చదువుతోంది పెంటపాడులో. జానకీ! వీడు ప్రభాకర్ అని, ఇదివరకు నేను గణపవరంలో సబ్ రిజిస్ట్రార్ ఆఫీసులో పని చేసేటపుడు నాతోపాటు పనిజేసేవాడు. నేను ఉద్యోగం మానేయటానికి రెండు నెలలు ముందు వీడు హైదరాబాద్ ఉడాయించేశాడు" అంటూ పరిచయాలు పూర్తి చేశాడు రాజారావు.

ఇద్దరూ రాజారావు పడకగదిలో కూర్చుని కబుర్లు చెప్పుకోసాగారు.

జానకి స్కూలుకు వెళ్ళిపోయింది.

తండ్రి చనిపోయాక తాను ఉద్యోగం మానేసి వ్యవసాయం చూసుకొంటున్నట్లు, గూడెంలో ఓ పౌల్ట్రీ ఫారం పెట్టినట్లు చెప్పాడు రాజారావు.

తరువాత ఊరి విషయం ప్రస్తావనకు వచ్చింది. మూడురోజుల పరిధిలో వింత వింతగా ప్రవర్తిస్తున్నవారి సంఖ్య పన్నెండుకు పెరగటం, డాక్టరు కృష్ణ మూర్తి రిక్షా ఏక్సిడెంటవటం, మాజీ ప్రెసిడెంటు రెడ్డినాయుడు చేతబడి మాంత్రికుడి కోసం హైదరాబాద్ వెళ్ళటం వగయిరా లన్నీ వివరంగా చెప్పాడు.

"అయితే వెంటనే నువ్వో సాయం చెయ్యాలి! నాకు అర్జంటుగా ఓ ఫొటో గ్రాఫరు కావాలి. నేను వీళ్ళందర్నీ ఫొటోలు తీసుకొని, వాళ్ళఇంట్లోవాళ్ళతో మాట్లాడి రిపోర్టు తయారు చేసుకొని రాత్రికే హైదరాబాద్ వెళ్ళిపోతాను. నేను లెక్కప్రకారం రేపు డ్యూటీలో జాయి నవ్వాలి. గణపవరం సబ్ రిజిస్ట్రార్ ఆఫీస్‌లో చిన్నపని ఉండి సెలవుపెట్టి వచ్చాను. నువ్వు ఉద్యోగం మానేశావని తెలియటంతో ఓసారి చూసిపోదామని ఇక్కడికివచ్చాను.పనిలోపని నాకు మంచి న్యూస్ దొరికింది" అన్నాడు ప్రభాకర్.

సూరయ్యని సైకిలుమీద గూడెం పంపాడు రాజారావు- ఫొటోగ్రాఫర్ కోసం.

"అసలు నీమీద రెడ్డినాయుడికి ఎందుకు కోపం?"

ప్రభాకర్ మామూలుగానే అడిగాడు.

"ప్రత్యేకంగా ఏమీలేదు! పంచాయతి ఎన్నికలు వస్తున్నాయి కదా! ఊళ్ళో కొంతమంది ఈసారి నన్ను నిలబడ మన్నారు. అందరూ సరేనంటే నాకేమీ అభ్యంతరం లేదన్నాను. అంతే! నేను నిలబడితే తాను ఓడిపోతానని రెడ్డినాయుడి భయం. అందుకే నేను యతి అంటే తాను ప్రతి అంటున్నాడు. వాళ్ళకి వైద్యం చేయించటం విషయంలోకూడా అలాగే జరిగింది. తమవాళ్ళు ఏమైపోతారో అనే భయంతోపాటు మూఢనమ్మకాలు కూడా తోడై చివరికి నన్ను బలపరిచేవాళ్ళు, నేనంటే గౌరవం ఉన్నవాళ్ళు కూడా రెడ్డినాయుడి మాయ మాటల్లో పడిపోయారు".

ఇద్దరూ భోజనాలు పూర్తిచేసి ఊళ్లోకి వెళ్ళటానికి సిద్ధమయ్యేసరికి ఫొటో గ్రాఫరు స్కూటరుమీద వచ్చాడు.

పాతవీధి, తూర్పుపేట, పెద్దగరువు అన్ని చోట్లకి వెళ్లారు–రాజారావు, ప్రభాకర్, ఫొటోగ్రాఫరు.

అందరి ఇళ్ళలోని వారినీ వివరాలు అడిగాడు ప్రభాకర్.

రాములు మామూలుగా కాళ్ళూ, చేతులూ తపతపా కొట్టుకుంటూనే ఉన్నాడు. అప్పుడప్పుడు!

వెంకన్న పిల్లిమొగ్గలు వేస్తూనే ఉన్నాడు. భీముడు అన్నం కంచాన్ని దగ్గరకు ఏమాత్రం రానియ్యటం లేదు.

జాన్ నిప్పుని, మంటల్ని చూసి భయపడుతూనే ఉన్నాడు.

తాతబ్బాయి, వెంకటేశం తల పైకెత్తి చూడలేకపోతున్నారు.

నాగరత్నం ఇంకా నగ్నంగానే ఉంది.

మిగిలినవాళ్లు నీళ్ళంటేనూ, కుక్క లంటేనూ, జనమంటేనూ ఝడుసు కుంటూనే ఉన్నారు. వాళ్ళంతా రోజు మొత్తం అలా ఉండటం లేదనీ, కాస్సేపు తెలివిగానే ఉంటున్నారనీ, అంతలోనే అలా ప్రవర్తిస్తున్నారనీ ఊళ్ళోవాళ్లు చెప్పారు.

ఒక్కొక్కళ్లనీ విడివిడిగా ఫొటో తీసి, కావలసిన సమాచారం నోట్ చేసు కొన్నాక ముగ్గురూ రాజారావు ఇంటికి

వచ్చేశారు.

"నేను ఏడు, ఎనిమిదింటికి ఫొటో స్టూడియోకి వస్తాను. అప్పటికి ఫొటోలు సిద్ధం చేసి ఉంచండి. రాత్రి గోదావరికి నేను వెళ్తాను" అని చెప్పి ఫొటోగ్రాఫరును పంపేశాడు ప్రభాకర్.

ఊళ్ళోకి పేపరు వాళ్లెవరో వచ్చారనే విషయం పర్వతాలుకి తెలిసింది.

రెడ్డినాయుడు ఊళ్ళో లేకపోవటంతో తనే బయల్దేరాడు పర్వతాలు-రాజారావు ఇంటికి.

"ఏం రాత్తన్నారండి మా ఊరు గురించి మీ పేపర్లో?" అన్నాడు పర్వతాలు ప్రభాకర్‌ని ఉద్దేశించి.

రాజారావు ఇంటి అరుగుమీద నిలబడి కిటికీలోంచి . చూస్తూన్న పర్వతాలును చూసి ప్రభాకర్, రాజారావు బయటకు వచ్చారు.

"ఈయనెవరు?"

రాజారావునే అడిగాడు ప్రభాకర్.

"నా పేరు పర్వతాలు లెండి! ఈ ఊళ్ళో పాతీది పాత నెంబర్ని. మా యీదిలోకూ్కడా మీ రొచ్చారంట కదండి. ఈయాల్టికి ఉంటారాండీ! రాత్రికి సేదబడి మంతరగాడొత్తన్నాడండి"

"లేదండీ! వెళ్ళిపోవాలి. అసలు నేనీ పని మీద రాలేదిక్కడికి. రాజారావును చూసి పోదామని వచ్చాను. నాకు వేరే పన్లున్నాయి"

మర్యాదగానే చెప్పాడు ప్రభాకర్.

"అది కాదండీ! ఎలాగూ వచ్చారు కదండి! రాత్రికాగితే మా పెసిరెంటు గోరు కూడా వచ్చేత్తారండి... ఆర్ని కూడా కలిసెల్లుదురు గాని... రేపు పేపర్లో ఆయన పేరు రాయద్దాండి మరి"

రెడ్డినాయుడే ఊరికి పెద్ద అని పరోక్షంగా చెప్పటానికే పర్వతాలు వచ్చాడని ప్రభాకర్‌కి అర్థమయిపోయింది.

"ఆయనే మంత్రగాణ్ని తీసుకు రావటానికి వెళ్లారంటున్నారుకదా! అంటే ఊరి గురించి, ఊరివాళ్ళ గురించి రెడ్డి నాయుడు గారికి ఎంత శ్రద్ధ ఉందో వేరే చెప్పాలా? అయినా వీలునుబట్టి మళ్ళీ వస్తానెండి! అప్పుడు ఆయన్ని కూడా కలుస్తాను. ఇంక మేము లోపలికి వెళ్తాం! బట్టలు సర్దుకోవాలి..." అంటూ ప్రభాకర్ లోపలికి వెళ్లిపోయాడు.

పర్వతాలు ఉసూరుమంటూ అరుగు దిగి ఇంటిముఖం పట్టాక రాజారావు కూడా లోపలికి వెళ్ళాడు.

జానకి అప్పుడే స్కూలునించి ఇంటికి వచ్చింది.

"సూరయ్యని నేను వచ్చేవరకూ ఇంటిదగ్గర ఉండమని చెప్పు. ప్రభాకర్‌ని బండెక్కించి వచ్చేస్తాను" అని చెప్పి రాజారావు గూడెం వెళ్లటానికి సిద్ధమయ్యాడు.

ఇద్దరూ మెయిన్ రోడ్డు వరకూ నడుచుకుంటూనే వచ్చారు.

అక్కడ బస్సెక్కి గూడెం వెళ్లారు. ఫొటోలు తీసుకుని రైల్వేస్టేషనుకు వచ్చేసరికి బండికి ఇంకా అరగంట టైముంది.

"ఓ పని చేస్తే ఎలా ఉంటుంది?"

హఠాత్తుగా అన్నాడు ప్రభాకర్.

"ఏమిటి?"

"నాకు తెలిసున్న ఓ సైకియాట్రిస్ట్ ఉన్నాడు హైదరాబాదులో! ఆయనకి హిప్నాటిజం కూడా బాగా తెలుసు."

"అయితే...?"

"ఆయన్ని తీసుకువద్దాం ఇక్కడికి. మీ సత్తిరెడ్డి పాలేరు తమ్ముడు భీముడికీ,

కొట్టుసోమయ్య తండ్రి తాతబ్బాయికి ఆయనచేత ట్రీట్‌మెంట్ ఇప్పిద్దాం! వాళ్లిద్దరూ మనవాళ్ళే అన్నావుగా! వాళ్ల చెప్పినట్టు వింటారు కదా! రెండు కేసులు నయమయితే మిగతా వాళ్లు కూడా మెల్లిగా ఈ దోవలోకి వచ్చేందుకు అవ కాశం లేదంటావా?"

"కాని ఈ రాత్రికే రెడ్డినాయుడు మంత్రగాడిని తీసుకువస్తున్నాడు కదా! అందువల్ల మనం ఆ సైకియాట్రిస్టుని తీసుకురావటం వల్ల ఉపయోగం ఉంటుం దంటావా అని..."

"ఇదిగో! చూడు రాజూ! ఆ వచ్చే మంత్రగాడు గంటలోనో, రెండు గంట లోనో వ్యవహారం పూర్తిచేసి వెళ్లిపోడు. కనీసం పది రోజులైనా మీ ఊళ్లో మకాం వేస్తాడు. నానా హడావుడీ చేసి, బోల్డు తంతు నడిపితే గాని వాడు వెళ్ళడు. నాకు తెలుసున్నంత వరకూ ఇవన్నీ ఫోబియాలు. భయాలూ, భ్రాంతులే. కనుక సైకియాట్రిస్టు వల్ల కొంచమైనా గుణం కనిపిస్తుంది. ప్రజల్ని మూఢ నమ్మకాల్నించి తప్పించాలనే నీ లక్ష్యం నెరవేరటానికి అవకాశం దొరుకుతుంది."

"అయితే సరే! నువ్వు చెప్పిందీ బాగానే ఉంది. నువ్వు కూడా ఆయనతో వస్తే బావుంటుంది. కాని, నీకు సెలవు పెట్టటానికి కుదురుతుందో, కుదరదో.."

"ఆ విషయాలన్నీ నేను చూసుకుం టాను. రేపు పొద్దుటికి హైదరాబాదు చేరుకుంటాను నేను. మళ్ళీ రేపు రాత్రే బయలుదేరి ఎల్లుండికివచ్చేస్తాను.ఈలోగా. నువ్వు- సైకియాట్రిస్ట్ వస్తున్నట్టు సాధ్య మైనంత ఎక్కువ మందికి తెలిసే ఏర్పాటు చెయ్యి. అలా చేయటం వల్ల ప్రజలు మాంత్రికుడిని మరీగుడ్డిగా నమ్మేయ్యకుండా, ఆ వచ్చే ఆయన ఏం చేస్తాడో అని కూడా ఆలోచిస్తారు"

ప్రభాకర్ చెప్పిన మాటలు రాజా రావుకు నచ్చాయి. అలాగే చేస్తానని చెప్పాడు రాజారావు.

అరగంట ఆలస్యంగా గోదావరి వచ్చి, వెళ్ళింది.

డాక్టర్ కృష్ణమూర్తిని చూసి, ప్రభాకర్ రావటం గురించి ఆయనతో చెప్పి బస్టాండ్‌కు వచ్చాడు రాజారావు.



రెడ్డినాయుడు, మాంత్రికుడు, అతని అసిస్టెంటు బస్సులో హైదరాబాద్ నుంచి గూడెం వచ్చేసరికి ఉదయం ఏడయింది. అక్కడి నుంచి టాక్సీలో ముగ్గురూ ముదునూరు వచ్చారు. మంత్రగాడు, రెడ్డినాయుడుల రాకకోసమే ఎదురు చూస్తున్నట్టు - పర్వతాలు, మరికొందరు పెద్దలు వాళ్ళని సకల లాంఛనాలతోనూ 'విడిది'కి తీసుకు వెళ్ళారు.

రెడ్డినాయుడి ఇంట్లోనే మంత్రగాడికి బస ఏర్పాటయింది.

వెంటనే ఊళ్ళో చాటింపు వేయించాడు రెడ్డినాయుడు... ఆ రోజు సాయంత్రం స్కూలు దగ్గిర మంత్రగాడు తన శక్తుల్ని ప్రదర్శిస్తాడనీ, ఆ మర్నాటి నుంచీ చేతబడికి విరుగుడు పూజలు ప్రారంభిస్తాడనీ!

ఊళ్ళో మూడొంతుల మంది సాయంత్రం కాకుండానే స్కూలు దగ్గిర గుమిగూడారు. అనుకొన్న సమయానికి మంత్రగాడు, అతని శిష్యుడు స్కూలు దగ్గరకు వచ్చారు.

రెడ్డినాయుడే స్వయంగా వాళ్ళని వెంటబెట్టుకు వచ్చాడు.

నల్లని పంచె మోకాళ్ళ వరకూ గోచి పోసి కట్టుకున్నాడు మంత్రగాడు. ఎర్రని పట్టుకండువాను ఒళ్ళంతా కప్పుకున్నాడు. మూరెడు పొడవున్న జుట్టు విరబోసు కొన్నాడు. గంగ సిందూరాన్ని విభూదిలా పెట్టుకున్నాడు. మెళ్ళో పెద్ద సపోటా కాయలంత రుద్రాక్షలున్న మాలని వేసు కున్నాడు.

కుడి చేతిలో నల్లటి బెత్తం ఉంది.

ఎడమ చేతిలో ఉన్న చిన్న సంచీలో ఏం ఉందో ఎవరికీ తెలియదు.

శిష్యుడు తెల్ల పంచె కట్టుకు న్నాడు. పసుపుపచ్చని బనియను వేసుకున్నాడు. అతడు కూడా తలంటు కున్నట్టున్నాడు. జుట్టు చిందర వందరగా ఉంది.

శిష్యుని చేతిలో నల్లని పళ్లెం, పళ్లెం పైన ఎర్రని వస్త్రం, ఆ వస్త్రం మీద నల్లరేగడి మట్టితో చేసిన మనిషి బొమ్మలు, కుంకుమ, పసుపు, బొగ్గు పొడి, బియ్యపు పిండి విడివిడిగా ఉన్నాయి.

మాంత్రికుడు స్కూలు దగ్గరకు రాగానే అందరూ నిశ్శబ్దంగా ఉండి పోయారు.

శిష్యుడు గొంతు సవరించుకుని అక్కడ చేరిన జనంతో చెప్పసాగాడు.

"మా గురువుగారు ఒక నేపాల మాంత్రికుని దగ్గర ఈ విద్య నేర్చు కున్నారు. మానవకల్యాణానికే ఈ విద్యను గురువుగారు వినియోగిస్తారు. ఈ మధ్యే హైదరాబాద్ దగ్గర్లో ఉన్న పెద్ద మంగళారంలో ఊరు ఊరంతటికీ చేతబడి జరిగితే మా గురువుగారు ఇరవై రోజులు పూజలు చేసి ఆ ఊరి వాళ్ళందరిని రక్షిం చారు. ఈ ఊళ్ళో చేతబడి ఇంకా బాగా ముదరలేదు కనుక పది రోజులు పూజలు చేస్తే అందరికీ నయమయిపోతుంది"

గుక్కతిప్పుకోవటానికి ఓ క్షణంపాటు ఉపన్యాసాన్ని ఆపాడు శిష్యుడు.

"ఇన్నారా! పది రోజుల్లో అందరికీ నయవయిపోద్దంట"

"మనిసినిచూస్తే గట్టోడిలానే ఉన్నాడు"

"పూజలు ఎక్కడ సేతారంట? వొల్లకాట్లోనా? రెడ్డిగారింటికాడా?"

ఆ ఒక్క క్షణంలోనూ జనం చెవులు కొరుక్కోసాగారు.

శిష్యుడు మళ్లీ మొదలు పెట్టాడు...

"మీలో కొందరికి మా గురువుగారి శక్తిమీద నమ్మకం లేకపోవచ్చు. ఇంకా కొందరికి అనుమానం ఉండచ్చు. అందుకే మా గురువుగారు ఇప్పుడు ఓ ప్రయోగం చేసి చూపిస్తారు. ఎవరింట్లోనైనా భోషాణమో, పెద్ద పందిరి పట్టి మంచమో లేదా అలాంటి ఎక్కువ బరువున్న పెద్ద బల్లో ఇక్కడికి తీసుకువస్తే మా గురువు గారు ప్రయోగం మొదలుపెడతారు"

మళ్లీ జనంలో గుసగుసలు ప్రారంభ మయ్యాయి.

"ఎవరింటికాడ ఉంది?"

"భోషాణవంట"

"ఒరే! మీ ఇంటికాడ బల్లుంది కదంటరా!"

"అయ్‌బాబోయ్! మనకెందుకులేరా

బాబూ ఈ గొడవ! పెద్దోళ్ళున్నారు కదా! ఆళ్ళు, ఆళ్ళు చూసుకుంటారు..."

రెడ్డినాయుడు గబగబా సీతయ్యని, మరికొంతమందిని ఇంటికి పంపించాడు.

"బేగెల్లి మా ఇంటికాడ సావాన్ల గదిలో భోషాణంవుంది! పట్రండి"

"అయ్య" అంటూ సీతయ్య రెడ్డి నాయుడి ఇంటికి పరిగెత్తసాగాడు.

"ఒరే! సీతిగా! లోపల సావానం వుంటుంది! మెల్లంగా బయటడెయ్యండి! ఒరే నాగులూ! నువ్వుకూడా ఎల్లు! ఏంట్రా అలా సూత్తానిలబడ్డారు? ఎల్లండి! మా భోషాణం అలాంటిదిలాంటిదేంటి? మా ముత్తాతల కాలం నాటిది... ఎల్లండెల్లండి! ఎల్లి, దాన్ని జాగర్తగా మోసుకురండి"

రెడ్డినాయుడు సీతయ్యకి జాగ్రత్తలు చెబుతూ కనిపించిన వాళ్ళందరికీ పని పురమాయించాడు.

పర్వతాలు మరీ ఎక్కువగా హంగు చేయసాగాడు.

బెమ్మంతాత, డేవిడ్ గుంపులో ముందుగా నిలబడి ఉన్నారు.

పెద్ద అప్పన్న అయోమయంగా అందర్నీ చూస్తూ నిలబడ్డాడు.

సత్తిరెడ్డి, గోవిందయ్య అక్కడకి రాలేదు. రాజారావు ఇంటిదగ్గరే ఉన్నాడు. జానకి మరికొంతమందితోపాటు పక్క వాళ్ళడాబా ఎక్కి చోద్యంచూడసాగింది.



గుంపులో రెడ్డినాయుడు పక్కగా నిల బడి ఉన్న రాజేశ్వరి అస్పష్టంగా కని పిస్తోంది జానకికి.

మంత్రగాడు శిష్యుని చేతిలో ఉన్న పళ్ళాన్ని అందుకుని ఏవేవో మంత్రాలు లాంటివి చదవసాగాడు.

అదేంభాషో ఆ మంత్రాలు వింటున్న



వాళ్ళకు తెలియదు.

మధ్యమధ్యలో "హుం ...హ... ఫట్...ఫిక్..." అంటున్నాడు మంత్రగాడు.

తర్వాత స్కూలు పక్కగా ఉన్న చెరువు రేవులో సిమెంటు చప్టామీద చతికిలబడి కూర్చుని పద్మాసనం వేసుకున్నాడు

సంచీలోంచి నలుచదరంగా ఉన్న ఎర్రని వస్త్రాన్నొక దాన్ని తీశాడు.

దాన్ని చప్టామీద పరిచి నాలుగు మూలలా బరువుకోసం అన్నట్లు మట్టి బొమ్మలని పెట్టాడు.

నల్లని పళ్లెంలోని కుంకుమ, పసుపు, బియ్యపు పిండిలతో వస్త్రంమీద పిచ్చిపిచ్చిగా ముగ్గులు వేశాడు. బొగ్గుపొడితో ఏవో అక్షరాలు ముగ్గు పెట్టినట్లు పెట్టాడు.

మళ్లీ సంచిలోంచి సన్నని ఎముకలు నాలుగుతీసి వస్త్రంమీద డైమండ్ ఆకారంలో అమర్చాడు.

ఆ తరవాత పళ్లెంలో ఎర్రనివస్త్రం కింద ఉన్న నాలుగు నిమ్మకాయలను చెరువునీటిలో శుభ్రంగా కడిగి ఎముకల డైమండ్‌కు నాలుగు మూలలా వాటిని పెట్టాడు.

కాసేపు మళ్లీ మంత్రాలు చదివి బొగ్గు పొడితోనూ, మట్టితోనూ నిమ్మకాయలమీద పూజ చేశాడు.

చేతిలో ఉన్న నల్లని బెత్తంతో నేలమీద ఉన్న ఎర్రని వస్త్రం చుట్టూ నాలుగు వైపులా నాలుగుసార్లు దబదబా బాదాడు.

బెత్తానికి ఉన్న వెండి పొన్నుతో నాలుగుమూలలా ఉన్న మట్టిబొమ్మలని నెత్తిమీద కొట్టినట్లు ఒక్కొక్క దెబ్బ గట్టిగానే కొట్టాడు.

మొదటి బొమ్మను బెత్తం పొన్నుతో గట్టిగా కొట్టగానే 'ధన్'మని చప్పుడు అయింది.

అప్పటివరకు తదేకంగా ఆ మంత్రగాడు చేస్తున్న తతంగాన్ని నిశ్శబ్దంగా చూస్తున్న ప్రేక్షకులంతా చప్పుడు వినగానే ఒక్కసారి 'అమ్మో' అన్నారు.

అలా మిగిలిన మూడు బొమ్మలనూ కొట్టినప్పుడు 'ధన్ ధన్ ధన్' అంటూ పెద్ద శబ్దాలు అయ్యాయి.

అక్కడ చేరిన జనం ఊపిరి బిగబట్టుకొని మంత్రగాడినీ, అతని చర్యలనూ గమనిస్తున్నారు.

అతను తాగే ఉన్నాడో, పూనకంలోనే ఉన్నాడోకాని తెగ ఊగుతున్నాడు.

అలా ఊగుతుండటంతో పొడవాటి జుట్టు అతని ముఖంమీద పడుతోంది

ముఖంమీద పడుతున్న జుట్టును చేతోగాక, తలను పైకి విచిత్రంగా ఎగరేసి సరిచేసుకుంటున్నాడు మంత్రగాడు.

అంతలో సీతయ్య, నాగులు, మరో ఆరుగురు కలిసి రెడ్డినాయుడి భోషాణాన్ని మోసుకువచ్చారు.

అందరికి చెమటలు కారుతున్నాయి. ఆ భోషాణాన్ని మోయటానికి ఎనమండుగురు చాలలేదు. అయినా కష్టపడి దాన్ని మోసుకొచ్చారు.

మంత్రగాడు లేచి నిలబడ్డాడు.

శిష్యుడు గబగబా అతని దగ్గరకు వెళ్ళాడు.

"ఊ" అని హుంకరించి మంత్రగాడు భోషాణం దగ్గరకు వెళ్ళాడు.

ఓసారి భోషాణం చుట్టూ ప్రదక్షిణం చేసి మళ్లీ 'ఊ' అంటూ చేయిచాపాడు.

అప్పటికే శిష్యుడు నాలుగు నిమ్మకాయలను నల్ల పళ్ళెంలోని ఎర్ర వస్త్రం

మీద ఉంచి తీసుకువచ్చాడు.

మంత్రగాడు ఒక నిమ్మకాయమీద అరచేతిని ఆన్చి ఓ క్షణం ఉంచి తరువాత అలాగే ఆ నిమ్మకాయను గుప్పిటితో బిగించి పట్టుకుని భోషాణంమీద ఎడమ వైపున ఓ మూల పెట్టాడు.

మిగిలిన కాయలను కూడా అలాగే తలో మూలా పెట్టి సంచిలోంచి ఓ కత్తిని తీశాడు. ఆ కత్తి బాగా తుప్పుపట్టి ఉంది.

మళ్ళీ 'ఊఁ' అన్నాడు మంత్రగాడు.

శిష్యుడు గబగబా పరిగెత్తుతూ రెడ్డి నాయుడి దగ్గరకు వెళ్ళి ఆయన్ని భోషాణం దగ్గరకు తీసుకువచ్చాడు.

మంత్రగాడు కత్తిని రెడ్డినాయుడికి ఇచ్చాడు.

"మీ ఇష్టం వచ్చిన నిమ్మకాయను కోయండి ఈ కత్తితో"

శిష్యుడు రెడ్డినాయుడికి చెప్పాడు.

రెడ్డినాయుడు ఓసారి జనాన్నందరినీ కలియజూసి... "అబ్బే! నేనెందుకూ! ఈ ఊరికి పెద్దోడు మా బెమ్మంతాతున్నాడు.. ఆడు కోతాడులెండి ... ఒరే! తాతా! నువ్విటా" అన్నాడు.

కాని మంత్రగాడు "ఊఁ..." అంటూ గట్టిగా హూంకరించినట్లు మూలాడు.

"సరి...సరే...సర్లెండి" అంటూ కంగారుపడిపోతూ రెడ్డినాయుడు మంత్ర గాడు భోషాణంమీద మూడోసారిగా ఉంచిన కాయను అందుకుని గబగబా కోసేశాడు...

"రక్తం...రక్తం..."

"అయ్‌బాబోయ్! నిమ్మకాయలో రక్తమేంటి?"

"మరేటనుకున్నావ్! మంతరగాడంటే..."

భోషాణానికి దగ్గరగా ఉన్నవాళ్ళ వ్యాఖ్యానాలు విని మంత్రగాడు కళ్ళు మిటకరించి అందర్నీ ఓసారి మిర్రి మిర్రి చూశాడు.

శిష్యుడు అది గమనించి "హుష్! నిశ్శబ్దం" అని అరిచాడు.

ఓ నిమ్మచెక్కని ఎడమచేతిలో ఉంచుకొని మామూలుగా నిమ్మచెక్కను పిండినట్టుకాక గుప్పిటతో నువ్వుల నుంచి నూనె పిండినట్లు నిమ్మచెక్కను పిండాడు మంత్రగాడు.

బొటబొటా 'రక్తం' కారింది. ఆ రక్తాన్ని భోషాణంమీద రెండు అంచుల పొడవునా పోశాడు.

రెండో నిమ్మచెక్కని కూడా అలాగే ఎడమచేతి గుప్పిటలో ఉంచుకుని పిండి, ఆ 'రక్తా'న్ని మిగిలిన రెండు అంచుల మీద పోశాడు.

తరువాత రెండు నిమ్మకాయలను భోషాణానికి దిష్టి తీసి చెరువులోకి విసిరేశాడు.

మిగిలిన ఒక్క నిమ్మకాయను భోషాణం మధ్యగా ఉంచి చేతి బెతానికి ఉన్న పొన్ను కర్రతో నిమ్మకాయ మీద గట్టిగా కొట్టాడు.

చుట్టూఉన్న జనం చెవులు మూసుకున్నారు...మళ్ళీ శబ్దం అవుతుందేమోనని!

అంతక్రితం మట్టి బొమ్మలను అలా కొట్టినపుడు వచ్చిన శబ్దంవల్ల కలిగిన భయాన్ని వాళ్ళు ఇంకా మరిచిపోలేదు.

కాని...

నిమ్మకాయ పేలిపోలేదు.

మామూలుగా చితికిపోయింది.

అందులో ఇదివరకటి నిమ్మకాయలో

మాదిరిగా రక్తం కూడా లేదు. మామూలు గానే ఉంది.

తరువాత మంత్రగాడు అక్కడినుంచి రెడ్డినాయుడి ఇంటికి వెళ్లిపోయాడు ఒక్కడే!

అప్పుడు ప్రారంభమయింది అసలు తతంగం!

శిష్యుడు ఆ తరువాత వ్యవహారానికి ఆధ్వర్యం వహించాడు.

"మీలో కొంతమంది ఈ భోషాణాన్ని మోసుకొంటూ వెళ్ళండి. అసలు మీరు వెళ్ళక్కర్లేదు. దానంతట అదే కదలుతుంది. ఆ భోషాణం ఎక్కడికి వెళ్తుం దనేది నేను చెప్పటంకంటె మీరే తెలుసుకోవటం మంచిది"

కొంతమంది ఉత్సాహంగా ముందుకు వచ్చారు. పర్వతాలు, రెడ్డినాయుడు అందర్నీ సర్ది పదిమందిని ఆ భోషాణాన్ని మోయటానికి ఎంపిక చేశాడు. భోషాణాన్ని మోయటానికి సిద్ధపడినవాళ్ళ నందర్నీ నిమ్మకాయను కళ్ళకు అద్దుకో మన్నాడు శిష్యుడు.

ఆ పదిమందీ భోషాణాన్ని పైకి ఎత్తుతోంటే హఠాత్తుగా పెద్ద కంఠంతో "జై మహంకాళీ" అంటూ అరిచాడు శిష్యుడు.

అందరూ అతనికి వంతపాడారు!

కొన్ని వందలమంది 'అరిచిన మహంకాసి అనే మాట ముదునూరు గ్రామంలో మారుమోగింది!

భోషాణాన్ని భుజాల మీదకు ఎత్తుకున్నారు ఆ పదిమంది. భుజాలమీద రాపిడి కలగకుండా తువ్వాళ్లను చుట్టచుట్టి పెట్టుకున్నారు. అందరికంటె వెనకాల సీతయ్య, నాగులు మోయసాగారు.

ఎవరో తోస్తున్నట్లు ముందుకు కదిలింది భోషాణం.

"ఒహోయ్ ... ఒహోయ్"

"ఒహోయ్...ఒహోయ్..హోయ్. ఒహోయ్...ఒహోయ్"

భోషాణం చెరువుగట్టు రోడ్డు మీదుగా మెయిన్ రోడ్డువెపు కదిలింది.

"ఒహోయ్-ఒహోయ్-హోయ్...."

తూర్పుపేట వైపు వెళ్ళబోయి రాజారావు ఇంటి సందులోనికి తిరిగింది భోషాణం.

వెంట జనం వస్తూనే ఉన్నారు.

రణగొణ ధ్వని!

గొడవ!

హడావుడి!

"ఒరేయ్! ఇదేంట్రోయ్!"

"వార్నీయమ్మ ... ఇది ఇక్కడ ఆగిందేంట్రా!"

రాజారావు ఇంటిముందు ఆగిపోయింది భోషాణం.

అందరూ ఆశ్చర్యపోయారు.

శిష్యుడు ముందుకు వచ్చాడు.

"ఈ ఇంట్లో ఎవరికేనా చేతబడి జరిగిందా?", అని అడిగాడు జనాన్ని ఉద్దేశించి.

"లేదండీ! అబ్బే! అలాంటిదేం లేదే!"

జవాబు చెప్పాడు రెడ్డినాయుడు.

అంతలో పెద్దఅప్పన్నందుకున్నాడు-

"మావోడు ఇక్కడే గదా ఆ రోజున పడిపోయాడు. ఊళ్ళో మొదటొరస మా రావులిదేగదండి! ఈ ఊళ్ళో సేతబడి ఇక్కడినుంచే ప్రారంభమయింది లెక్క పెకారం"

పెద్ద అప్పన్న మాటలతో శిష్యుడు మనసు తేలిక పడ్డట్టు నిశ్వసించి "అందుకే మొదట ఈ భోషాణం

ఇక్కడ ఆగింది" అన్నాడు.

"ఒరే! అయితే, సేతబడి జరిగినోళ్లందరిళ్లకీ ఎల్తుందా ఇది"

"ఎంకన్న ఇంటికీ, జాన్‌గాడి గుడిసికీ, సీతాలు పాకకాడికీ... అందరిల్లకీ ఎల్తుందా?"

"సత్తిరెడ్డి పాలేరు నారాయుడుగాడు, కొట్టు సోమన్న, వెంకటేశం...అల్లందరూ సందాలియ్యలేదు కదా! మరి అల్లింటికూడా ఎల్తదా?"

అప్పటికప్పుడే చర్చలు ప్రారంభమయ్యాయి. మళ్లీ భోషాణం కదిలింది.

రాజారావు సందులోంచి వెనక్కి తిరిగి ముందుగా తూర్పుపేట వెళ్లి పెద్ద అప్పన్న ఇంటి దగ్గర ఆగింది.

సీతయ్య, నాగులు ఎప్పుడూ వెనకవైపే మోస్తున్నారు భోషాణాన్ని.

మావగారింటికి భోషాణం రాగానే నాగులు తప్పుకొని మరొకడిని మోయమన్నాడు.

రాములు భార్య పేరంటాలు భోషాణం ఇంటి దగ్గరకు రాగానే ఘొల్లుమంది.

రాములుకి అంత క్రితమే మళ్లీ స్పృహ పోవటంతో నేలమీద పడి కొట్టుకుంటున్నాడు.

అక్కడినుంచి భోషాణం ఊరంతా తిరిగింది.

భోషాణం తమ ఇంటిదగ్గర్నుంచి వెళ్ళిపోయాక జానకి డాబా దిగి ఇంట్లోకి వచ్చింది.

మంత్రించిన నిమ్మకాయ ఉన్న భోషాణం తమ ఇంటికి రావటం ఆమెకు భయాన్ని మరింత పెంచింది.

భయంగా వుందంటే అన్నయ్య తిడతాడేమోనని మౌనంగా ఉండిపోయింది.

రాజారావు మనసు సిమితంగా లేదు. అశాంతిగా అటూ ఇటూ పచార్లు చేయసాగాడు.

అప్పుడే చంద్రకళ రిక్షా దిగి ఇంట్లోకి రావటం చూసి రాజారావు, జానకి ఆశ్చర్యపోయారు. హఠాత్తుగా ఆమె ఎందుకు వచ్చిందో వాళ్ళకి అర్థం కాలేదు.




భోషాణం 'ప్రయోగం' ఊళ్ళో గొప్ప సంచలనం కలిగించింది.

చాలా మంది మంత్రగాడి మహిమ గురించే మాట్లాడుకోసాగారు.

ఆ భోషాణం – చేతబడికి గురయిన వారి ఇళ్ళకు ఎలా దోవ చూపించిందో వారెవరికీ అంతుపట్టలేదు.

"అంతా ఆ నిమ్మకాయలోనే ఉంది"

"నిమ్మకాయలో ఉండటమేంటి నీ మొకం! సెరువు గట్టున పూజ్చెయ్యలేదంట్రా! ఆయన పూజ్చెయ్యకపోతే నిమ్మకాయేం జేస్తది? అంతా ఆ పూజ మయిమే"

"నాల్రోజుల్నాడే ఈయన్నట్టుకొత్తే ఊల్లో ఇంత మందికి సేతబడి జరక్కపోను"

"పోన్లే! ఇంక భయం లేదు. గుండెలు పీసుపీసుమంటున్నాయ్ – ఎప్పుడో మన

క్కూడా సేతబడి జరిగిపోద్దని"

రెడ్డినాయుడి పలుకుబడి అమాంతం మరింత పెరిగిపోయింది.

అంతక్రితంవరకూ నాయుడి మీద ఉన్న దురభిప్రాయాన్ని కొంత మంది మార్చుకున్నారు కూడా.

మంత్రగాడి మహిమ వల్ల తనీసారి కూడా ఏమైనాసరే ఊరికి సర్పంచు నయిపోవటం ఖాయం అనుకున్నాడు రెడ్డినాయుడు. ఏళ్ళ తరబడి పదవి లేకుండా కూర్చున్నాడు రెడ్డినాయుడు.

ఊళ్ళో కొంత మంది పూర్తిగా మంత్రగాడి ప్రభావంలో పడలేదు.

వాళ్ళలో ఎక్కువ మంది రాజారావుని అభిమానించేవాళ్ళే!

సూరయ్య, నారాయుడు, ప్రకాశరావు పనిగట్టుకుని ఊళ్ళో బాగా ప్రచారం చేశారు.

"అయిద్రాబాదునుంచి పెద్ద డాట్రుగారొత్తన్నారంట! ఆయన సేతబడిని వొయిజ్జెంతో నయం సేత్తారంట"

"అయిద్రాబాదునుంచొచ్చే డాట్రుగారు కూడా మనూరొచ్చిన మంతరగాడు సేసే మాయలన్నీ సేయగల్రంట!"

"మంతరగాడు సేసే తతంగమంతా మోసవేనంట!"

"మన సత్తిరెడ్డిగారి పాలేరు లేడూ... నారాయుడు! అతని తమ్ముడు భీముడికీ, కొట్టు సోమయ్యవాళ్ల నాన్న తాత బ్బాయికీ, వెంకటేశానికీ వైద్యం చేయటానికి హైదరాబాద్ నుంచి గొప్ప డాక్టరును తీసుకొస్తున్నాం. వైద్యానికి తగ్గని రోగం ఏమీ లేదని మన డాక్టరు కృష్ణమూర్తిగారు చెప్పలా? ఊళ్ళో వాళ్ళందరూ చేతబడి అనుకుంటున్నారు కదా! చేతబడి అనేది భయానికి సంబంధించిన రోగమట! అందుకే మన రాజారావు హైదరాబాదు నుంచి డాక్టరుగార్ని తీసుకువస్తున్నాడు"

ప్రకాశరావు తండ్రి గోవిందయ్యకి ఊళ్ళో ఉన్న పలుకుబడి వల్ల ప్రకాశరావు మాటల మీద, రాజారావు మీద, సత్తిరెడ్డి మీద ఉన్న గౌరవం వల్ల సూరయ్య, నారాయుడి మాటల మీద కొంతమంది జనానికి గురికుదిరింది.

"సరే! ఆ డాట్రుగారు ఏం సేత్తారో కూడా సూద్దాం!అప్పుడే ఆలోసించచ్చు - ఏది నిజమో, ఏది అబద్ధమో!"

"మానింది మందు. సిట్కాలుపయోగించినా, మందులు వాడినా, మంతిరాలేసినా రోగం తగ్గటవేకదా పెదానం"

"డాట్రుగారొచ్చి ఎవరికేనా నయం సేత్తే, ఇట్టం వొచ్చినాళ్లు ఆయన్దగ్గిరే వొయిజ్జం చేయించుకోవచ్చు."

"ఇట్టం లేనాళ్లు మంతరగాడి దగ్గిరికే పోతారు!"

"ఆ డాట్రుగారు ఒయిజ్జెం సేత్తే డబ్బెవరిత్తారు?"

"అయన్నీ మనకెందుకు? రాజారావే సూసుకుంటాడు"

"ఆల్లు డబ్బులు తీసుకోరంట! మన కేసీనోళ్లు అప్పుడప్పుడు పిల్లలకి పోలీయో ఊరికే ఇవ్వర్రంట్రా! అలాంటోళ్ళ సంగానికి సెందిన డాట్రారయి ఉంటారాయన"

వాళ్ళ ప్రచారంతో ఊరంతా ఇంచుమించు రెండుగా చీలిపోయినట్లయింది.

అయితే, రాజారావుని అభిమానించే వాళ్ళూ, అతని మాటకి విలువ నిచ్చేవాళ్ళూ మంత్రగాడి ద్వారానే తమవారి పరిస్థితిని మెరుగు పరుచుకోవాలనుకోవటానికి

కారణం – కేవలం భయం, నమ్మకం మాత్రమే!

* * *

"చేతబడి గూడెంలో మా ఇంటిదాకా కూడా వచ్చింది" అంది చంద్రకళ.

"ఆఁ" అంటూ కళ్లూ, నోరూ వెళ్ళబెట్టింది జానకి.

రాజేశ్వరి చెప్పిన మాటలన్నీ ఓసారి మళ్లా జ్ఞాపకం వచ్చాయి ఆమెకి!

ఊళ్ళోవాళ్ళందరి పరిస్థితీ కూడా ఆమె మనస్సులో మెదిలింది.

జానకి కళ్ళలో చేతబడిపట్ల గల భయం కొట్టొచ్చినట్టు కనిపించింది.

"ఇంతకీ ఏమయిందో సరిగ్గా చెప్పు"

రాజారావు విసుగుతో కూడిన ఆతృతతో అడిగాడు చంద్రకళని!

"రెండు రోజుల నుంచి పనిమనిషి రావటం లేదు. పొద్దున్నే లేచి నేనే ఇల్లూ, వాకిళ్లూ తుడిచి ముగ్గులు పెడుతున్నాను. ఇవాళ పొద్దున్న చీపురు పట్టుకుని వీధి గుమ్మంలోకి వచ్చేసరికి నాకు మతిపోయినంత పనయింది"

కళ్లు ఇంతింత చేసుకొని వింటున్న జానకి కంగారుగా "ఏవయిందేవయింది" అని అడిగింది.

"సరిగ్గా నేను రోజూ ముగ్గులేసే చోట ఆ ముగ్గు తుడిచేసి ఉంది. అదే చోట్లో పసుపు, కుంకం, బొగ్గుపొడి, బియ్యం పిండి ముగులు కనిపించాయి. ఆ ముగ్గుల మధ్యలో బొగ్గుముక్కలు, పిండితోచేసినఆడబొమ్మ ఉండచుట్టి ఉన్న వెంట్రుకలు ఉన్నాయి. ఆ వెంట్రుకలు నా తల వెంట్రుకల మాదిరిగానే ఉన్నాయి. నేను రోజూ పొద్దున తల దువ్వుకున్నాక రాలిపడే వెంట్రుకల్ని ఉండచుట్టి గోడ అవతల రోడ్డుమీద వేస్తాను"

చంద్రకళ మాటల్ని జాగ్రత్తగా వింటున్న రాజారావు. "దుర్గయ్యగారికీ, ఆయన భార్యకీ ఈ విషయం చెప్పావా?" అని అడిగాడు.

"లేదు. వాళ్లు భయపడతారని చెప్పలేదు. జాగ్రత్తగా ఆ ముగ్గుల్ని వీధి వరకూ తుడిచేశాను. బొమ్మనీ, జుట్టు ఉండనీ నేను ముట్టుకోలేదు. చేతబడి మీద, దెయ్యాలు, భూతాల మీద ఎంత నమ్మకం లేకపోయినా భయం వేసింది" అంది చంద్రకళ.

"పోన్లే దుర్గయ్యగారికి చెప్పకుండా మంచి పనిచేశావ్" అన్నాడు రాజారావు ఏదో ఆలోచిస్తూ.

"అదికాదు వదినా! ఆ ముగ్గులూ అవీ చూడగానే నీకు భయం వెయ్యలేదా? అదే నేనైతే వెంటనే మూర్ఛపోయేదాన్ని" అంది జానకి.

"ఏడిశావ్‌లే! ఎందుకు భయం? అంత మాత్రానికేనా? అలా అయితే, ఆదమరుపుగా ఉంటే నీ నీడను చూసే నువ్వు భయపడి నానాగందరగోళం చేసేలా ఉన్నావే"

జానకికి నచ్చజెప్పటానికి ప్రయత్నించింది చంద్రకళ

అప్పుడప్పుడు రాజారావు చెప్పే మాటలు, కబుర్లు – జానకి మీద కంటే చంద్రకళ మీదే ఎక్కువ ప్రభావం చూపించాయి. ఆ ఇద్దరికీ వయసులో నాలుగేళ్లు తేడా. రాజారావు చదివిన అనేక పుస్తకాలు చంద్రకళ కూడా చదివింది. హేతువాదులు నిప్పుల మీద నడవటం లాంటి సంఘటనలు చాలా మాసిందామె. మొత్తం మీద చంద్రకళకి



మంత్రగాడు పూజలు ప్రారంభిస్తాడని ఊళ్ళో ప్రజలకు టముకువేయించాడు రెడ్డి నాయుడు.

వాళ్ళ ద్వారా, వీళ్ల ద్వారా ముదునూర్లో చాలా మందికి చేతబడి జరిగిందనే వార్త గూడెంలో కూడా బాగా పాక్కిపోయింది.

మరికొన్ని పేపర్లకు సంబంధించిన విలేకరులు కూడా ముదునూరు వచ్చి వివరాలు సేకరించుకుపోయారు.

వారంతా రెడ్డినాయుడితోపాటు రాజారావును కూడా కలుసుకున్నారు.

ప్రజల్లో కొందరు - మంత్రగాడి భోషాణం మహిమ గురించి చెప్పారు.

ఇంకొందరు-'అయిద్రాబాదు' నుంచి రాబోతున్న 'పెద్ద డాక్టరుగారి' గురించి చెప్పారు.

విలేకరులు ఆ ఊళ్ళో ఉన్నపుడే మరో సంఘటన జరిగింది!

పెద్ద గరువు మీద ఉంటున్న మరియమ్మ మూడు నెలల పసిపిల్లాడికి రెండు రోజుల నుంచి పాలు ఇవ్వటం మానేసింది.

కారణం అడిగితే "ఏంలేదు" అనేది.

మొగుడు, అత్తగారు మరియమ్మని బతిమాలేరు - పిల్లాడికి పాలు ఇమ్మని! "సచ్చినా ఇవ్వను" అంది మరియమ్మ.

పిల్లాడు పాల కోసం గుక్కపెట్టి ఏడుస్తున్నా "వాడు నా కొడుకు కాదు" అన్నట్లు నిర్లక్ష్యంగా చూడసాగింది.

ఆ రోజున చుట్టుపక్కలవాళ్లు కూడా నిలబడి గట్టిగా అడిగితే "నాకు పాలు

కూడా దెవుళ్లు, దెయ్యాలు, క్షుద్రశక్తుల పట్ల నమ్మకం పోయింది.

* * *

మర్నాడు రాత్రి నుంచీ శ్మశానంలో

రాటం లేదు. నిన్నరేత్రి ఒకాయన కల్లో కనిపించి నీ కొడుక్కి పాలియ్యద్దని సెప్పాడు...ఇత్తేనేను సచ్చిపోతానంట" అంది మరియమ్మ.

"ఎవడాడు? నాకొడుకుని సంపేత్తాను" అంటూ రెచ్చిపోయాడు మరియమ్మ మొగుడు. భార్యకి నాలుగు తగల్నిచ్చి "ఈడికి పాలియ్! నీయమ్మ... పేణాల్తీసేత్తాను" అంటూ బెదిరించాడు కూడా.

మరియమ్మ కిమ్మనలేదు. తనకసలు దెబ్బలే తగల్లేదన్నట్లు స్తబ్దురాల్లా కూర్చుండిపోయింది.

విలేకరులు ఆమెను కూడా చూసి వచ్చారు. వివరాలు రాసుకొని వెళ్లిపోయారు.

ముదునూరులో చేతబడి భయం పెరిగిపోయినట్లు గూడెంలో పోలీసులకు కూడా తెలిసింది.

మంత్రగాడు వచ్చినట్లు, అతనేదో శక్తులు ప్రదర్శించినట్లూ వాళ్ల దృష్టికి వచ్చింది.

సబ్ఇన్స్పెక్టరూ, నలుగురు కానిస్టేబుళ్లు ఊరికి వచ్చారు. ఓసారి ఊరంతా కలియతిరిగి వెళ్లిపోయారు.

ఎలాంటి గొడవలూ జరగకుండా ముందు జాగ్రత్త కోసం రోజూ ఇద్దరు కానిస్టేబుళ్లు ఊళ్ళో ఉండేలా ఏర్పాటు చేస్తానని చెప్పాడు సబ్ఇన్స్పెక్టరు.

కానిస్టేబుళ్ళకి పంచాయితీ ఆఫీసు గదిలో బస ఏర్పాటు చేయించాడు సత్తిరెడ్డి-రెడ్డినాయుడిని ఒప్పించి!

నాగులు, సీతయ్య మంత్రగాడి రాకతో చాలా హడావుడిగా ఉన్నారు. అతనికీ, శిష్యునికి కావలసినవన్నీ సమకూర్చే పనిని వాళ్ళకి అప్పగించాడు రెడ్డినాయుడు.

పూజకోసం మంత్రగాడికి రోజూ పొద్దున, సాయంత్రం రెండేసి ముంతల కల్లు, రాత్రివేళ ఓ కోడి కావాలిట!

కల్లు తాజాగా ఉండాలిట!

కోడి గొడ్డుదై ఉండాలిట!

అలాంటి కోళ్ళను సంపాయించటానికి చుట్టుపక్కల ఊళ్ళకి మనుషుల్ని పంపాడు రెడ్డినాయుడు.

* * *

మర్నాడు పొద్దున్నే చంద్రకళ గూడెం వెళ్లిపోయింది. అనవసరంగా భయపడవద్దని ధైర్యం చెప్పాడు రాజారావు.

డాక్టరు కృష్ణమూర్తి ఎలా ఉన్నాడో చూసి వెళ్ళమనీ, అవసరమైతే తనకు కబురు చెయ్యమనీ కూడా చంద్రకళకు చెప్పాడు.

ఆమె వెళ్లిన గంటకి రిపోర్టర్ ప్రభాకర్ సైకియాట్రిస్టుతోసహా ఊళ్ళో దిగాడు.

అదేరోజున 'ఈనాడు'లో వార్త వచ్చింది... ముదునూరులో చేతబడి గురించి!

ఆ వార్తను ఎవరిచేతో చదివించుకుని విని మండిపడ్డాడు రెడ్డినాయుడు.

డాక్టర్ కృష్ణమూర్తికి జరిగిన ప్రమాదం వెనుక ఏదో గూడుపుఠాణీ ఉందని ఊళ్ళోవాళ్లు అనుకొంటున్నట్లు వార్తలో ఉంది.

రాజారావే అలా రాయించాడని రెడ్డినాయుడి ఉద్దేశం.

ప్రభాకర్ని ఊళ్లోవాళ్లు గుర్తుపట్టారు. అతనితో కూడా వచ్చిన వ్యక్తే 'పెద్ద డాక్టు' అని వాళ్ళకి అర్థమయింది.

పరిచయాలు అయిన తరవాత

సైకియాట్రిస్ట్ ప్రొఫెసర్ అభిరామ్‌ను ముందుగా నారాయుడింటికి తీసుకువెళ్ళాడు రాజారావు. తరువాత – తాతబ్బాయినీ, వెంకటేశాన్నీ చూశాడు అభిరామ్.

మిగతావాళ్ళ గురించి రాజారావు, ప్రభాకర్‌తో పాటు ఊళ్ళో మరికొంత మంది కూడా చెప్పగా విన్నాడు అభిరామ్.

పరిస్థితిని అర్థం చేసుకున్నాడు.

మంత్రగాడు చేసిన 'భోషాణం ప్రయోగం'లోని రహస్యంలాంటి అనేక రహస్యాలు అభిరామ్‌కు తెలుసు.

"నేను రేపటినుంచి మనవాళ్ళకి ట్రీట్ మెంట్ మొదలు పెడతాను. సాయంత్రం ఊళ్లో మీటింగ్ లాంటిది ఏర్పాటుచేయండి. అందువల్ల ఊరివాళ్ల దృక్పథంలో కొంచెం మార్పు వస్తుందని నా నమ్మకం" అన్నాడు ప్రొఫెసర్ అభిరామ్.

పెంటపాడునుంచి మైకు తెప్పించి... రిక్షాలో ఊరంతా తిప్పించి, సాయంత్రం ఆసుపత్రిదగ్గరజరిగే మీటింగులో హైదరాబాదునుంచి వచ్చిన డాక్టరుగారు మాట్లాడతారు కనుక అందరూ రావల్సిందిగా కోరుతూ మైకులో చెప్పించాడు రాజారావు.

ఆ బాధ్యత ప్రకాశరావుది. దాదాపు నాలుగు గంటలపాటు ఊళ్ళో తిరిగి ప్రచారం చేశాడు ప్రకాశరావు. తరువాత ఆసుపత్రి బయట అరుగుమీద మైకు అమర్చటం లాంటి ఏర్పాట్లన్నీ అతనే చూసుకున్నాడు.

రెడ్డినాయుడికి మనసు ఉడికిపోసాగింది. మీటింగు ఆపించమని రాజారావుకి పర్వతాలు ద్వారా కబురు పెట్టాడు రెడ్డి నాయుడు.

"ఊళ్లో మీటింగెట్టటానికిల్లేదంటన్నారు నాయిడుగోరు" అన్నాడు పర్వతాలు.

రాజారావు కంటె ముందు ప్రకాశరావే పర్వతాలుకి సమాధానం చెప్పాడు–

"ఆయనెవడూ వీల్లేదనటానికి! మీరు మంత్రగాడిచేత సర్కస్ ఫీట్లు, మేజిక్కులూ చేయించటం తప్పులేదుకాని మేము మీటింగ్ పెడితే తప్పొచ్చిందా?" అని.

"ఊళ్ళో అందరూ ఒప్పుకున్నారు మంతరగాడిని పిలవటానికి .... అందుకే ఆర్ని పిలిపించాం"

"సైకియాట్రిస్టుని తీసుకురావటానికీ చాలామంది ఒప్పుకున్నారు"

"కిట్టమూర్తి డాక్టరు సేసిన వొయిజ్జెం చాల్లేదా! మల్లీ ఈయన్నట్టుకొచ్చారు?"

"మీవాళ్ళకోసం ఆ తాగుబోతు మంత్రగాడిచేత పూజలు చేయించుకోండి! మావాళ్ళకోసం ఈ హైదరాబాద్ డాక్టరు చేత వైద్యం చేయించుకుంటాం"

"సర్లెండి! అదీ సూత్తాం... ఏవన్నా తేడా పాడాలు జరగాల...దీనెమ్మ... తల్లులేసిపోతాయ్"

"అలాగే! ఇక్కడెవరూ గాజులు తొడిగించుకొని కూర్చోలేదుగాని నువ్వెళ్లు"

పర్వతాలు ధుమధుమలాడుతూ వెళ్లిపోయాడు.

ఆ గొడవవల్ల ప్రభాకర్, అభిరామ్ కొంచెం కంగారుపడ్డారు.

"చూడబోతోంటే అనవసరంగా కొట్లాటలు జరిగేలా ఉన్నాయ్" అన్నాడు ప్రభాకర్.

"ఎందుకేనా మంచిది. మన ప్రయత్నాన్ని విత్‌డ్రా చేసుకుందామా?" అని అడిగాడు అభిరామ్.

రాజారావు వాళ్లిద్దరికీ ధైర్యంచెప్పాడు.

సత్తిరెడ్డి, గోవిందయ్య, ఊళ్ళో మరి

కొందరు పెద్దలు కూడా వాళ్ళకి నచ్చ చెప్పారు – "మీరేం భయపడకండి. మేమంతా ఉన్నాంకదా" అని!

కొంచెం విశాలంగానూ, సౌకర్యంగానూ ఉంటుందనే ఉద్దేశంతో అభిరామ్‌కూ, ప్రభాకర్‌కూ సత్తిరెడ్డి ఇంట్లో బస ఏర్పాటు చేశాడు రాజారావు.

నారాయుడు క్షణాలమీద అభిరామ్‌కూ, ప్రభాకర్‌కూ కావలసినవి సమకూర్చ సాగాడు.

తన తమ్ముడి ఆరోగ్యం త్వరగా బాగుపడాలని నారాయుడి తాపత్రయం.

యధాప్రకారం మీటింగు ప్రారంభ మయింది.

ఊరికీ, ఆసుపత్రికీ మధ్యలో, రెండు ఫర్లాంగుల దూరం ఉన్నా చాలామంది మీటింగుకు వచ్చారు.

సూటూ బూటూ వేసుకుని అభిరామ్ మీటింగుకు వచ్చాడు.

రాజారావు ముందుగా అభిరామ్‌ని ప్రజలకు పరిచయం చేశాడు.

"ఈయన పేరు అభిరామ్. మానసిక వైద్యుడు. మనూళ్ళో రాములుకీ, వెంకన్నకీ, భీముడికీ, ఇంకా చాలా మందికి చేతబడి జరిగిందని పెద్దలంతా నిర్ణయించి మాంత్రికుణ్ణి తీసుకువచ్చి పూజలు చేయిస్తున్నారు. అసలు చేతబడి అంటే ఏమిటి? కేవలం మన భయాలు, నమ్మకాలే చేతబడి రూపంలో బయటపడతాయి. మనం మనస్సు చెదరటం అంటామే...అలాంటిదే చేతబడి కూడా! చెదిరిపోయిన మనస్సుని మళ్ళీ మామూలుగా చెయ్యచ్చు. అందుకు పూజలు చేయటంవల్లా, బలులు ఇవ్వటం వల్లా ఉపయోగం ఉండదు. వైద్యం చేయించాలి. ఒక్కో రకం భయానికి ఒక్కో రకంగా వైద్యం చేయిస్తే ఆ భయం మాయమవుతుంది. అలాంటి వైద్యం చేయటంలో ప్రొఫెసర్ అభిరామ్‌గారికి పదిహేనేళ్ళ అనుభవం ఉంది. రేపటినుంచి భీముడికీ, తాతబ్బాయికీ, వెంకటేశానికీ ఈయన వైద్యం ప్రారంభిస్తారు. ఇప్పుడు చేతబడి గురించీ, ఇలాంటి మూఢనమ్మకాల గురించీ ప్రొఫెసర్ అభిరామ్‌గారు మాట్లాడతారు"

రాజారావు పక్కకువచ్చి జనంలో నిలబడ్డాడు. అతని పక్కగానే జానకి కూడా ఉంది. ప్రభాకర్ అటూ ఇటూ తిరుగుతూ ప్రజల అభిప్రాయాలనూ, అనుభూతులనూ సేకరించసాగాడు.

"సోదర సోదరీమణులారా! నేను వృత్తిరీత్యా మానసిక వైద్యం చేస్తాను. అభిమానంకొద్దీ హిప్నాటిజం విద్యను బ్రిటన్లో నేర్చుకొని హిప్నాటిస్టు నయ్యాను. హిప్నాటిజాన్నే సాధారణంగా వశీకరణ విద్య అంటారు. ఎదుటివాడిని వశం చేసుకొని వాడిని మానసికంగా మన అదుపు ఆజ్ఞల్లో పెట్టుకోవటాన్ని హిప్నాటిజం అంటారు. నిజానికి హిప్నాటిజానికీ మీరు అందరూ నమ్ముతున్న చేతబడికీ, దగ్గర సంబంధం ఉంది. ఒక మనిషికున్న భయాల్నీ, బలహీనతలనీ, నమ్మకాలనీ ఆధారం చేసుకొని హిప్నాటిజం ద్వారా అతడి చేత ఏ పనైనా చేయించవచ్చు. సరిగ్గా చేతబడిలో కూడా అలాగే జరుగుతుంది.

ఒక వ్యక్తి చేతబడికి గురయ్యాడూ అంటే ఆ సంఘటన వెనకాల చాలా తతంగం నడిచిందన్న మాటే! ఉదాహరణకి మరియమ్మనే తీసుకుందాం! ఆమె రెండు రోజుల్నించీ పిల్లాడికి పాలు ఇవ్వటం లేదు. ఆ విషయం మీకు అందరికీ తెలుసు. ఎందుకు ఇవ్వటం లేదని

అడిగితే కలలో ఎవరో కనిపించారనీ, పిల్లాడికి పాలు ఇస్తే నువ్వు చచ్చిపోతా వని ఎవరో చెప్పారనీ మరియమ్మ చెప్పింది. పాలు ఇవ్వకపోవటం వరకూ మాత్రమే ఆమె ప్రవర్తన మనకు విచిత్రంగా కనిపిస్తోంది. కాని మామూలు గానే మాట్లాడుతోంది. రోజూ పొద్దున్నే అందరి మాదిరిగానే మొహం కడుక్కుం టోంది. స్నానం చేస్తోంది. కాఫీ తాగు తోంది భోజనం చేస్తోంది! కాని పిల్లాడికి పాలు మాత్రం ఇవ్వటం లేదు.

నా ఉద్దేశం ప్రకారం అందుకు కారణాలు రెండున్నాయి. ఆమె రోజూ రేడియో వింటుంది. ఏదో కార్యక్రమంలో సౌందర్యపోషణకు సంబధించిన ప్రసంగం విని ఉంటుంది. ఆ సందర్భంగా ఆ ప్రసంగం చేసినవారు–

'కొంతమంది స్త్రీలు పిల్లలకు పాలు ఇస్తే తమ అవయవాల బిగి తగ్గిపోతుందని భావిస్తారు. ఇలాంటి అభిప్రాయం చదువుకున్న స్త్రీలలో కూడా ఉంది. విదేశాలలో అయితే పిల్లలకు పాలు ఇవ్వటానికి ఆయాలు లాంటి వాళ్ళని డబ్బు ఇచ్చి కుదుర్చుకుంటారు. కాని ఆ అభిప్రాయం చాలా తప్పు' అంటూ చెప్పి ఉంటారు. కాని ఆ అభిప్రాయం తప్పు అనే మాటకంటె, పిల్లలకి పాలు ఇస్తే సౌందర్యం తగ్గిపోతుందనే మాటే మరి యమ్మను బాగా ఆకర్షించి ఉంటుంది.

ఆ అభిప్రాయం ఆమె మనస్సులో నాటుకుపోవటంతోపాటు, ఊళ్ళో ఇంత మందికి ఇలా జరగటంతో ఆమెలో భయం ప్రవేశించింది. క్షణక్షణం చేతబడి గురించే ఆలోచించటం,తనకు కూడా అలా జరుగు తుందేమోనని అకారణంగా అనుమా నించటం వల్ల రాత్రిళ్ళు రోజూ అలాంటి కలలే వచ్చి ఉంటాయి.

మనం పియటకు చెప్పుకోలేని అభి ప్రాయాలు, ఉద్దేశాలు కలలుగా మనకు కనిపిస్తాయి. ఒక్కోసారి అవే నిజ మని మనం నమ్ముతాం కూడా! అలాగే మరియమ్మకు ఓ కల వచ్చింది. చేతబడి అనగానే మాంత్రికులు గుర్తుకు రావటం సహజం! ఆమె కలలో మాంత్రికుడు కనపడి ఉంటాడు. పిల్లలకు పాలిస్తే బింకం తగ్గిపోతుందనే అనుమానం ఆమెకు ఎలాగూ ఉంది. ఆ మాట మాంత్రికుడే చెప్పినట్టు అనుభూతి కలి గింది. ఇంకేం! ఆ ఫలితం ఎలా ఉంటుందో మీరు చూశారు కదా!

ఈ మరియమ్మ ప్రవర్తనకు కేవలం భయం తప్ప మరేమీ కారణం కాదు. పోతే, బాలింతరాలు పిల్లలకు పాలు ఇవ్వక పోవటం ఆమెకే నష్టం! మనకు సమయా నికి ఆకలి ఎలా అవుతోందో, నిద్ర ఎలా వస్తోందో అలాగే బాలింతరాళ్ళకు పాలు పడుతూ ఉంటాయి. నిద్ర వచ్చినపుడు నిద్రపోకపోతే మనకి ఎంత చిరాగ్గా పిచ్చిపట్టినట్లు అనిపిస్తుందో బాలింతరాళ్లు పిల్లలకు పాలు ఇవ్వకపోయినా వాళ్లకి అలాగే అనిపిస్తుంది. భయంవల్ల కాని వ్వండి, ఎవరేనా బలవంతం చేయటం వల్ల కానివ్వండి–బాలింతరాళ్ళు పిల్లలకు పాలు ఇవ్వని పక్షంలో ఛాతీ అంతా బరువెక్కినట్లు అనిపిస్తుంది. గంటల తర బడి మూత్రం విసర్జించక పోతే ఎలా ఉంటుందో వాళ్ళకి అప్పుడు కూడా అలాగే అనిపిస్తుంది.

మీకు అభ్యంతరం లేకపోతే మరియ మ్మకు మీ అందరి ముందూ మీరనుకుం టున్న చేతబడిని తగ్గిస్తాను. అయితే,

అందరూ నాకు సహకరించాల. అందరూ నిశ్శబ్దంగా ఉండాలి. ఏమ్మాత్రం చప్పుడు, గొడవ చెయ్యకూడదు"

ప్రొఫెసర్ అభిరామ్ ఉపన్యాసం ఆపేసరికి సభ పూర్తిగా నిశ్శబ్దంగా ఉంది. అంతలోనే గుసగుసలు ప్రారంభ మయ్యాయి.

"సేతబడంటే మంతరాలే కదంట్రా! పూజెలు సెయ్యకుండానే నయం సేత్తా సంటాదేంటియన"

"నిజంగానే నయం సేత్తాడంటావా?"

"మరియమ్మకి అసలు సేతబడి జరిగిందంటావా?"

"అందులో అనుమానవక్కర్లేదు. నాగరత్నం బట్టలిప్పకొని తిరగటం లేదంట్రా? ఇదీ అంతే!"

రాజారావు ముందుగానే మరియమ్మ భర్తని ఒప్పించి ఉంచాడు.

ఎల్లాగో అల్లా భార్యకు నయమైతే అదే పదివేలనుకొని అతను 'సరే' అన్నాడు.

ఆసుపత్రికీ, పెద్దగరువుకీ మధ్యలో రోడ్డే అడ్డు!

మరియమ్మని బలవంతంగానే ఆసుపత్రి అరుగుమీదకు తీసుకు వచ్చారు.

గాలిహోరుకు మైకు 'గుయ్' అంటుందేమోనని మైకును తీయించేశాడు అభిరామ్.

అందరూ చెప్పలేనంత ఉత్కంఠతో మరియమ్మ వైపు, అభిరామ్ వైపు చూస్తున్నారు.

దగ్గరగా ఉన్నవారికి మాత్రమే వారి మాటలు వినిపిస్తున్నాయి.

"ఏం మరియమ్మా! బావున్నావా?"

ఆమె మాట్లాడలేదు.

"నీ పేరు మరియమ్మ కాదా? నన్ను క్షమించండి! పొరపాటుపడ్డాను. నాచిన్నప్పుడు మా ఇంటి పక్కన మరియమ్మ అని ఓ అమ్మాయి ఉండేది. ఆవిడ కూడా అచ్చం మీ మాదిరిగానే ఉండేది. ఆవిడే మీరనుకున్నాను. పొరపాటయిపోయింది... ఏమీ అనుకోకండేం!"

మరియమ్మ అభిరామ్‌ని ఎగాదిగా చూసింది.

"నాపేరు మరియమ్మే. కాని మీరెవరో గేపకం లేదు" అంది మరియమ్మ.

"నిన్న రాత్రి నాకో కల వచ్చింది. ఆ కలలో...మరియమ్మ నేనూ కలిసి పెద్ద పెద్ద రాజులుండే అంతఃపురం లాంటి బిల్డింగులో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నాం. అంతలో ఉన్నట్టుండి మరియమ్మ పెద్ద కేక పెట్టి స్పృహ తప్పిపోయింది. నేను చల్లని నీళ్ళు ఆమె ముఖం మీద చల్లాను. కొంత సేపటికి మరియమ్మకు స్పృహ వచ్చింది. కాని నన్ను గుర్తుపట్టలేదు. పైగా 'ఎవరు నువ్వు' అని కూడా అడిగింది. ఆ తర వాతనుంచీ మరియమ్మ పచ్చి మంచినీళ్ళు తాగలేదు...! ఏ పని చేయకుండా పిచ్చి పట్టినదానిలా కూర్చుంది. ఆమె పరిస్థితి చూసి నాకు భయం వేసింది. ఆ భయంతో నాకు వళ్ళు చెమటలు పట్టేశాయి. అంతలో నాకు మెలకువ వచ్చింది. ఓస్ కలే కదా అనుకొని స్థిమితపడ్డాను"

అభిరామ్ చెప్పే మాటల్ని మరియమ్మ చాలా శ్రద్ధగా-వింది.

"నాకూ కలొచ్చింది. కల్లో ఒకాయన కనిపించి అయేంటో మయిమలు సూపించాడు. కాలీ సేతుల్లోంచి ఒకదానెంట ఒకటి రూపాయి బిల్లలు సుష్టించాడు. ఆ తరోత నేను సాలా అందంగా ఉన్నానన్నాడు. ఎంత వయసొచ్చినా

ఇలాగే అందంగా ఉండిపోవాలంటే మా యబ్బాయికి పాలియ్యొద్దన్నాడు. ఇత్తే నేను సచ్చిపోతానన్నాడు"

మరియమ్మ క్రమక్రమంగా తన మాటల ప్రభావంలో పడుతోందని గ్రహించాడు అభిరామ్.

"ఛఛ! నేను అలా అన్లేదే!"

ఆశ్చర్యంగా అడిగాడు అభిరామ్.

"నువ్వుండవేంటి? నువ్వేనా నాకల్లో కనిపించింది"

మరియమ్మ మరింత ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవి చేసింది.

"అవును. నేనే నీకు కలలో కనిపించాను. నేనే ఆ మంత్రగాణ్ని"

"నాకల్లో కనిపించినాయనకి పెద్ద పెద్ద మీసాలున్నాయి. మరి నీకు లేవేం?"

ఒక్క నిముషం అప్రతిభుడయ్యాడు అభిరామ్. వెంటనే తేరుకుని..."నీకు కల వచ్చింది రాత్రికదా...చీకట్లో సరిగా కనిపించిఉండదు. నీకు నేను కల్లో కనిపించినప్పుడు కూడా సన్నని మీసాలే ఉన్నాయి" అన్నాడు అభిరామ్ ఆమెకు సర్దిచెబుతూ.

"మరయితే నువ్వు కాలీ సేతుల్లోంచి రూపాయి బిల్లలు రప్పియ్యి సూద్దారి"

"ఓ! అలాగే! నువ్వు అలా ఈ అరుగు దిగి కిందకు వెళ్లి నీకు ఎన్ని రూపాయి బిళ్ళలు కావాలో అన్ని చిన్న చిన్న రాళ్లు పట్రా"

మరియమ్మ హుషారుగా అరుగు మీద నుంచి దిగి రెండు రాళ్లు పట్టుకు వచ్చింది.

అభిరామ్ ఏదో ఆలోచిస్తూ జేబులో చేతులు పెట్టుకొని అటూ ఇటూ రెండు మూడుసార్లు పచార్లు చేశాడు ఆ అరుగు మీదే!

"ఇయిగో రాళ్లు"

"ఒక రాయిని నా ఖాళీ చేతిలో ఉంచు"

మరియమ్మ ఓ రాయిని అభిరామ్ ఎడమ చేతిలో ఉంచి అతని ముఖం వైపే తేరిపార చూడసాగింది.

"రాయి అరిచేతిలో పెట్టావుకదా! నువ్వే నావేళ్లను ఒక్కొక్కటీ మడిచెయ్"

ఆమె అతని చేతివేళ్లను మడిచింది. అభిరామ్ గుప్పిట మూసి కుడి చేతిని ఓసారి ఆ గుప్పిట మీద ఉంచాడు. తరువాత మరియమ్మను తన ఎడమచేతి మీద ఓసారి ఊదమన్నాడు. ఆ వెంటనే గుప్పిట తెరిచి చూపించాడు. చేతిలో రాయికి బదులు రూపాయి నాణెం ఉంది.

"అరే! నువ్వు ఆ మంతరగాడిలా గున్నావే" అంటూ ఆశ్చర్యపోయింది మరియమ్మ.

"వాడిలా ఉండటం కాదు! నేనే ఆ మంత్రగాణ్ని! ఇంకో రూపాయి కూడా సృష్టించమంటావా?"

"అక్కర్లేదు! నీకూ మయిమలున్నాయి..నువ్వు మా ఇంటికాడే ఉండిపో. నీకు ఏం కావాలంటే అయి సేసి పెడతాను..."

"నేను మీ ఇంటి దగ్గరే ఉండిపోతాను కాని మీ అబ్బాయి మరీ అల్లరి ఎక్కువ చేస్తాడు. అస్తమానూ ఏడుస్తాడు... పిల్లలు ఏడిస్తే నాకు చిరాకు..."

"నేను ఎతుకుంటే మావోడేడవడు. ఆడు అల్లరి సేయకుండా ఉంటే నువ్వు మా ఇంటికాడి ఉండిపోతావా?"

"ఓ...తప్పకుండా! ఇంతకీ మీ అబ్బాయేడీ..?"

మరియమ్మ హఠాత్తుగా చుట్టూ

చూసింది. అరుగు పక్కనే తన మొగుడు పిల్లాడిని ఎత్తుకొని దిగులుగా చూస్తు న్నాడు.

ఒక్క ఉదుటున అరుగు దిగి పిల్లాడిని ఎతుకొని గుండెలకు పొదువుకుంది. ఎన్నో రోజుల క్రితం తప్పిపోయిన కొడుకు హఠాత్తుగా కనిపించినంత ఆనందంగా ఉంది మరియమ్మకు. అంత మంది ఉన్నారనే ధ్యాసైనా లేకుండా ఆ అరుగు మీదే ఓ పక్కన వెనక్కి తిరిగి కూర్చుని పిల్లాడికి పాలివ్వసాగింది.

జనం అరుగు చుట్టూ గుమిగూడ సాగారు. రాజారావు, ప్రకాశరావు, అభిరామ్ అతికష్టంమీద వాళ్ళని దూరంగా ఉంచగలిగారు.

అయిదు నిముషాలు గడిచాయి.

"నన్ను మీ ఇంటికి తీసుకు వెళ్తా నన్నావ్ కదా" అన్నాడు అభిరామ్- మరియమ్మనుద్దేశించి.

"అలాగే! సదు ఎల్దాం" అంటూ ఇంటికి దారితీసింది మరియమ్మ.

ఆమె వెనుక అభిరామ్ ఆమె ఇంటిదాకా వెళ్ళి "ఇల్లు చూశానుకదా! ఇప్పుడే మళ్ళీ వస్తాను... ఊళ్ళో కొంచెం పనుంది" అంటూ వెనుదిరగబోయాడు.

"నువ్వెళ్లిపోతే నాకు బయం" అంది మరియమ్మ.

"భయం ఎందుకు? నేను నీకు ఇచ్చిన రూపాయి బిళ్ళ ఉందికదా! దానిని కొంగుకు ముడేసి ఉంచుకో! రాత్రిళ్ళు తలకింద పెట్టుకు పడుకో! ఏం భయం ఉండదు. అయినా ఇప్పుడు నేను మళ్ళా వస్తానుగా" అని ఆమెకు ధైర్యం చెప్పి ఆసుపత్రి దగ్గరకు వచ్చాడు.

రెండు రోజులనుంచి పిల్లాడికి పాలు



ఇవ్వని మరియమ్మచేత ఆ పని చేయించే సరికి అభిరామ్‌పై కొంతమందికి గురి ఏర్పడింది.

"అయితే సేతబడిని ఇలాక్కూడా నయం సెయ్యొచ్చన్నమాట"

"అదేంట్రా! కబుర్లు సెప్పి సిటికెలో గుణం కుదిరించేశాడు"

"అవునుగానీ....ఇస్సిత్రం! సేతిలోంచి రూపాయి ఎలా వచ్చిందంట?"

"రెడ్డినాయుడుగోరు తీసుకొచ్చిన మంతరగాడు భోషాణాన్ని సేతబడి అయి నోళ్ళింటికి పంపించగాలేంది ఈయన రూపాయలు తెప్పించడం గొప్పేంటి! ఆ మాటకొత్తే ఈయన్ని భోషాణాన్ని అలా పంపించమను సూద్దాం"

అభిరామ్ మళ్ళీ మైకు దగ్గరకు వచ్చాడు. "మరియమ్మ వ్యవహారం చూశారు. ఊళ్ళో మిగతావాళ్ళకి కూడా ఇలాగే మానసిక రోగాలు వచ్చాయి. వాళ్ళకి కూడా ఇలా నయం చెయ్యొచ్చు! మంత్రగాడు నిమ్మకాయలోంచి రక్తం రప్పించాడనీ, బొమ్మలమీద కొట్టేసరికి పెద్ద శబ్దం అయిందనీ, భోషాణం ఇంటింటికీ తిరిగిందనీ మీరు ఆశ్చర్యపోతున్నారు. అవన్నీ ట్రిక్కులు! కేవలం మిమ్మల్ని నమ్మించటంకోసం చేసిన మేజిక్కులు. కావాలంటే ఇప్పుడే మీలో ఎవరైనా నిమ్మకాయను పట్రండి! అందులోంచి రక్తం ఎలా తెప్పిస్తారో చూపిస్తాను"

కొంతమంది గబగబా దగ్గర్లో ఉన్న కిళ్ళీకొట్టుకు పరిగెత్తారు. రెండు నిమిషాల్లో నిమ్మకాయను తెచ్చి అభిరామ్‌కు ఇచ్చారు.

ఆసుపత్రిలోని కాంపౌండర్‌ని అడిగి అభిరామ్ ఓ సిరంజి, ఇంజక్షను సూది తీసుకున్నాడు. తన దగ్గర ఉన్న పెన్ను లోంచి ఎర్ర సిరాను సిరంజిలోకి ఎక్కించి, ఆ ఎర్రసిరాను నిమ్మకాయ లోకి 'ఇంజక్ట్' చేశాడు. జేబులోంచి తాళాల గుత్తి బయటకుతీసి ఆ గుత్తిలో ఉన్న చాకుతో నిమ్మకాయను కోశాడు. నిమ్మ చెక్కలను పిండితే రసానికి బదులు ఎర్రని ద్రవం కిందపడింది.

"ఇంతే! ఇదే పద్ధతిలో ఆ మంత్రగాడు కూడా మిమ్మల్ని మాయచేశాడు. బొమ్మలో తుపాకీ మందు కూరితే, దానిమీద బరువైన వస్తువుతో కొట్టినపుడు పేలుతుంది. ఆ విషయం మీకు తెలియక ఆ మంత్రగాడికి ఏవేవో శక్తులున్నాయని నమ్మేశారు. ఇంక భోషాణం సంగతి! భోషాణాన్ని మోసేవాళ్ళలో తనకు సంబంధించిన మనుషులు వెనకాల ఇద్దరు ఉంటారు. వాళ్ళు అతని మనుషులు అని ఎవరికీ తెలియదు. పడవను నడిపేటప్పుడు చుక్కానిని పక్కపక్కకు ఎలా గెంటుతామో వాళ్ళిద్దరూ ఆ భోషాణాన్ని అలా గెంటుతారు. దాంతో ముందు వాళ్ళకి భోషాణమే ఆ పక్కకు తిరుగుతున్నట్టు అనిపించి తాము కూడా ఆ పక్కకు తిరిగి మోసుకుంటూ పోతారు. కావాలంటే భోషాణాన్ని తీసుకురండి. లేదా అలాంటి బరువున్న మరేవస్తువునైనా తీసుకురండి. నేను, మరొకరు వెనకాల ఉండి ఆ తంతు జరిపిస్తాం. మీకే తెలుస్తుంది"

జనంలో కలకలం బయలుదేరింది.

"అంతేనంటావా?"

"అంతే అయుంటుంది! అన్నీ ఆయనే సొయంగా సేసి చూపిత్తన్నాడుగా"

"మతోతోంది! ఏది నిజవో, ఏది అబద్ధమో తెలవటంలేదు"

"ఆ మంత్రగాడు పది రోజులు పూజలు చేస్తేగాని తగ్గదన్నాడు. ఈయనేమో చిటికలో తగ్గించేస్తున్నాడు. ఈయనే గొప్పోడెహె!"

"బోషాణం సంగతి కూడా సూస్తే తెల్సిపోద్ది అసలు సంగతి"

ఆసుపత్రిలో ఉన్న పెద్ద బల్లని బయటకు తీసుకువచ్చారు నలుగురు మనుషులు. ఆ టేబుల్‌కు అటూ ఇటూ కింద పెద్ద పెద్ద అరలున్నాయి. పెద్ద పెద్ద బండ రాళ్లను నాలుగింటిని తీసుకువచ్చి ఆ అరల్లో పెట్టమన్నాడు అభిరామ్.

రాజారావు, ప్రకాశరావు ఆ ఏర్పాటు చేశారు. అంత క్రితం నలుగురు మోసుకొచ్చిన ఆ బల్ల ఇప్పుడు ఆ నలుగురికీ లేవలేదు.

"ఈ టేబుల్‌ను ఎవరింటికి తీసుకు వెళ్ళమంటారో చెప్పండి! మీలో ఎవరైనా సరే నలుగురు ముందువైపున బల్లను మోయండి. నేనూ,రాజారావు వెనకవైపున మోస్తాం!" అన్నాడు అభిరామ్.

అంతక్రితం ఆసుపత్రిలోంచి బల్లను మోసుకొచ్చినవాళ్లే బల్లను ఊళ్ళోకి మోయటానికి ఎవరికీ అభ్యంతరం లేకపోయింది. బల్లను రామాలయం వరకూ తీసుకువెళ్లాలని అక్కడ చేరినవారంతా నిర్ణయించారు. వెనుకవైపున ఉన్న రెండు కోళ్ళనూ అభిరామ్, రాజారావ్ భుజాల మీదకు ఎత్తుకున్నారు. ముందువైపు రెండు కోళ్లను మరో ఇద్దరు, మధ్యలో ఉన్న కమ్మీని ఇద్దరూ భుజాలమీద ఆన్చుకొని బయలుదేరారు.

మలుపులు తిరుగుతూ ముందుకు సాగిపోయింది టేబులు. జనం వారి వెంటపడ్డారు. సందులు గొందులు దాటి చివరికి రామాలయం వరకూ వెళ్లారు.

తరువాత రాళ్ళని అక్కడే వదిలేసి టేబుల్‌ను మాత్రం ఆసుపత్రికి చేర్చారు.

ఆ సంఘటనతో ఊళ్ళో జనం రెండుగా చీలిపోయారు. చేతబడిని నమ్మిన వాళ్లు - నమ్మనివాళ్ళని తమవైపు తిప్పుకొందామనీ, వీళ్ళు వాళ్ళని చేతబడి కాదని, శక్తులు లేవని నమ్మిద్దామనీ ప్రయత్నించసాగారు.

ఊళ్ళో ఒక రకమైన ఉద్రిక్త పరిస్థితి వ్యాపించింది.

జానకి ఆ విషయాలన్నీ దగ్గరుండి చూసింది. కాని ఆమెలో భయం మాత్రం తొలగిపోలేదు.

రిపోర్టర్ ప్రభాకర్, రాజారావు, అభిరామ్... ముగ్గురూ సత్తిరెడ్డి ఇంటికి వచ్చేశారు.




ఆ రాత్రి భోజనాలయ్యాక రాజారావు, అభిరామ్, ప్రభాకర్ పిచ్చాపాటీ మాట్లాడుకోసాగారు. సత్తిరెడ్డి, గోవిందయ్య, ప్రకాశరావు కూడా వాళ్ళతో చేరారు.

మంత్రగాడు ప్రదర్శించిన 'మాయ'లను పటాపంచలు చేయటంతో అభిరామ్ మీద ఆ ఊళ్ళో చాలామందికి గురి కుదిరిపోయింది.

ఒక్కరొక్కరే సత్తిరెడ్డి ఇంటికి చేరసాగారు. చూస్తూండగా ఆ ఇంటి ముందు

దాదాపు వందమంది పోగయిపోయారు.

వాళ్ళందరి కోసం అభిరామ్ ఇంటి బయటే మంచం వేసుకొని కూర్చున్నాడు. రాజారావు, ప్రభాకర్, మిగిలిన వాళ్ళకు కుర్చీలు వేయించాడు సత్తిరెడ్డి.

జనం కింద కూర్చున్నారు.

"ఆ మంతరగాడు సేసిన పన్లన్నీ మీరు సేసి చూపించారు. బాగానే ఉంది. కాని అసలు ఈల్లందరికీ సేతబడి ఎలా జరిగుంటదంటారు" అని అడిగాడు సత్తిరెడ్డి.

అభిరామ్ తాపీగా చెప్పడం ప్రారంభించాడు.

"చేతబడి చేయటం వెనక చాలా తతంగం ఉంది. అది ఓ రోజులోనో, ఓ నెల్లోనో పూర్తయ్యేపనికాదు. సాధారణంగా చేతబడి చేసేవాళ్ళకి చాలామంది అసిస్టెంట్లు ఉంటారు. ఒక రకంగా చెప్పాలంటే వాళ్ళంతా తోడు దొంగలన్న మాట! వాళ్ళు లేకపోతే ఏ మాంత్రికుడూ ఎవరికీ చేతబడి చేయలేడు..."

"అంటే...ఇప్పుడు మా ఊళ్ళో ఈళ్ళందరికీ ఎవడో ఒకడు ఆల్లమనసుల ద్వారా సేతబడి చేయించారన్నమాట"

సత్తిరెడ్డి సందేహాన్ని అర్థం చేసుకున్నాడు అభిరామ్.

అందరూ ఉత్సుకతతో అభిరామ్ చెప్పే విషయాలను వినసాగారు.

"అవును! మనలో ఒకడు...మనకు బాగా కావలసినవాడు-బంధువో, స్నేహితుడో, పరిచయస్తుడో... ఎవరో ఒకరు ముందుగా మనకి చేతబడి మీద నమ్మకం కలిగిస్తాడు. అసలు చేతబడి ఎలా చేస్తారో కూడా కథలు కథలుగా చెబుతాడు. సహజంగా మనలో అలాంటివాటిపట్ల భయం ఉంటుంది. ఆ భయమే వాడికి ఆయువుపట్టు"

"మరయితే గోల్లూ, ఎంట్రుకలూ, మలం అయీ తీసుకెళ్తే తప్ప సేతబడి సెయ్యటం కుదరదంటారు కదా"

జనంలోనే ఒకతను అడిగాడు.

"అవన్నీ మనలను భయపెట్టటానికి చేసేపన్లు. ఆ అనుమానం మనలో కలగాలేకాని, వాటి ద్వారా మనల్ని చేతబడికి గురిచెయ్యటం ఏమంత కష్టం కాదు.

కొంత మందిని గోళ్ళ, వెంట్రుకల పేరు చెప్పి భయపెట్టవచ్చు. మరి కొంతమందిని బొగ్గులు, బొమ్మల పేరు చెప్పి భయపెట్టవచ్చు. ఇంకొంతమందిని ముగ్గులు, బీజాక్షరాల పేరు చెప్పి భయపెట్టవచ్చు. ఎవరి బలహీనత ఏమిటో తెలుసుకొని వాళ్ళచేత ఆ బొగ్గులో, ముగ్గులో, మిరపకాయలో, పసుపు నీళ్ళో తొక్కించి వాళ్లకి చేతబడి జరిగిందని నమ్మిస్తే, ఆ తరువాత వాడు అదే బెంగతో కృశించిపోతాడు. మళ్ళీ వాడిని మామూలు స్థితికి తీసుకు రావాలన్నా అలాంటి ప్రయత్నమే చేయాల్సి ఉంటుంది. మంత్రగాడు తనకి శక్తులు, మహిమలు ఉన్నాయని వాణ్ని నమ్మించగలిగితే, తను చెప్పినట్లు వాడిచేత ఏదేదో తతంగం చేయించి తనకి జరిగిన చేతబడిని తిరగ్గొట్టానని చెప్పి అతని పరిస్థితిని యథాప్రకారానికి తీసుకురావచ్చు"

అభిరామ్ చెప్పటం పూర్తి చేసి మంచినీళ్ళు తెప్పించమన్నాడు సత్తిరెడ్డితో.

నారాయుడు పెద్ద పాల తప్పేలా నీళ్లు, నాలుగు గ్లాసులు తీసుకువచ్చాడు.

అభిరామ్ రెండుగ్లాసులు నీళ్లుతాగాడు. వెంటనే రాజారావు, ప్రభాకర్,

సత్తిరెడ్డి, గోవిందయ్య కూడా తలోగ్లాసు నీళ్లు తాగారు.

తప్పేలాలో నీళ్లు అయిపోయాయి.

"ఒరే నారాయుడూ! మాక్కూడా మంచినీళ్లియ్యరా" అనడిగాడు అక్కడ కూర్చున్నవాళ్ళలో ఒకడు.

అక్కడ చేరినవాళ్లలో చాలా మంది వరుసగా తలో గ్లాసు నీళ్ళు తాగారు.

"చూశారా! ఒకళ్లు చేసిన పని ఇతరుల మీద ఎలా ప్రభావం చూపిస్తుందో! కేవలం మంచినీళ్ళ విషయమే చూడండి! నేను ఇప్పటివరకూ మాట్లాడాను కనుక గొంతు తడారిపోవటం వల్ల నీళ్లు తాగాను. కాని ఆ వెంటనే చాలా మందికి నీళ్లు తాగాలనిపించింది. చేతబడి, దెయ్యాలు, భూతాలు, శక్తులు వగైరాల పట్ల భయం కూడా ఇలాంటిదే! ఒక వ్యక్తి నిజంగానే ఏదో బలహీనతవల్లో, భయంవల్లో మతిభ్రమణానికో, చిత్తచాంచల్యానికో గురవుతాడు. అతన్ని చూసి మిగతావాళ్లు లేనిపోనివి ఊహించుకొని తమకు కూడా అలా జరుగుతుందేమోనని భయపడతారు. ఆ పరిస్థితిలో గట్టిగా గాలివీచినా, ఎక్కడో దూరంగా కుక్క మొరిగినా, ఆకు అల్లాడినా ఆ అలికిడికే కంగారుపడిపోతారు. అదంతా క్షుద్ర శక్తుల ప్రభావమనీ, తన మీద అవి వాలాయనీ, లేదా తన మీద ఎవరో ప్రయోగం చేశారనీ అపోహపడతారు. ఆ అపోహే నిజమని నమ్ముతారు. అందరితో పాటూ వారూ ఒకటవుతారు. ఇప్పుడు ఈ ఊళ్ళో వింత వింతగా ప్రవర్తిస్తున్న వాళ్ళలో కొందరు అలాంటివాళ్ళే! మరియమ్మను చూశారుగా! ఆమె కేసు ఇలాంటిదే! కేవలం భయం! అన్నీ ఆమె ఊహలు... భయాలు ... భ్రాంతులు!"

అప్పటికి చాలా పొద్దుపోయింది.

"ఇంక పడుకుందాం.. ఒరే! మీరు ఇళ్లకు పొండి... మిగతా వ్యవహారాలు రేపు చూసుకుందాం" అన్నాడు గోవిందయ్య.

జనం కొత్తగా తెచ్చుకున్న ధైర్యంతో ధాటిగా అడుగులు వేస్తూ ఇళ్లకు బయలుదేరారు.

గోవిందయ్య, ప్రకాశరావు కూడా వెళ్లిపోయారు.

సత్తిరెడ్డి - అభిరామ్‌కీ, ప్రభాకర్‌కూ పక్కలు వేయించి తాను నిద్రకు ఉపక్రమించాడు.

రాజారావు, అభిరామ్, ప్రభాకర్ కూర్చున్నారు.

"నేను వెళ్తాను. పొద్దున్నే వస్తాను" అన్నాడు రాజారావు.

"వెళ్దువుగాని కూర్చో! నాకు ఓ పని చెయ్యాలనిపిస్తోంది" అన్నాడు ప్రభాకర్.

"ఏవిటది?" రాజారావు ప్రభాకర్ పక్కలో కూర్చుంటూ అడిగాడు.

"అభిరామ్‌గారు చెబుతున్న దాన్నిబట్టి ఊళ్ళో ఈ విపరీతం జరగటానికి కారణం ఏమిటో ఇన్వెస్టిగేట్ చేయాలనిపిస్తోంది" అన్నాడు ప్రభాకర్.

"చేస్తే మంచిదే! అదంత తేలిక కాదేమో!"

అభిరామ్ అనుమానం వెలిబుచ్చాడు.

"పోలీసు డిపార్టుమెంటూ, పత్రికల వాళ్ళూ తలుచుకుంటే చేయలేనిపనంటూ ఏమీ ఉండదు. పొలిటికల్‌గా వత్తిడులు రాకపోతే పోలీసులు క్షణాల్లో ఏ కేసునైనా ఓ కొలిక్కి తీసుకురాగలరు. మేమూ అంతే! 'ఆఫ్‌ది రికార్డ్' అంటూ

మా నోళ్లు నొక్కకపోతే మేం బయట పెట్టలేని రహస్యం అంటూ ఏమీ ఉండదు."

ప్రభాకర్ అంత ధీమాగా చెప్పటంతో రాజారావుకి కూడా హుషారు వచ్చింది.

"నువ్వు అలా చేయగలిగితే అంత కంటే కావాల్సిందేముంటుంది? ఇంతకీ నువ్వాపని ఎలా చేద్దామనుకుంటున్నావ్?"

అవసరమైతే ప్రభాకర్‌కి సాయం చేద్దామనే ఉద్దేశంతో అడిగాడు రాజారావు.

అభిరామ్‌గారు చెప్పేదాన్ని బట్టి ఎవరో ఈ పని చేయించి ఉంటారు. చేయించిందెవరు? చేసినదెవరు? చేసిన వాడికి సాయపడ్డదెవరు? ఇలాంటి ప్రశ్నలకి సమాధానం వెతకాల్సి ఉంటుంది. రాత్రిం బగళ్లు తిరిగితే ఈ విషయాలు కనుక్కోవటం పెద్ద సమస్య కాదనుకుంటాను"

ప్రభాకర్ చెప్పిన తీరు అభిరామ్‌నీ, రాజారావునీ బాగా ఆకర్షించింది. ఇద్దరూ ప్రభాకర్‌ని బాగా ప్రోత్సహించారు. ఒక మంచి పని చేయబోతున్నాం అనే తృప్తితో ఆ రాత్రికి రాజారావు చాలా రోజుల తరవాత తృప్తిగా నిద్రపోయాడు.

* * *

మర్నాడు యథాప్రకారం జానకి స్కూలుకు వెళ్ళింది. రాజేశ్వరి ఆమెతో కూడా మామూలుగానే వెళ్లింది.

అభిరామ్ – సత్తిరెడ్డి ఇంటిలోనే వేరే పక్క వేయించి భీముడికి ట్రీట్‌మెంట్ ప్రారంభించాడు.

ముందుగా కాంపోజ్ ఇంజక్షన్ ఇచ్చాడు.

క్రమక్రమంగా అతను మగతలో పడ్డాడు.



ఆ దశలో అతనికి ధైర్యం చెప్పాడు.

"నీకేం భయం లేదు. నువ్వు ఆరోగ్యంగా ఉన్నావు. నిద్రపోయి లేచేసరికి నువ్వు మామూలుగా అవుతావు" అంటూ పదేపదే చెప్పసాగాడు. ప్రశాంతంగా అతని మాటలు వింటూనే నిద్రలో మునిగి పోయాడు భీముడు.

తరవాత అభిరామ్ కొట్టు సోమయ్య ఇంటికి వెళ్ళాడు. తాతబ్బాయి విషయం చూశాడు. ఆ తరవాత వెంకటేశం ఇంటికి వెళ్ళాడు.

అభిరామ్ మరియమ్మను మళ్ళీ మామూలు మనిషిని చేయటంతో పెద్ద అప్పన్నకు 'పోనీ, రాముల్ని ఆయనకే సూపిత్తే తొరగా నయమవుద్దేమో' అనే ఆలోచన వచ్చింది.

ఆమాటే అల్లుడు నాగులుతో అన్నాడు.

"శ...శ! ఇంగిలీషు వొయిజ్జాలు కొన్నాళ్లే పన్జేత్తాయంట! మంతరగాడు పూజలు సేత్తన్నాడుకదా. ఇయాల ఆల్లలో కొందరికి సేతబడి వొయిజ్జెం మొదలెడతాడంట! మనోణ్ని తీసు కెళ్లాం! పది రోజుల్లో ఆడు మల్లీ మన్లో మనిసైపోతాడు... నువ్వేం బెంగెట్టి కోమాక ఆడి గురించి"

రాములు గురించి నాగులు అలా అనే సరికి ఎటూ తేల్చుకోలేకపోయాడు పెద్ద అప్పన్న.

ఆ రోజు పొద్దుటి నుంచీ ప్రభాకర్ వేటలో మునిగిపోయాడు.

కిళ్ళీకొట్టు దగ్గర బైఠాయించి వచ్చే పోయే వాళ్ళతో కబుర్లు చెప్పసాగాడు.

తమ ఊరి గురించీ, ఊళ్ళో జరుగుతున్న కలకలం గురించీ పేపర్లో అతనే వేయించాడని కిళ్లీ కొట్టులో ఉండే వ్యక్తికి అర్థమయింది. అతనే పదిమందికి ఆ విషయం గురించి చెప్పాడు. దాంతో

ప్రభాకర్‌కు అక్కడ ఎక్కడలేని గౌరవం వచ్చేసింది.

ప్రతి ఒక్కడూ అతనితో మాట్లాడటమే గొప్ప అన్నట్లు కబుర్లు చెప్ప సాగారు.

"మొత్తం మీద మంత్రగాడు చాలా గొప్పవాడే" అంటూ కిళ్లీకొట్టు దగ్గర చేరినవాళ్ళని కబుర్లలోకి దించాడు.

"ఏమోనండే! మీతోపాటు సత్తిరెడ్డి గారింట్లో ఉంటున్న డాట్రుగారు అయన్నీ అబద్దవంటున్నారండే! ఈయనేమో ఇదేశాల్లో సదువుకొచ్చినోరు! ఆమంతరగాడేమో అదేదో దేశంలో మంతరాలు నేర్సుకున్నాడంట! ఆ మంతరగాడూ మీసాలు మెలేత్తన్నాడు. ఈ డాట్రుగారూ కచ్చితంగా అడియన్నీ అబద్దాలని సెబుతున్నారు. ఊళ్ళో పెద్దోళ్ళు, పెద్దోళ్ళు బానే ఉన్నారు! మద్దెలో మాకు సావొచ్చింది" అన్నాడు ఓ పెద్దమనిషి.

"అసలు ఆ మంత్రగాడిది ఏ వూరుట? మనవైపు మనిషేనా? ఇంకెక్కడినుంచేనా ఇక్కడికి వచ్చాడా?"

"ఏమోనండే! ఆడు మాట్లాడ్డంలేదు కదా! ఆ శిష్యుడే ఏవన్నా సెప్పాలంటే సెబుతున్నాడు. మంతరగాడు 'హుం' అంటంతప్ప బయట ఇంకేం మాట్లాట్టం లేదు. ఏంటో మంతరాలు సదివాడుగాని మాకేం తెలవలా!"

"ఆ శిష్యుడిది ఏ వూరుట? స్వచ్ఛంగానే మాట్లాడుతున్నాడట కదా!"

"ఆడిది భీంవారం ఏపున కొండంగటండి! ఆ ఊరి వాడెవడో సుట్టపు సూపుగా ఈ ఊరొచ్చాడంట! ఆడు సెబుతున్నాడండి. ఆడి పేరు పెంటయ్యంటండి! ఆళ్ళూళ్ళో ఓసారి ఓ పెద్దింటి అమ్మాయిని సెయ్యట్టుకున్నాటండి! ఆల్లోళ్లు ఈణ్ని సితకబాదిసేత్తే పారిపోయాడంటండి! అబ్బో! అదంతా పదేళ్ళప్పుడు జరిగిందంటండి! ఇప్పుడీడు ఆళ్ళూరు ఎల్లడంటండి! నెలకో, రెణ్నెల్లకో ఓసారి డబ్బంపుతాడంటండి! ఆడు పెళ్లి సేసుకోలేదంటండి! ఆళ్ళమ్మా నాన్న అక్కడున్నారంటండి"

"అయితే పెంటయ్యకీ, ఈ మంత్రగాడికీ ఎలా కలిసిందట?"

"ఏమోనండి! అయన్నీ తెలవ్వండి! అసలా పెంటయ్యతో మాటాడిందెవరండే! ఆడీవూరొచ్చేసవయానికి ఆళ్ళూరోడొకడు ఈ వూరొచ్చాడు కనక ఈ ఇసయాలైనా తెలిశాయండి"

"మొదటిసారిగా ఈ ఊళ్ళో చేతబడి జరిగిందెవరికి?"

"రావులికండి! ఆడు మంచోడండి పాపం. ఎవరి జోలికీ ఎల్లేవోడు కాదండి! వారానికి నాల్రోజులు సంతలకి బళ్లు తోలుకునేవోడండి! ఆ వచ్చిన డబ్బుల్తోనే గుట్టుగా బతికేత్తన్నాడండి..."

"రాములితో ఇంకెవరెవరు కలిసి బళ్లు తోలుతూ ఉంటారు?"

"ఎంకన్న లేడాండి! ఆడికీ సేతబడి అయిందండి! ఆడూ, ఆ రావులిగాడి బామ్మర్ది నాగులూ...ఆ ముగ్గురూ బాగా కలిసుండేవోరండి! రావులికీ, ఎంకన్నకీ సేతబడపటంతో నాగులుగాడు కూడా ఎక్కడికీ ఎల్లటంలేదండి!"

మరి కాస్సేపు అక్కడే కూర్చుని ప్రభాకర్ మళ్ళీ ఊళ్లోకి బయలుదేరాడు.

ఊళ్ళో రెడ్డినాయుడి ఇంటిదగ్గర... మంత్రగాడు-రాములు, వెంకన్న, జాన్, మరో ఇద్దరు ఆడవాళ్ళని వరసగా కూర్చోపెట్టాడు. వాళ్ళతోపాటు వాళ్ల దగ్గరవాళ్లు

కూడా సాయం చేయటానికి వచ్చారు. చేత బడికి గురయిన వాళ్ల చేతుల్లో ఒక్కో కొబ్బరికాయ ఉంది.

గుగ్గిలం ధూపంవేసి అందరినీ ఆ ధూపాన్ని వాసన చూడమన్నాడు. తర వాత అందరి దగ్గరి కొబ్బరికాయలు తీసుకుని తన గదిలోకివెళ్ళి పావుగంట సేపు పూజలు చేశాడు.

ఈలోగా పెంటయ్య – గురువుగారి గొప్పతనం గురించి వాళ్లందరికీ చెప్ప సాగాడు.

"ఈయన మామూలుగా కనిపిస్తు న్నాడు కాని గొప్ప భక్తుడు. రోజూ ఈయనకి కాళికాదేవి కల్లోకి వస్తుంధట! ఎవరికైనా చేతబడిని తిరగ్గొట్టటానికి ఈయన కాళికాదేవిని అడిగి అనుమతి తీసుకోవాలట! కాళికాదేవి వద్దంటే ఎవరి కోసమూ పూజలు చెయ్యరు"

"అ య్ బా బో య్! కాళికాదేవే! ఈయన్తో మాటాడ్డవా? ఈయనకి బయవెయ్యదా?"

"ఛ ఛ! భయమెందుకూ? మంచివాళ్లని ఆ చల్లనితల్లి ఏమీ చెయ్యదు. ఈయన పదిమంది బాగుకోసమే ఈ పూజలు చేసేది. అందుకే ఈయనంటే ఆ తల్లికి ఎంతో అభిమానం. రోజూ ఓసారైనా కల్లోకి వస్తుంది కాళికాదేవి"

అంతలో మంత్రగాడు పూజ గది లోంచి బయటకు వచ్చాడు. ఆ అయిదు గురికీ ఒక్కో కొబ్బరికాయ ఇచ్చి కొట్ట మన్నాడు. చేతబడికి గురయినవాళ్ల బంధు వులు వాళ్ళచేత కొబ్బరికాయలు కొట్టిం చారు.

శిష్యుడు పెంటయ్య వాళ్ళందరికీ మర్రి ఆకుతో చేసిన దొన్నెలు ఇచ్చాడు. కొబ్బరి నీళ్లను ఆ దొన్నెలలో పోయమని



చెప్పాడు పెంటయ్య. అందరూ అలా చేశారు.

తరవాత పూజచేసిన కొబ్బరికాయను తీసుకు వచ్చాడు మంత్రగాడు.

ఆ కొబ్బరికాయను వాళ్ళముందు ఉంచి "ఊఁ" అన్నాడు.

పెంటయ్య వెంటనే "మీ అందరి పేరు మీదా అమ్మవారిని అర్చించి మీకు నయం చేయాలా, వద్దా అని గురువుగారు కాళికాదేవిని అడిగారు. అమ్మవారు సరే నన్నారు. అందుకే గురువుగారు పూజ కొబ్బరికాయను తీసుకువచ్చారు. ఇప్పుడు మీరంతా ఆ మర్రిఆకు దొన్నెలలో ఉన్న కొబ్బరి నీళ్లను చేతిలో పోసుకుని మీ ఇష్ట దైవాన్ని తలుచుకుని, ఆ నీళ్లని కొబ్బరికాయ మీద పొయ్యండి"

అందరూ మర్రి దొనెల్లోని కొబ్బరి నీళ్లను చేతులలో వంపుకొని దేవుణ్ని తలుచుకుని మంత్రగాడు ఇచ్చిన కొబ్బరి కాయపై ఒక్కసారిగా పోశారు.

అంతే !

ఆ కొబ్బరికాయ 'ఫట్'మని పేలి పోయింది.

కాయలోని నీళ్లు అందరిమీదా చిందాయి.

ఒక్కళ్ళూ నోరు మెదపలేదు.

ఆ హఠాత్ పరిణామానికి ప్రతి ఒక్కడూ ఆశ్చర్యపోయాడు. పెంటయ్య చెప్పాడు "దీన్నిబట్టి వీళ్ళందరికీ చేతబడి జరిగిందని రూఢి అయింది. వీళ్ళకోసం ఇవాళ్టినుంచే పూజలు ప్రారంభిస్తారు గురువుగారు. పూజ చివరిరోజున వీళ్ళని మళ్లీ తీసుకురండి. ఆ రోజుతో అందరికీ చేతబడి వదిలిపోతుంది" అని.

అందరూ లేచి నిలబడ్డారు.

మంత్రగాడు పొన్నుకర్రని గంధమూ, పసుపూ కలగలిసిన బండారులో ముంచి ఆ కర్రతోనే అందరికీ నొసటన బొట్టు పెట్టాడు.

పూజగది బయటనుంచే లోపలికి తొంగిచూసి,రకరకాల ముగ్గులముందున్న కాళికాదేవి ఫొటోకు భక్తితో దణ్ణం పెట్టి లెంపలు వాయించుకుని ఒక్కొక్కరూ అక్కడినుండి నిష్క్రమించారు.

ఆ తంతు జరుగుతున్న సమయంలోనే ప్రభాకర్ పెద్ద అప్పన్న ఇంటికెళ్లాడు.

అప్పన్న పనిమీద బయటకు వెళ్లాడు.

నాగులు రాములుతో పాటు రెడ్డి నాయుడు ఇంట్లో ఉన్న మంత్రగాడి దగ్గరకు వెళ్లాడు.

ఇంట్లో రాములు భార్య పేరంటాలు మాత్రమే ఉంది.

"రాములు లేడా అమ్మా!" అని అడిగాడు ప్రభాకర్.

"మీరెవరండీ?"

"రాములు మాకు రివాజుగా బండి తోలుతూ ఉంటాడు. లెక్క ప్రకారం నిన్నొతనువచ్చి సరుకుబండికి ఎత్తుకోవాలి. రాకపోయేసరికి వేరే బండి మాట్లాడి సరుకుని పంపించాం. వేరేపనిమీద ఈ ఊరు వచ్చాను. పనిలోపనిగా రాములు ఎందుకు రాలేదో కనుక్కుందామని వచ్చాను."

"రాములి ఇంటిదాన్నండి నేను ! ఆడికి సేతబడి అయిందండి ! మంతర గాడి దగ్గరికెళ్ళాడండి! ఆ మంతరగాడు పదిరోజుల్లో నయమయిపోద్దన్నాడంటండి! ఆ లెక్కన పైవారంకూడా ఆడు బండి కట్టడానికి రాలేడేమోనండి"

"రాములుతోపాటు ఇంకో అతనుం డాలి. అతని పేరు... ఆఁ... నాగులను కొంటాను...? అతనేనా లేడా?"

"ఆడూ మా వోడేనండి ! రాములి సెల్లెలి మొగుడండి! ఆవిడ సచ్చిపోయిం దండి! నాగులు మాత్రం మాకాడే ఉంటన్నాడండి! రావులికి సేతబడయింది కదండీ... అందుకని ఈడు ఆదికి సేత బణ్ణి తిరగొట్టిద్దారని ఎక్కడికీ ఎల్లటం లేదండి"

"నాగులు అసలూరు అనకాపల్లి అనుకుంటాను! ఇదివరకోసారి అక్కడ చూసినట్టు గుర్తు"

"అనకాపల్లి కాదండి ! ఎవర్నిసూసి ఎవరనుకున్నారోనండి! మా నాగులు అళ్ల అసలూరు ఇటెంపఁడి ! గుంటూరుకాడ ఇనుకొండండి! రెడ్డినాయుడుగోరి పాలేప సీతయ్య లేడాండీ! ఆడిదీ ఆ ఊరేనండి. అంతెందుకండి ... ఆ మంతరగాడు లేడాండి! ఆడిదీ ఇనుకొండేండి! మా అప్ప ఆళ్ళ అత్తారూరు ఇనుకొండండి! నేను అప్పుడప్పుడు ఆళ్ళూరు ఎల్లేదాన్నండి! మావోళ్లింటికి నాలుగిళ్ళవతల ఆ మంతర గాడుండేవోడండి! ఆడి పేరు పురుసోత్త వండి! మరాదెప్పుడు ఈ ఇద్దెలు నేర్సు కున్నాడోనండి"

"అయితే పైవారానికికూడా రాములు రాలేదన్నమాట! సరే! ఈ వారం వచ్చి నతన్నే రేపటి వారానికి కూడా రమ్మని చెబుతాను. నేను వచ్చానని రాములుతో చెప్పు"

ప్రభాకర్ వడివడిగా అడుగులు వేసు కొంటూ తూర్పుపేట దాటి వచ్చేశాడు.

మంత్రగాడి పేరు పురుషోత్తమని, అతని ఊరు వినుకొండ అని తెలిశాక, ముందుగా కొండంగికెళ్లి పెంటయ్య ఇంటివాళ్ళద్వారా అసలు విషయాన్ని రాబట్టటం మంచిదా, వినుకొండ వెళ్ళటం మంచిదా అని ఆలోచించాడు ప్రభాకర్. కొండంగి వెళ్ళటంవల్ల మరింత ఉప యోగంగా ఉంటుందని నిశ్చయించుకొని సత్తిరెడ్డి ఇంటికి వచ్చేశాడు.

అప్పటికి అభిరామ్ మరియమ్మను మరోసారి చూడటానికి వెళ్లాడని నారా యుడు చెప్పాడు.

అభిరామ్ వచ్చేలోగా బట్టలు సర్దుకో సాగాడు ప్రభాకర్.

మరియమ్మ ఇంటినుంచి వస్తోంటే- మంత్రగాడు చేసిన కొబ్బరికాయ ప్రయోగం గురించి దారిలో కొంతమంది అభిరామ్‌తో చెప్పారు.

"ఓస్! దాందేముంది? మీరుకూడా చెయ్యొచ్చు ఆ ప్రయోగాన్ని. ఓ కొబ్బరి కాయని సున్నపునీళ్ళల్లో రెండు మూడు రోజులు నానబెట్టి, తర్వాత ఓరోజో, రెండు రోజులో దాన్ని ఎండబెట్టండి. ఆ తరువాత ఆ కొబ్బరికాయ మీద ఎప్పుడు నీళ్లు చల్లినా పేలిపోతుంది"

అభిరామ్ ఆ కొబ్బరికాయ ప్రయోగంలోని రహస్యం గురించి చాలా తేలికగా చెప్పేసరికి, అతన్ని అడిగిన వారంతా నోరు వెళ్ళబెట్టారు.

అభిరామ్ సత్తిరెడ్డి ఇంటికి వచ్చేసరికి ప్రభాకర్ ప్రయాణమవటం చూసి విష యాలు తెలుసుకొని "బయలుదేరు. విష్ యూ ఆల్ ది బెస్ట్! మళ్లీ ఎప్పుడు వస్తావు?" అని అడిగాడు.

"ఈ రాత్రికి రాత్రే కొండంగి నుంచి వినుకొండ వెళ్లిపోతాను. రేపొద్దున్న అక్కడ పని చూసుకొని హైదరాబాద్ వెళ్లి ఆ మర్నాడు పగలు అక్కడే ఉండి రాత్రికి బయలుదేరి ఇక్కడికి వస్తాను. ఈలోగా మీరు కనీసం మరో కేసును క్యూర్ చెయ్యాలి. అలాగే మరోపని

కూడా చెయ్యండి! మీరు ఎలాగూ మన స్టేట్‌లో పేరుమోసిన హిప్నాటిస్ట్, సైకియాట్రిస్ట్ కనుక ఓ స్టేట్‌మెంట్ ఇస్తున్నట్టు మీ లెటర్‌హెడ్ మీద ఇక్కడి చేతబడి కేసులను మీరు చూసినట్టు, వాళ్ల వాళ్ల ప్రవర్తనలు మెడికల్ సైన్స్‌కి అతీతం కావన్నట్లు చెబుతూ వివరాలు రాసి హైదరాబాదులోని మా పత్రికాఫీసుకు పంపండి! నేను రేపటిలోగా తెలుసుకున్న వివరాలను న్యూస్‌గా ఇస్తాను. ఆ న్యూస్, మీ స్టేట్‌మెంట్ ఒకేసారి వస్తే బావుంటుంది. మీరు ఈ రాత్రికే రాసేసి గూడెంలో గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో ఆర్. ఎమ్. ఎస్.లో పోస్ట్ చేయించండి" అని చెప్పేసి ప్రభాకర్ బయలుదేరాడు.

దోవలో రాజారావు ఇంటికి వచ్చి తన ప్రయాణం గురించి చెప్పి అవసరమైతే తనకు ఫోన్ చేయమని నెంబరు, ఎడ్రసు ఇచ్చి "ఈ ఫోను నేను అద్దెకు ఉంటున్న ఇంటివాళ్లది. నెంబర్‌కి రింగ్ చేసి 'ప్రభాకర్ కావాలి' అని అడిగితే నన్ను పిలుస్తారు" అని చెప్పి వెళ్లిపోయాడు.

* * *

ఆరోజు రాత్రి మంత్రగాడు శ్మశానంలో పూజ ప్రారంభించాడు.

ఒక ఎముకతో నేలమీద తొమ్మిది చదరాలు గీశాడు.

ఒక్కో చదరంలోనూ ఒక్కో పిండి బొమ్మను ఉంచాడు. బొమ్మ చుట్టూ రకరకాల ముగ్గులు...!

చదరం బయట నాలుగు మూలల్లోనూ నాలుగు నిమ్మకాయలు!

పొరుగూరి శ్మశానం నుంచి తెప్పించిన కాష్టం బూడిదతో బొమ్మలమీద పూజ చేయసాగాడు.

శిష్యుడు పెంటయ్య మంత్రగాడికి కావలసిన సామగ్రిని అందిస్తున్నాడు. పూజ అయిపోయాక కల్లుతో బొమ్మల్ని అభిషేకించాడు.

ఆ తరువాత ఒక గొడ్డు కోడిని బలిచ్చాడు. కోడి రక్తాన్ని ముగ్గులున్న చదరాలచుట్టూ పోశాడు.

సీతయ్య, నాగులు, పర్వతాలు మంత్రగాడికి అండగా వచ్చారు.

ఆ చుట్టుపక్కలకు ఎవరూ రాకుండా జాగ్రత్తపడటంతో మాంత్రికుని పూజ నిర్విఘ్నంగా పూర్తయింది.

ఆ చీకటిలో వాళ్లంతా శ్మశానం నుంచి బయటపడి రెడ్డినాయుడి ఇంటివైపు దారి తీశారు.

సీతయ్య, నాగులు ముసలమ్మగుడి దగ్గర ఆగిపోయారు.

మాంత్రికుడు, శిష్యుడు పెంటయ్య, పర్వతాలు ముందుకు సాగిపోయారు.

వాళ్లు వెళ్లిన పది నిమిషాలవరకూ ముసలమ్మగుడి దగ్గిరే తచ్చాడి సీతయ్య, నాగులు – రాజారావు ఇంటి మీదుగా దోవపట్టారు.

* * *

సత్తిరెడ్డి ఇంటి దగ్గర భీముడి పరిస్థితి కొంచెం మెరుగయింది.

అతనికి స్పృహ వచ్చాక నచ్చచెబుతున్న ధోరణిలో భీముడికి మానసిక వైద్యం చేయసాగాడు అభిరామ్.

"పొద్దుటినుంచీ నేను భోజనం చెయ్యలేదు. అన్నట్టు నువ్వు అన్నం తిన్నావా భీముడూ?"

"నేను తినను. నాకు బయం"

"అదేమిటి ? భోజనం చేయడానికి భయమెందుకు?"

"అన్నంలో పురుగులు ఉంటాయి. పురుగులు తింటే సచ్చిపోతాం"

"భలేవాడివే! అయితే నేనూ ఈ పాటికి చచ్చిపోవద్దూ! మీ అన్న నారాయుడు, మీ వదిన గంగమ్మ, ఊళ్ళోవాళ్ళూ ... అందరూ భోజనాలు చేస్తారు కదా! మరి వాళ్లు చచ్చిపోలేదే?"

"మరి, నాకు మాత్రమే బోయినంలో పురుగులు ఎందుకగ్గనబడుతున్నాయ్?"

"పోనీ ఓ పని చేద్దాం! నువ్వూ, నేనూ ఒకే కంచంలో భోజనం చేద్దామా?"

భీముడికి సమాధానం చెప్పే అవకాశం ఇవ్వకుండానే నారాయుడిని అన్నం తీసుకు రమ్మని కేకపెట్టాడు అభిరామ్.

భీముడు నిశ్శబ్దంగా నారాయుడి వైపూ, అభిరామ్ వైపూ చూస్తూ కూర్చున్నాడు.

"అయితే నేను కాళ్లూ, చేతులూ కడుక్కొతాను" అంటూ లేచి భీముడు నీళ్ళ కుండీ దగ్గరకు వెళ్ళాడు.

నారాయుడు కంచంలో అన్నం, కూర, ఊరగాయ తీసుకు వచ్చాడు.

అభిరామ్ అన్నం కలిపి రెండు ముద్దలు ముందుగా తను తిన్నాడు.

తరువాత ఆ కంచాన్ని భీముడి ముందు ఉంచి "ఊ! కానియ్" అన్నాడు.

భీముడు ఆలోచిస్తూనే అన్నం కెలకసాగాడు. అతనికి ఏమీ తేడా కనిపించలేదు.

కాని మనసులో అనుమానం ఉన్నట్లు ముఖ కవళికలు చెబుతున్నాయి.

"ఇంకా ఆలోచిస్తున్నావేమిటి? నువ్వు అన్నీ పన్లు టైమ్ ప్రకారం చేస్తావని మీ నారాయుడు చెప్పాడు. ఇప్పుడు పదయింది. ఇంకా పొద్దుపోయాక భోజనం చేస్తే అరగదు. ఊ... కానియ్!"

అభిరామ్ మాటలు భీముడి మీద పని చేశాయి. గబగబా ముద్దలు చేసుకొని అన్నం తినసాగాడు.

నారాయుడు తృప్తిగా నిట్టూర్చాడు.

మామూలుగా తను తినేదానికంటే చాలా తక్కువ తిన్నాడు భీముడు.

"ఈడు ఇంకా తినగల్డండి! కోడి కెక్కరించినట్లు ఈడిలా కాత కాత తిండం నేనెప్పుడూ సూళ్ళేదండి!"

తమ్ముడి పట్ల నారాయుడికి గల అభిమానాన్ని అర్థం చేసుకున్నాడు అభిరామ్.

"చూడు నారాయుడూ! భీముడు భోజనం చేసి ఎన్నాళ్ళయింది? ఇప్పుడే కదా మళ్లీ నాలుగు మెతుకులు కతికగలిగాడు. నాలుగు రోజులాగు... ఎప్పటిలా మీవాడు మామూలు మనిషై పోతాడు"

నారాయుడికి అభిరామ్ ధైర్యం చెప్పాడు.

కాసేపు పిచ్చాపాటీ మాట్లాడి "ఇక పడుకుందాం" అన్నాడు అభిరామ్.

గాజు గ్లాసు, పాల తప్పేలాతో నీళ్లు ఓ స్టూలు మీద పెట్టాడు నారాయుడు.

ఆరుబయట కాక వరండాలో విశాలంగా ఉన్న అరుగు మీద పక్క వేయించుకున్నాడు అభిరామ్.

ఆ పక్కగానే నారాయుడు, భీముడు కూడా పడుకున్నారు.

అర్ధరాత్రివేళ హఠాత్తుగా మెలకువ వచ్చింది అభిరామ్‌కి.

ఏదో తవ్వుతున్న చప్పుడు...!

కనీసం ఇద్దరు మనుషులు గునపాలతో గోడను మెల్లిమెల్లిగా తొలుస్తున్నట్టు శబ్దం వినిపించింది. తల తిప్పకుండా పక్కకు చూపు సారించాడు.

మంచం మీద భీముడు, పక్కగా నేల మీద నారాయుడు గాఢంగా నిద్ర పోతున్నారు.

దృష్టిని ఇటు పక్కకు మళ్లించాడు. తను ఊహించినట్టే ఇద్దరు వ్యక్తులు గునపాలతో గోడకు కన్నం వేయటానికి తవ్వుతున్నారు.

'ఏం చేయాలా' అని ఓ క్షణం ఆలోచించాడు అభిరామ్.

నారాయుడిని నిద్ర లేపటం మంచిదనిపించింది.

వాళ్ళిద్దరూ...!

తనొక్కడూ...!

అందుకే నారాయుడికి మెలకువ రప్పిస్తే, అవసరమయితే ఇద్దరూ కలిసి ఆ దొంగల్ని ఎదుర్కోవచ్చనిపించింది.

నిద్రలో చేయి తగిలినట్లు "ఊఁ" అంటూ పాల తప్పేలాను కింద పారేశాడు.

దభేలున చప్పుడయింది.

తప్పేలాతోపాటు గాజు గ్లాసు కూడా కిందపడి దొర్లి మంచానికి తగిలి ముక్కలయింది. తర్వాత తప్పేలా మీదున్న మూత దడదడా శబ్దం చేసింది.

తప్పేలా కింద పడటంతో నీళ్లు చింది భీముడి మంచం కిందనుంచి నారాయుడి మీద పడ్డాయి.

"ఎవరూ...ఏంటి...ఏంటి" అంటూ హడావుడిగా అరుస్తూ లేచి కూర్చున్నాడు నారాయుడు.

"దొంగలు...దొంగలు" అని అరిచాడు అభిరామ్.

"ఎక్కడ..ఎక్కడ?" అంటూ పక్కనే ఉన్న కర్ర తీసుకొని లేచి నిలబడ్డాడు నారాయుడు.

అప్పటికే అభిరామ్ మంచందిగి దొంగలున్న వైపు రెండు అడుగులు వేశాడు.

తప్పేలా చప్పుడవటంతో దొంగలిద్దరూ గునపాలు అక్కడే వదిలేసి గోడకు ఆన్చిన కర్రలందుకున్నారు.

ఒక్కసారిగా ఇద్దరూ అభిరామ్ మీద పడ్డారు.

"ఎవడ్రా! నా కొడుకు..."

"ఎయ్‌రా... ఎయ్...ఈడెమ్మా..."

దొంగల చేతుల్లో వున్న కర్రలు అభిరామ్ నెత్తిమీద పడ్డాయి.

"అమ్మో" అని అరిచాడు అభిరామ్.

మరో రెండుసార్లు ఆ కర్రలు లేచి అభిరామ్ నడుంమీద పడ్డాయి.

అంతలో నారాయుడు తన కర్రతో వాళ్లిద్దరినీ కలిపి నడుములమీద బల ఒక్క దెబ్బకొట్టాడు.

"సచ్చాంరా నాయనా"

ఇద్దరూ ఒక్కసారే అరిచారు.

నారాయుడు కొట్టిన దెబ్బకి ఇద్దరూ అభిరామ్ మంచం దగ్గరికి తూలి పడ్డారు.

"అయ్య బాబోయ్! అరికాల్లో ఏదో దిగడింది..." అని అరిచాడు వాళ్ళలో ఒకడు.

కిందపడిన వాళ్లని 'పట్టుకోబోయాడు అభిరామ్. అతని తలకి బలంగా దెబ్బలు తగిలాయి. నడుము స్వాధీనంలోలేదు.

అభిరామ్‌ని ఒక్కసారి విదిలించుకొని, అతన్ని గోడకు విసిరికొట్టాడు ఒకడు. ఆ వెంటనే వాడు పారిపోయాడు కర్రతో సహా.

రెండో వాడిని నారాయుడు పట్టుకోబోయాడు కాని, వాడు కూడా అందకుండా తప్పించుకుపోయాడు. వాడి వెంటపడ్డాడు నారాయుడు గట్టిగా బూతులు తిడుతూ!

ఆ హడావుడికి సత్తిరెడ్డి తలుపులు తీసుకొని బయటకు వచ్చాడు.

భీముడు నిస్సత్తువతో అలాగే పడు కొని ఉండిపోయాడు.. మెలకువ వచ్చినా. చుట్టు పక్కల వాళ్లు కూడా కొంతమంది వెంటనే పోగయ్యారు.

సత్తిరెడ్డి బయట లైటువేసి, అభి రామ్‌ని మంచం మీద కూర్చోబెట్టాడు.

అభిరామ్ తలకు బాగా దెబ్బలు తగిలి రక్తం కారసాగింది. గబగబా లోపలికి వెళ్లి తువ్వాలును నీళ్ళలో ముంచి తీసుకు వచ్చి అభిరామ్ తలకు చుట్టాడు సత్తిరెడ్డి.

ఇంట్లోని ఆడవాళ్లు తలుపుల వెనకాల నుంచుని బయటకు చూడసాగారు.

అక్కడ చేరిన వాళ్ళలో ఒకడు పరిగెత్తుకు వెళ్ళాడు – ఆ విషయం రాజారావుతో చెప్పటానికి!

కిటికీ తలుపు చప్పుడవుతూండటంతో వెంటనే మెలకువ తెచ్చుకొని "ఎవరూ?" అని అరిచాడు రాజారావు తలుపుతీస్తూ.

"నేనండే! సత్తిరెడ్డి గారింట్లో దొంగ లడ్డారు. అయిద్రాబాదు డాక్టరుగారికి బాగా దెబ్బలు తగిలాయండే! సత్తిరెడ్డి గారు మిమ్మల్ని పిలుసుకు రమ్మన్నా రండి" అంటూ ఒగరుస్తూ చెప్పాడు ఆ వ్యక్తి.

జానకి అప్పటికే ఉలిక్కిపడి లేచి మెలకువ తెచ్చేసుకుంది.

"జానకీ! తలుపు వేసుకో. భయపడకు నేను ఇప్పుడే వచ్చేస్తాను" అనేసి గబగబా చొక్కా తొడుక్కొని చెప్పులు కూడా తొడుక్కోకుండా బయటకు వచ్చేశాడు రాజారావు.

జానకి తలుపులు వేసేసుకుని మళ్ళీ పడక గదిలోకి వెళ్లిపోయింది.

పరుగులాంటి నడకతో రాజారావు వడివడిగా అడుగులు వేస్తూ సత్తిరెడ్డి ఇంటికి చేరాడు.

పదిమందీ పదిరకాలుగా జరిగిన సంఘటన గురించి గోల గోలగా చెప్పుకో సాగారు.

అప్పటికి నారాయుడు తిరిగి వచ్చేశాడు.

"పారిపోయారండి... ఎదవలు...! డాక్టరుగారి సెయ్యి తగిలి పాలప్పత్తా కింద పడిపోయేసరికి నాకు మెలకువ వచ్చే సిందండి... డాక్టారే దొంగలు దొంగలని అరిశారండి! నేను కఱ్ఱ తీసుకొని ఆళ్లెపెల్లే సరికి ఆళ్లు ఈయన మీదడిపోయి బాదేశారండి! నేను కఱ్ఱతో ఆళ్ళ నడేల మీద ఒక్కటేశానండి! దెబ్బకి కిందడ్డారండి... నా కొడుకులు! మేం ఆళ్ళని పట్టుకోబోయావండి. మమ్మల్ని ఇదిలించుకొని పారిపోయారండి. ఆళ్ళలో ఒకడికి పలిగిపోయిన గాజు గళాసు ముక్క గుచ్చుకున్నట్టుందండి! ఇదిగో సూడండి రక్తం... ఈ పొడుగూతా మరకలేనండి."

నారాయుడు చెప్పినదంతా విని రాజారావు సత్తిరెడ్డి వైపు చూశాడు మౌనంగా.

"ముందీయన్ని ఆసుపత్రికి తీసికెల్లే ఏర్పాట్లు సెయ్యాల రాజారావ్!" అన్నాడు సత్తిరెడ్డి.

"గరువు మీద రిక్షాలేమైనా ఉన్నా యేమో తీసుకురా"

రాజారావు–నారాయుడుతో చెప్పాడు.

"అయ్! ఆ నాకొడుకులు తాగేసి తొంగొని ఉంటారండి! అయినా సూసొత్తా నండి" అంటూ నారాయుడు పరుగు

పరుగున బయలుదేరబోయాడు.

అభిరామ్ బాధతో మూలుగుతూనే నారాయుడిని ఆగమన్నట్లు సైగచేసి దగ్గరకు రమ్మని పిలిచాడు.

"నేను రిక్షాలో కూర్చోవటం కష్టం! నడుముకి బాగా దెబ్బతగిలింది. బండి కట్టించు. పడుకోవటానికి వీలుగా ఉంటుంది" అన్నాడు అభిరామ్.

అతని మాట నూతిలోంచి వస్తున్నట్టు సన్నగా ఉంది.

వెంటనే నారాయుడు గూడు బండిని కట్టే ప్రయత్నంలోపడ్డాడు.

"ఎడ్లకి నీళ్లెట్టి రెండు నిమిషాల్లో బండి కట్టేత్తానండి" అంటూ పెరటి వైపు వెళ్లాడు నారాయుడు.

"అసలిది దొంగల పనేనాని నా అనుమానం" అన్నాడు సత్తిరెడ్డి-రాజారావుని ఉద్దేశించి!

"అదేం? ఆ అనుమానం ఎందుకు వచ్చింది" వెంటనే అడిగాడు రాజారావు

"అళ్లు దొంగతనానికే వచ్చుంటే ఈ ఎపున కన్నం తవ్వుతారా ఎవరైనా? పైగా ఈళ్ళంతా ఇక్కడే పడుకున్నారు కదా! మెలుకువొత్తే పెమాదవని ఆళ్ళకి తెలవదా?"

"నాకా ఆలోచనే రాలేదు. మీరన్నదీ నిజమే. ఎవరేనా కావాలని చేయించి ఉంటారంటారా ఈ పని?"

"అదే నాకూ అర్ధమవట్లేదు! ఈయన మీద కచ్చ కట్టడానికీ ఈయనెవడికే వపకారం సేశాడని! పైగా ఊరిక్కొత్తాయన కూడాను"



సత్తిరెడ్డి అభిప్రాయంతో అక్కడ చేరినవాళ్లు చాలామంది ఏకీభవించారు. కొందరు "అదంతా మీ అనుమానం మాత్రమే" అని కొట్టిపారేశారు.

నారాయుడు బండి సిద్ధం చేసి మైసూరు ఎడ్లని కాడికి కట్టాడు. ఇదివర కెప్పుడూ సత్తిరెడ్డి కోసం, లేదా ఆ ఇంట్లో వాళ్ళ కోసం తప్ప అతను మైసూరు ఎడ్లతో గూడు బండి ఇతరుల కోసం కట్టలేదు.

ఇప్పుడు కూడా – అభిరామ్ కోసం బండి కడుతున్నా ఆయన పరాయివాడని అతనికి అనిపించలేదు.

* * *

అభిరామ్ ఇచ్చిన ఉత్తరాన్ని గోదావరి ఎక్స్ప్రెస్‌లోని ఆర్.ఎమ్.ఎస్.లో పోస్ట్ చేసి ఇంటికి వచ్చి పడుకున్నాడు సూరయ్య.

'తెల్లారు జామునే లేచి పొలానికి నీరెట్టాలి! పెరట్లో సెత్త పేరుకు పోయింది; సుబ్రంం సేయించాలి. ఇంట్లో బియ్యం అయిపోవచ్చాయి... రెండు బత్తాల దాన్యం ఆడించాలి' అంటూ మర్నాడు చేయాల్సిన పనుల్ని ఓసారి జ్ఞాపకం చేసుకొని నిద్రపోయాడు సూరయ్య.

కోడి కూతతో మెలకువ వచ్చింది సూరయ్యకి. హడావిడిగా లేచి చుట్ట ముట్టించి రాజారావు పొలం వెపు వెళ్ళబోయేవాడల్లా "ఇంటికెల్లి గేదెకి గడ్డేసి ఎల్లటం మంచిది" అనిపించి రాజారావు ఇంటిదారిపట్టాడు.

రాజారావు సత్తిరెడ్డి ఇంటికి వెళ్ళాక ఓ గంటసేపు మంచం మీదే అటూ ఇటూ దొర్లింది జానకి.

నిద్రపట్టక ఏవేవో ఆలోచించ సాగింది.

మొదటిసారిగా రాములు తమ ఇంటి దగ్గర పడిపోవటం మొదలుకొని అభిరామ్ ఆ ఊరు వచ్చి మంత్రగాడి 'మహిమ' లను బయటపెట్టటం వరకూ అన్నీ జ్ఞాపకం వచ్చాయి. ఏది నమ్మాలో, ఏది నమ్మకూడదో నిర్ణయించుకోలేకపోతోం దామె.

మంచం దిగి, గది తలుపులు తెరచు కొని దొడ్డి వైపు వెళ్లింది. బాత్‌రూముకు వెళ్ళాలామె. పెరటి గుమ్మం మెట్లు దిగి ఎడమ వెపు నాలుగు అడుగులు వేస్తే బాత్‌రూమ్ వస్తుంది.

కాని...

మెట్లు దిగుతున్నప్పుడు...

తాను రోజూ ముగ్గులు పెట్టే చోటు నుంచి నడుచుకుంటూ వెళ్ళింది. కాళ్ళకు ఏదో గరగరా తగిలినట్లనిపించి వెనక్కి తిరిగి చూసి "ఆఁ" అని ఆశ్చర్య పోయింది జానకి.

ఆ దృశ్యం ఆమె మనసును పూర్తిగా కలచివేసింది.

"ఇక్కడ కూడా..."

అస్పష్టంగా గొణిగిందామె.

పూర్తిగా వెనక్కి తిరిగి అక్కడే గొంతుకూర్చుని, జాగ్రత్తగా నేలమీద చూడసాగింది.

చదరంగా ఓ ముగ్గు...

నాలుగు వైపులా నాలుగు ఎముకలు..

మధ్యలో సున్నాలు, సున్నాలుగా కుంకుమతో ముగ్గులు.

సున్నాల మధ్య ఒక్కో బొగ్గు ముక్క!

వాటి వైపు అలాగే కళ్ళప్పగించి చూస్తూ కూర్చుంది.

బాత్‌రూమ్‌కి వెళ్ళాలన్నమాటే మరిచి పోయింది!

అలాగే కూర్చుండిపోయింది!

పావుగంట తరువాత సూరయ్య రాజారావు పెరటి గుమ్మం దగ్గరకు

వచ్చాడు.

కర్రను తలుపు సందులోంచి దూర్చి గడియ తీశాడు. సూరయ్య రోజూ చేసే పనే అది!

సరాసరి పాకలోని గేదె దగ్గరకు వెళ్లి జల్లలో గడ్డిని సరిచేశాడు.

జల్లచుట్టూ పడిఉన్న నలిగిపోయిన పరకల్ని శుభ్రంచేసి, గేదెని పాకలోంచి బయటకు తీసుకువచ్చాడు.

పాక బయట ఉన్న నిట్టాడుకు గేదెని కట్టేసి, జల్లను బయటకు తీసుకువద్దామనుకున్నాడు.

అంతలో సూరయ్య దృష్టి జానకి మీద పడింది.

"ఏంటి? పాపగోరు అంత ఇసిత్రంగా సూత్తన్నారు" అనుకుంటూ జానకి దగ్గరకు వచ్చాడు.

ముగ్గులు...

ఎముకలు...

బొగ్గులు ..

వాటిని చూస్తూ కళ్లు తేలవేసి కూర్చున్న జానకి..

పరిసితి అర్థమయింది సూరయ్యకి!

"అయ్యగోరూ... అయ్యగోరూ" అని పిలుస్తూ సూరయ్య లోపలికి వెళ్లాడు.

లోపల రాజారావు లేడు.

ఏంచెయ్యాలో అర్థం కాలేదతనికి!

"పాపగోరూ! పాపగోరూ" అంటూ జానకిని పదే పదే పిలిచాడు.

ఆమె ఉలుకూ పలుకూ లేకుండా అలాగే కూర్చుంది.

" అయ్యబాబయ్యబాబోయ్! పాప గారికి సేతబడి జరిగింది."

సూరయ్య లబలబలాడుతూ వీధి తలుపుతీసి బయటకు వచ్చి ఓ క్షణం అటూ ఇటూ చూశాడు.

చుట్టుపక్కలవాళ్లు అప్పుడే నిద్ర లేస్తున్నారు.

అంతలో సత్తిరెడ్డి గూడు బండిని నారాయుడు తోలుకుంటూ రాజారావు ఇంటికి వచ్చి ఆగాడు.

బండిలోంచి రాజారావు కిందకి దిగి "పొలం వెళ్ళలేదా?" అని అడిగాడు సూరయ్యని!

"గేదెకి గడ్డేసి ఎల్దారని ఇటొచ్చానండే! జానకమ్మగోరు మాటా మంతీ లేకుండా అయిపోయారండి! పెరటెంపున్నారండి"

సూరయ్య గబగబా దొడ్డి వైపు పరుగులు తీశాడు.

ఆతృతగా రాజారావు కూడా అతని వెంట వెళ్ళాడు.

సూరయ్య మాటలు విని నారాయుడు కూడా లోపలికి వచ్చాడు.

బండిలో అభిరామ్ ఒక్కడే పరుపు మీద పడుకొని ఉన్నాడు.

ముందుగా రాజారావు ముగ్గుల్ని చూశాడు.

తరువాత జానకిని పట్టి కుదుపుతూ– "జానకీ...జానకీ! పాపా...పాపా!" అని పిలిచాడు.

జానకి బదులు పలుకలేదు. ఆమె పరికిణీ తడిసి ఉంది.

"ఇక్కడ రత్తం మరకలున్నాయేటండి"

నారాయుడు ముందుగా చూశాడు ఆ మరకల్ని.

రాజారావు జాగ్రత్తగా గమనించాడు.

ముగ్గుకు ఓ వైపున నేల మీద రక్తం ఇంకిపోయిన గుర్తులు...

తరువాత ఆ మరకలు దొడ్డి గుమ్మం వరకూ వెళ్ళాయి. అక్కడ నుంచి మరకలు లేవు.

మళ్ళీ ప్రహరీ గోడ మీద ఓ చోట రక్తం మరక ఉంది.

'ఎవరో గోడ దూకి లోపలికి వచ్చి ఉంటారు... ఈ ముగ్గులు పెట్టేసి అలాగే పారిపోయి ఉంటారు' అనుకున్నాడు రాజారావు.

క్షణంపాటు అతనికి బుర్ర పని చేయలేదు.

డాక్టర్ కృష్ణమూర్తి ఊళ్ళో లేడు. గూడెంలో ఆసుపత్రిలో పడి ఉన్నాడు.

ప్రొఫెసర్ అభిరామ్ దెబ్బలు తగిలి ఆసుపత్రిలో చేరటానికి సిద్ధంగా ఉన్నాడు.

ఇంక ఏమాత్రం ఆలోచించదలుచుకోలేదు రాజారావు.

జానకిని రెండు చేతులతోనూ ఎత్తుకొని బండిలో కూర్చోపెట్టాడు. గబగబా లోపలికి వెళ్ళి బీరువా తెరిచి అయిదు వందలు జేబులో పెట్టుకున్నాడు.

సూరయ్యను ఇంటికి కాపలా వుండమని చెప్పి లుంగీతోనే బండెక్కి, బండిని పోనియ్యమన్నాడు. అంతలోనే "ఆగు.. ఒక్కక్షణం ఉండు" అనేసి బండిదిగి, గోవిందయ్య ఇంటికి పరిగెత్తాడు.

ప్రకాశరావు అప్పుడే నిద్రలేచాడు.

"ఒరే! త్వరగా బయలుదేరు. మనం గూడెం వెళ్తున్నాం"

"ఏమిటంత హడావుడి! అసలు విషయం ఏమిటో చెప్పు"

"అభిరామ్‌గారికి దెబ్బలు తగిలాయి. దొంగలు అయిఉంటారని ప్రస్తుతం అనుకొంటున్నాం. మా జానకి కూడా ఉలుకూ పలుకూ లేకుండా అయిపోయింది. మా దొడ్డి గుమ్మంలో పిచ్చి పిచ్చి ముగ్గులు కనిపించాయి. వెంటనే గూడెం వెళ్దాం! ఇద్దర్నీ ఆసుపత్రిలో చేర్పించాలి"

వెంటనే ప్రకాశరావు సైకిలు మీద బయలుదేరాడు.

అప్పటికి ఆ వీధిలో తప్ప మరెవరికీ జానకికి – వాళ్ళ భాషలో చేతబడి జరిగిందని తెలియదు.

కాని...!

బండి చెరువు గట్టుకు వచ్చేసరికి పర్వతాలు, మరికొంతమంది కనిపించారు.

"ఏటండీ! మీ సెల్లెలికి సేతబడి అయిందంటకదా!" అన్నాడు పర్వతాలు.

రాజారావు ఏమీ సమాధానం చెప్పలేదు.

"బండిలో ఇంకెవరో ఉన్నట్టున్నారే"

ఆ ప్రశ్నకి జవాబు చెప్పలేదు రాజారావు.

సైకిలును కాళ్ళతోనే ఆపి, సీటుమీదే కూర్చుని పర్వతాలును, అతనితో ఉన్న జనాన్నీ చూడసాగాడు ప్రకాశరావు.

"నారాయుడూ! బండిపోనీ! ఇప్పటికే ఆలస్యమయిపోయింది" అన్నాడు రాజారావు.

"ఎక్కడికెల్తారండీ! ఊల్లో సుబ్బరంగా మంతరగాడుండగా! ఆసుపత్రుల సుట్టూ తిరిగితే ఏం లాబం? నా మాటిని బండిని పెసిడెంటుగోరింటికి తీసుకెల్లండి! ఆ మంతరగాడు తలుసుకొంటే సిటికలో నయం సేసేత్తాడు..."

రాజారావు కోపం పట్టలేకపోయాడు.

"మా విషయంలో మీ జోక్యం అనవసరం"

"మీ సెల్లెలు ఇసయం మీకు సొయిసయమే కావచ్చు కానీ, సేతబడి జరిగి నోల్లందరికీ తన సేతే తిప్పికొట్టించుకో

పోతే, ఊళ్లో ఎవరికీ నయం సేయనంటు న్నాడు మంతరగాడు. మీ సెల్లెలుకోసం ఊరివాళ్లందరినీ సంపేత్తారా?''

ప్రకాశరావు ఒక్కసారిగా విరుచుకు పడ్డాడు.

"అసలా మంత్రగాడిని తీసుకు రమ్మన్న వెధవ ఎవడు? మీరూ, మీరూ కూడబలుక్కుని తీసుకువచ్చారు. ఇప్పుడు అందర్నీ వాడిదగ్గరికే వెళ్ళమనటానికి మీకేం హక్కు ఉంది? మా ఇష్టం! ఏ రోగాన్ని ఎలా నయం చేసుకోవాలో మాకు బాగా తెలుసు. అడ్డుతప్పుకోండి!''

'వెధవ' అనేమాట పర్వతాలు బృందాన్ని బాగా అవమానపరిచింది.

నలుగురయిదుగురు గబగబా ప్రకాశ రావు చుట్టూ మూగేశారు.

"ఏంటయ్యా? ఏంటి? ఎదవలంటు న్నావ్? ఎవరు ఎదవలు? అసలు నీ ఉద్దేశ మేంటి?''

రాజారావు ఒక్క దూకులో బండి లోంచి ఉరికి ప్రకాశరావు దగ్గరకు వచ్చాడు.

వెంటనే నారాయుడు తొట్టెలోంచి దిగి, తలపాగా దులుపుతూ రాజారావు దగ్గరకు వచ్చి నిలబడ్డాడు.

"చూడండి పర్వతాలుగారూ! గొడవ పడటం అనవసరం. మీ దోవ మీది, మా దోవ మాది. మీకు చేతబడిమీద నమ్మకం ఉంది... మంత్రగాడిని రప్పించుకు న్నారు....పూజలు చేయిస్తున్నారు...! మాకు నమ్మకం లేదు, మేము వైద్యం చేయించుకుంటాం! దయచేసి మీపని మీరు చూసుకోండి... ప్రకాశరావ్! నడు పోదాం! నారాయుడూ...బండెక్కు''

ఎవ్వరి మాటా వినిపించుకోకుండా రాజారావు వెళ్లి బండిలో కూర్చున్నాడు.

...

తెలిసిపోయింది.

''మా బండి నాపిన్నాకొడుకులెవరు? నాయాల్ది తలల్లేసిపోతాయ్'' అంటూ కర్ర పట్టుకుని పరుగెత్తుకు వచ్చాడు సూరయ్య.

''నువ్వు నోరు మూసుకుని ఇంటికి వెళ్లు! అనవసరంగా గొడవల్లో దిగకు''

తీక్షణంగా రాజారావు అలా అనేసరికి సూరయ్య ముఖం చిన్నబుచ్చుకుని వెనక్కు తిరిగాడు.

బండి ముందుకు సాగిపోతోంది.

''గూడెం వెళ్ళగానే ముందుగా నేను మీ అమ్మగారికి టెలిగ్రాం ఇచ్చివస్తాను— వెంటనే రమ్మని''

ప్రకాశరావు మెల్లిగా బండి వెనకాలే సైకిలు తొక్కుతూ అన్నాడు.

''వద్దు! ఆవిడకసలే కంగారు ఎక్కువ. పైగా జానకికి ఇలా జరిగిందంటే ఆవిడ భరించలేదు''

''నువ్వు ఒక్కడివే ఇద్దర్నీ ఎలా చూసుకోగలుగుతావ్? కష్టం కదూ!''

''నేను చూసుకునేదేముంటుంది! ఆసుపత్రిలో నర్సులు ఎలాగూ ఉంటారు. అంతగా అవసరం అయితే మా చంద్ర కళ ఎలాగూ ఉంటుంది''

''ఆఁ...అవును. మరిచేపోయాను. గూడెం వెళ్ళగానే నువ్వువెళ్లి ఆ అమ్మాయిని తీసుకునిరా! నేను హాస్పిటల్ దగ్గర ఉంటాను.''

రాజారావు జానకినే చూడసాగాడు.

ఇంకా ఆమె నోరు, కళ్లు తెరచుకోని ఉండిపోయింది. అప్రయత్నంగా రాజా రావు కళ్ళల్లో నీళ్లు తిరిగాయ్!

'ఈ నాలుగైదు రోజులనుంచి నేను

సరిగా ఇంట్లో ఉండటం లేదు. భయపడి ఉంటుంది పిచ్చిమొహం' అనుకున్నాడు రాజారావు-జానకిని ఉద్దేశించి.

అభిరామ్ సన్నగా మూలుగుతూ అలాగే పడుకొని ఉన్నాడు.

కుదుపులకు అతని తల కదలకుండా జాగ్రత్తగా పట్టుకున్నాడు రాజారావు.

తనవల్ల అభిరామ్‌కు ఆ ప్రమాదం జరగటం అతనికి బాధగా ఉంది.

'అసలీయన్ని తీసుకు రాకుండా ఉండాల్సింది' అనికూడా అనుకున్నాడు రాజారావు.

"మనందరికీ ఏదో మేలు చేద్దామని వచ్చి పాపం ఈయనకూడా ప్రమాదంలో పడ్డాడు'' అన్నాడు రాజారావు ప్రకాశరావుతో!

"అనుకోకుండా జరిగిన సంఘటన ఇది. దానికి ఎవరంమాత్రం ఏం చెయ్యగలం?''

ప్రకాశరావు రాజారావును ఊరడించ సాగాడు.

బండి గూడెం సంతపాకల వరకూ వచ్చాక ''ఇంక నువ్వు చంద్రకళ ఇంటికి వెళ్ళిరా ! నేను ఆసుపత్రికి వెళ్తాను'' అన్నాడు ప్రకాశరావు.

''వద్దులే! ఆసుపత్రికి తీసుకువెళ్ళి, వీళ్ళని అక్కడ చేర్పించాక వెళ్తానులే''

"మీ చెల్లెలు గురించి నువ్వేం బెంగెట్టుకోకు! నేనుజాగ్రత్తగా తీసుకు వెళ్తానులే, నారాయుడెలాగూ ఉన్నాడు. అదీకాక! మేము బండిమీద వంతెన మీదుగా ఆ ఆసుపత్రికి వెళ్లేసరికి నువ్వు చంద్రకళని తీసుకుని అటు వచ్చెయ్యొచ్చు!"

ప్రకాశరావు బలవంతంగా రాజారావును పంపించాడు. రాజారావు సైకిలు మీద అయిష్టంగానే వెళ్ళిపోయాడు.

ప్రకాశరావు బండిలో కూర్చున్నాక నారాయుడు బండిని ఎదరకు పోనిచ్చాడు.

అయిదు నిమిషాల్లో చంద్రకళ ఇంటి ముందు సైకిలు దిగాడు రాజారావు.

అప్పటికే చంద్రకళ నిద్రలేచి వీధి గుమ్మం శుభ్రంచేసి 'పేడనీళ్లు చల్లి ముగ్గులు పెట్టింది.

అంత ఆందోళనగా ఉన్నా ఆ ముగ్గుల్ని చూసి 'ఈవిడకి ఈ ముగ్గులపిచ్చి పోలేదు' అనుకున్నాడు రాజారావు.

వెంటనే జానకి చూసి భయపడిన ముగ్గులు జ్ఞాపకం వచ్చాయి.

చప్పుడు చేస్తూ గేటుతీసి లోపలికి నాలుగు అంగల్లో వెళ్ళి "కళా... కళా" అంటూ గట్టిగా పిలిచాడు.

దుర్గయ్యగారు బయటకు వచ్చి "రా! రా! ఏమిటి ఇంత తెల్లారగట్లే ఇలా వచ్చావ్? అంతా కులాసాయేనా? ఎక్కడికేనా ప్రయాణమా?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించాడు.

"ఆఁ ... ప్రయాణమే! తాడేపల్లి గూడెం" ముభావంగా అన్నాడు రాజారావు.

"మరీ చోద్యం.గూడెం రావటం కూడా ప్రయాణమేనా? తెల్లారి లేస్తే మీ ఊరు ఊరంతా ఇక్కడే ఉంటుందికదయ్యా!"

దుర్గయ్యకి సమాధానం చెప్పే స్థితిలో లేడు రాజారావు.

ఆయన్ని వదిలించుకుని లోపలికి వెళ్ళాడు...చంద్రకళ గదిలోకి.

నోట్సు రాద్దామని అప్పుడే కూర్చున్న చంద్రకళ రాజారావును చూసి కుర్చీలోంచి లేచి తలుపు దగ్గరకు వచ్చింది.

"బావా ! కృష్ణమూర్తిగారికి ఇంకేం ఫరవాలేదు! రెండు, మూడు రోజులలో

ఆయన్ని డిస్చార్జ్ చేస్తారట! ఆయన భార్య వచ్చారు. ఇప్పుడు ఆయన దగ్గిరే ఉన్నారు"

క్రితంరోజున రాజారావు చెప్పినట్లు చంద్రకళ ఆసుపత్రికివెళ్ళి డాక్టర్ కృష్ణమూర్తిని చూసివచ్చి ఆ వివరాలు రాజారావుతో చెప్పింది.

"అదిసరే! నిన్న రాత్రి ఎవరో ఇద్దరు అభిరామ్‌ను కొట్టారు. ఆయన తలకి దెబ్బలు గట్టిగా తగిలాయి. తెల్లారగట్ల ఘనింటి దొడ్లో పిచ్చి పిచ్చి ముగ్గులు జానకి చూసి మాటా, పలుకూ లేకుండా అయిపోయింది. ఇద్దర్నీ ఆసుపత్రికి తీసుకువచ్చాం! ప్రకాశరావు అక్కడ ఉన్నాడు. నేను నిన్ను తీసుకు వెళ్దామని వచ్చాను"

"అయ్యయ్యో! అది కూడా భయపడి పోయిందన్నమాట! అందుకే ముందే చెప్పాను జానకిని ఇక్కడకు పంపించమని! సరే ... సరే! నడు, త్వరగా పోదాం"

చంద్రకళ లోపలికి వెళ్ళి దుర్గయ్య భార్య గోపాలరత్నంతో చెప్పి, చీర మార్చుకుని బయలుదేరింది.

ఆ సందులోంచి రోడ్డెక్కాక రిక్షా దొరికింది.

రాజారావు రిక్షా వెనక సైకిలు తొక్కుతూ ఆసుపత్రికి వచ్చాడు.

అప్పటికే ప్రకాశరావు అభిరామ్‌నూ, జానకినీ ఆసుపత్రికి తీసుకువచ్చేశాడు.

జానకికి ఇంజక్షన్‌చేసి పడుకోబెట్టారు అభిరామ్ గాయాలను శుభ్రంచేసి కట్టు కట్టారు.

"రెండు కుట్లు పడ్డాయి" అన్నాడు డాక్టర్ బయటకు వచ్చి.

ఇద్దరికీ ఫరవాలేదని డాక్టర్ చెప్పాక బయటకు వచ్చారు. చంద్రకళ అక్కడే ఉండిపోయింది.

"ఎందుకైనా మంచిది. ఓసారి ప్రభాకర్‌కి ఫోన్ చేద్దాం" అన్నాడు రాజారావు ప్రకాశరావుతో.

"ఆయన అప్పుడే హైదరాబాద్ చేరి ఉంటాడంటావా?"

ప్రకాశరావు అనుమానంగా అడిగాడు.

"కనీసం విషయమైనా చెబితే, తరువాత మళ్ళీ ఫోన్ చెయ్యొచ్చు"

రాజారావు, ప్రకాశరావు ఓ హోటల్‌కు వెళ్ళారు. ప్రభాకర్ ఇచ్చిన నెంబరుకు ఫోన్ చేశాడు రాజారావు.

"ఇంకా ఊరినుంచి రాలేదండీ" అని జవాబు వచ్చింది అవతలినుంచి.

"వీలైతే అతను రాగానే మాకు ఫోన్ చెయ్యమనండి! మా నెంబర్ నోట్ చేసుకోండి" అని నెంబరు చెప్పి ఫోన్ పెట్టేశాడు రాజారావు.

తరువాత ఆసుపత్రికి వచ్చి కృష్ణమూర్తిని ఓసారి పలకరించి, మళ్లీ చంద్రకళ ఉన్న చోటుకు వచ్చారు ఇద్దరూ.

నారాయుడిని "ఇంక నువ్వెళ్లు! సత్తిరెడ్డి గారితో చెప్పు... ఇద్దరూ కులాసాగానే ఉన్నారని. దోవలో ఎక్కడైనా కాఫీ తాగి వెళ్లు" అంటూ అయిదు రూపాయల నోటు ఇచ్చి అతన్ని పంపించేశాడు.

"ప్రభాకర్ హైదరాబాద్ రాలేదంటే.. ఇంకా అతను వినుకొండలోనే ఉండి పోయాడన్నమాట" అన్నాడు రాజారావు.

"కొండంగి వెళ్లి అక్కడి నుంచి వినుకొండ వెళ్తాడన్నావు కదా! రాత్రి భీమవరంలో బస్సు దొరికిందో లేదో! అయినా కాస్సేపున్న తరువాత మళ్లీ ఫోన్ చేద్దువుగాని..."

ప్రకాశరావు మాటలకు సమాధానం చెప్పకుండా రాజారావు మౌనంగా ఏదో ఆలోచించసాగాడు.

రాత్రి సత్తిరెడ్డి ఇంటి దగ్గర అభిరామ్ మంచం పక్కగా రక్తం మరకలు కనిపించాయి...! తన ఇంటి దగ్గర కూడా రక్తం మరకలు కనిపించాయి. ఈ రెండు సంఘటనలకూ ఏమైనా సంబంధం ఉందా?

రాజారావు ఆలోచనలు ఓ కొలిక్కి రాలేదు.

* * *

భీమవరంలో బస్సుదిగి ఏలూరుపాడు బస్సెక్కాడు ప్రభాకర్.

'అంతా అనుకున్నట్టే జరిగితే రేపీ పాటికి అసలు రహస్యం తెలిసిపోతుంది' అనుకున్నాడు.

పెంటయ్య తండ్రి పేరేమిటో తనకు తెలియదు. పెంటయ్య పేరు చెబితే ఊళ్ళోవాళ్ళు తనకి అతని ఇంటి వివరాలు చెబుతారో లేదో అని ప్రభాకర్ ఆలోచించసాగాడు.

బస్సు దిగి చుట్టూ చూశాడు. కొంత మంది ఎర్ర కంకరరోడ్డు మీద పరుగు పరుగున వెళ్తున్నారు. వాళ్ళంతా తనతోపాటు బస్సుదిగినవాళ్ళే!

"కొండంగి ఎలా వెళ్లాలి?" అని అడిగాడు ఓ వ్యక్తిని.

"అదిగో! ఆళ్ళంతా పరిగెడుతన్నారు కదా! ఆ రోడ్డెమ్మటే ఓ వంద గజాలెల్లారంటే ఉప్పుటేరొ తది! ఆడ తెప్పలుంటాయి. ఏసుకటేపు ఉన్న ఊరే కొండంగి. ఇంతకీ మీదేవూరు?"

కొండంగికి దారి చెప్పిన వ్యక్తి అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పకుండానే కంకరరోడ్డు దోవ పట్టాడు ప్రభాకర్.

అతను ఏటిగట్టుకు వెళ్లేసరికి తెప్ప అటువైపు వెళ్లిపోయింది.

మళ్లీ తెప్ప ఇటువైపు రావటానికి కనీసం పది నిమిషాలు పడుతుంది.

తెప్పనే చూస్తూ నిలబడిపోయాడు.

అంతలో మరో నలుగురు అక్కడికి వచ్చారు.

తెప్ప నడుపుతున్న వ్యక్తిని వాళ్లు కంగారు పెట్టసాగారు.

"రా ఎహె! తొరగా రా! నీయమ్మ తిండి తినేదేటి మద్దాన్న పేళ"

"మీకేం! గెడేసేసరికి సేతులడిపోతన్నాయ్! నేను మాత్తరం ఆడుకుంటన్నానా"

తెప్ప నడుపుతున్న వ్యక్తి నిష్ఠూర మాడాడు. తెప్ప వడ్డుకు వచ్చింది.

ప్రభాకర్‌తోపాటు మిగిలిన నలుగురూ కూడా తెప్ప ఎక్కాక మళ్లీ అది కొండంగి వైపు బయలుదేరింది.

"మీది ఈ ఊరేనా?"

తనవైపు ఆశ్చర్యంగా, కొత్తగా చూస్తున్న ఆ నలుగురినీ అడిగాడు ప్రభాకర్.

తమకంటె శుభ్రంగా ఉన్న దుస్తుల్ని వేసుకొన్న ప్రభాకర్ తమను పలకరించటమే గొప్ప అనుకున్నారు ఆ నలుగురూ!

"అవునండీ! మా ఊరికి రావటం మీకు కొత్తాండి?" ఒకతను అడిగాడు.

"అవును! మాది తాడేపల్లి గూడెం. కొండంగిలో పెంటయ్య అని ఒకతను ఉంటాడు. అతని ఇల్లు ఎక్కడో తెలుసా మీకు?"

ప్రభాకర్ ప్రశ్నకి వాళ్ళలో వాళ్ళు గుంపు తెంపులు పడ్డారు.

"ఏ పెంటయ్య?"

"ఆ పల్లవెంపు ఉండేవాడు ఆడే నేమో!"

"ఆడు ఈ ఊర్నించెల్లిపోయి శాన్నాళ్ల యింది కదా"

అంతలో వాళ్ళలో ఒకడు ప్రభాకర్ని అడిగాడు "ఆడెలా ఉంటాడండి" అని.

కంగారుపడ్డాడు ప్రభాకర్!

"అదే–కొంచెం పొట్టిగా, నల్లగా... నిక్కర్లు వేస్తాడు"

నోటికి వచ్చింది చెప్పాడు.

"అయితే ఆడే! అదేనండి. తెప్ప దిగి



తిన్నగా రోడ్డెంబెల్లిపోండి. ఊరు సివర కొన్ని గుడిసెలుంటాయండి. ఆడకెల్లి ముసలినరిసిగాడిల్లు ఎక్కడని అడగండి! ఎవరుపడితే ఆల్లే సెబుతారు"

'పెంటయ్య తండ్రి పేరు నరిసిగా డన్నమాట' అనుకున్నాడు ప్రభాకర్.

రోడ్డుమీద ఓ ఫర్లాంగు దూరం నడిచాక పాతిక, ముప్పై గుడిసెలు కనిపించాయి. తెప్పలో తనతోపాటు వచ్చిన వాళ్ళ ద్వారా - పెంటయ్య చాలాకాలం క్రితమే ఊరు వదిలి వెళ్ళిపోయినట్లు ధృవపరుచుకున్నాడు ప్రభాకర్.

మరొకర్ని అడిగి నరిసిగాడి గుడిసె దగ్గరకు వెళ్లాడు.

బయట గుంజకు రెండు మేకలు కట్టేసి ఉన్నాయి. లేత రావిఆకులు నములుతూ, ఓసారి తల పైకెత్తి ప్రభాకర్‌ని చూసి మళ్ళీ రొట్ట నమలటంలో నిమగ్నమయిపోయాయవి.

"పెంటయ్యా! పెంటయ్యా!"

కావాలనే పెంటయ్యను పిలిచాడు ప్రభాకర్.

"ఎవరూ? వత్తన్నా..."

అరవై ఏళ్ల పైబడ్డ ముసలాడు గుడిసెలోంచి బయటకు వచ్చాడు.

చాలా కాలమయింది ఆ గుడిసె దగ్గర పెంటయ్య పేరు వినిపించి...!

నరిసిగాడు బయటకు రాగానే "పెంటయ్య లేడా ?'' అనడిగాడు ప్రభాకర్.

''ఆడు ఈ ఊర్ని, ఈ గుడిసినీ వదిలిపెట్టి ఎల్లిపోయి శానాల్లయిందిబాబూ! మీరెవరండి?''

''మాది తాడేపల్లిగూడెం! నెల్లాళ్ళ క్రితం పెంటయ్య మా కొట్టు దగ్గిరకి వచ్చాడు. ఉద్యోగం ఏదేనా ఇప్పించమన్నాడు. మాకు ఓ రైస్‌మిల్లు కూడా ఉంది. కాని, పెంటయ్య నా దగ్గరకి వచ్చే నాటికి ఆ మిల్లు ఇంకా పనిచేయటం ప్రారంభించలేదు. రేపు మిల్లుకు ప్రారంభోత్సవం చేస్తాం ! నేనేదో పనిమీద ఏలూరుపాడు వచ్చాను. మీవాడు జ్ఞాపకంవచ్చి, వాణ్ణి మిల్లులో పెడదామనుకుని ఇలా వచ్చాను. ఇదివరకు వాడు నన్ను కలిసినపుడు చెప్పాడు తనది కొండంగి అని''

''ఆడు మాక్కనిపించి సంవచ్చరాల మీద సంవచ్చరాలయి పోయాయండి ! నెల్లాల్ల ముందు మీక్కనిపించాడంటే నమ్మబుద్ధి కావట్లేదండి''

''నిజంగానే నాదగ్గరకి వచ్చాడు. లేకపోతే నేను ఇక్కడికి ఎలా రాగలను? పోన్లే-ఎవడో ఒకడు దొరుకుతాడనుకో మాకు! మంచివాడిలా కనిపించాడు... పనిద్దామనుకున్నాను. సర్లే వెళ్తాను"

ప్రభాకర్ బయలుదేరబోయాడు.

"ఆగండాగండి! నా మాటబద్ధమనుకోకండి! ఆడు నిజంగానే ఈ ఊర్నించెల్లి శానాల్లయిందండి. నెల నెలా పాతికో పరకో పంపిత్తన్నాడండి... కావాలంటే సూడండి...'' అంటూ గబగబా గుడిసెలోపలికి వెళ్ళి మనియార్డరు ఫారాలకింద పెంటయ్య రాసిన ఉత్తరాలు తీసుకు వచ్చాడు.

అయిష్టంగా తిరగవేసినట్లు వాటిని అటూ ఇటూ చూశాడు ప్రభాకర్.

వాటిని చూస్తూనే ... ''పెంటయ్య వాళ్ళ అమ్మ లేదా?'' అని అడిగాడు నరిసిగాడిని.

''ఉందండి...ఈ పక్క దుకానానికి ఎలిందండి" అంటూ ఆ దుకాణం ఉన్న

వైపు తిరిగి చూపించాడు నరిసిగాడు.

ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని ఒకటి రెండు మనియార్డరు కూపన్లను జేబులో పెట్టుకున్నాడు ప్రభాకర్.

''సర్లే! పెంటయ్య వస్తే చెప్పు. గూడెం నుంచి రాంబాబు గారొచ్చారని'' అనేసి గబగబా వెనక్కి తిరిగి ఏరు ధగ్గరకు వచ్చి తెప్ప ఎక్కి ఏలూరుపాడు చేరాడు.

అప్పటికి రాత్రి ఎనిమిదయింది.

హడావుడిగా ఏలూరుపాడు బస్టాండులో అడిగాడు.

''భీమవరం వెళ్ళటానికి లాస్ట్ బస్ ఎన్నింటికి'' అని...

"వచ్చేత్తదండి! టయివయిపోయిందండి" కిళ్ళీకొట్లో వ్యక్తి నిర్లక్ష్యంగా జవాబు చెప్పాడు.

అతనికి అలసటగా ఉన్నట్లనిపిస్తోంది. కాని ఉత్సాహంగా కూడా ఉంది.

సోడా కొట్టించుకుని తాగాడు.

హుషారుగా ఓ సిగరెట్టు వెలిగించుకుని జేబులోంచి మనియార్డరు కూపన్లు బయటకు తీశాడు.

'ఉభయ కుశలోపరి'తోనే కమ్యూనికేషన్ కూపన్లు నిండిపోయాయి. వెనక వైపున పెంటయ్య ఎడ్రసు 'కేరాఫ్ వై. పురుషోత్తం, అరుణా పిక్చర్‌ప్యాలెస్ పక్క సందు, వినుకొండ' అని ఉంది.

బస్సు రావటంతో ప్రభాకర్ హడావుడిగా బస్సెక్కేశాడు.

తొమ్మిదింటికి భీమవరం వచ్చిందా బస్సు. దగ్గర్లో ఉన్న హోటల్‌లో భోజనం చేసి తొమ్మిదిన్నరకు బెజవాడ వెళ్ళే బస్సు ఎక్కాడు.

కిటికీ పక్క సీటు దొరకడంతో చల్లగాలికి మాగన్నుగా నిద్ర పట్టేసింది ప్రభాకర్‌కి.

ఒంటిగంటన్నరకి బస్సు బెజవాడ చేరింది.

ఓ లారీ పట్టుకొని వినుకొండ వెళ్ళాడు ప్రభాకర్.

వినుకొండలో లారీ దిగేసరికి మూడయింది.

రిక్షామీద అరుణా పిక్చర్ ప్యాలెస్ సందు వరకూ వెళ్ళాడు.

రిక్షా తొక్కిన వ్యక్తినే అడిగాడు 'పురుషోత్తం ఇల్లెక్కడ' అని!

''బూతవైజ్జం చేత్తాడు...ఆయనేనండి! ఈ సైకిలు సాపు తరవాతిల్లేనండి'' అనేసి అతను వెళ్ళిపోయాడు.

'ఇంత రాత్రివేళ అతనింటికి వెళ్ళటం మంచిదా కాదా' అని ఆలోచించాడు.

రాత్రివేళ నిద్రలో లేపి హడావుడి చేయటమే మంచిదని నిర్ణయించుకొని తలుపు గొళ్ళాన్ని చప్పుడు చేశాడు నాలుగైదుసార్లు.

జవాబురాలేదు.

మళ్ళీ తలుపుతట్టాడు.

"ఎవరూ?"

బొంగురు కంఠం నిద్ర బద్ధకంతో ప్రశ్నించింది.

"నేను...! ఓసారి తలుపు తీయండి"

ఆమె తలుపు తీసింది.

"పురుషోత్తంగారి భార్య మీరేనా?"

"అవును"

''నన్ను పురుషోత్తంగారు పంపించారు"

"ఎందుకు?"

"అదే! ఆయనిప్పుడు ముదునూరులో ఉన్నారు."

''నాకు తెలుసు"

"అక్కడ పురుషోత్తంగారికీ, ఊరి పెద్ద రెడ్డినాయుడికీ డబ్బుదగ్గర ఏదో గొడవ వచ్చిందండి! ఆ గొడవ తేల్చుకోవటానికి నాయుడు తనకు రాసిన ఉత్తరాలు ఇంట్లో ఉన్నాయి పట్టుకు రమ్మని నన్ను పంపించారండి"

"లోపలికి రండి''

ఆమె అడ్డు తొలిగాక ప్రభాకర్ లోపలికి అడుగుపెట్టాడు.

హాలు విశాలంగా ఉంది.

ఎదురుగా గోడమీద కాళికాదేవి ఫొటో భయంకరంగా ఉంది. ఫొటో కుంకుమ, గంధంతో నిండిపోయింది.

ఎండి రాలిపోయిన గంధం మరకల వెనుక నుంచి కాళికాదేవి బొమ్మ అస్పష్టంగా కనిపిస్తోంది. మిగిలిన గోడలకు రకరకాల కాలండర్లు, ఫొటోలు ఉన్నాయి.

రాజకీయనాయకులతోనూ, సినిమా నటులతోనూ కలిసి తీయించుకున్న ఫొటోలు పది-పదిహేను వరకూ కనిపించాయి.

టేబులు ముందున్న కుర్చీలో కూర్చున్నాడు ప్రభాకర్.

యధాలాపంగా టేబుల్ మీదకు దృష్టి మళ్లించి గతుక్కుమన్నాడు.

పెద్దపుర్రె, దాని చుట్టూ ఎముకలు నలుచదరంగా పేర్చి ఉన్నాయి.

తన బండారం బయటపడుతుందేమోననే భయానికి ఆ పుర్రె, ఎముకలు వగైరాలు చూడటం వల్ల కలిగిన భయం తోడైంది.

గుండె దడదడలాడుతోంది.

ఆ హాలులో ఓ మూలగా నేలమీద చిన్న చొక్కా కనిపించింది.

'అంటే...పురుషోత్తానికి ఓ పిల్లాడు ఉన్నాడన్నమాట' అనుకున్నాడు.

వెంటనే అతనికో ఆలోచన వచ్చింది.

పురుషోత్తం భార్య లోపలి గదిలోంచి ఉత్తరాలకట్ట తీసుకువచ్చింది.

"మీ అబ్బాయికి ఏదేనా కొని తీసుకు వెళ్ళమని పురుషోత్తంగారు నాకు పది రూపాయలు ఇచ్చారు. హడావుడిలో మరిచిపోయాను" అంటూ పది కాగితం ఆమెకుఇచ్చి "రేపైనా మీరు కొనివ్వండి" అన్నాడు.

ఆమె ఆ నోటు అందుకుంది.

పిల్లాడి సంగతి ప్రస్తావించటంతో ప్రభాకర్‌ను పురుషోత్తమే పంపాడనుకుంది ఆమె.

ఉత్తరాల కట్టను విప్పి తనకు కావలసిన ఉత్తరాల కోసం వెదకసాగాడు.

'కె. రెడ్డినాయుడు, ముదునూరు, తాడేపల్లిగూడెం తాలూకా, ప. గో. జిల్లా' అని ఫ్రమ్ ఎడ్రసున్న ఉత్తరాలు తీసి పక్కన పెట్టాడు. మొత్తం ఆరు ఉత్తరాలున్నాయి.

"ఇవే ఆ ఉత్తరాలు" అన్నాడు ప్రభాకర్.

ఆమె ఏమీ మాట్లాడలేదు.

గబగబా ఆ ఉత్తరాల్లో ఉన్న విషయాలను పైపైన చదివాడు. అతని కళ్ళు మెరిశాయి. "నాలుగు గంటలకు బస్సు ఉంది. మరి నేను వెళ్తాను" అన్నాడు ఆమెతో.

'ఊ' అన్నట్టు తలూపిందామె.

ఉత్తరాలు తీసుకొని పరుగులాంటి నడకతో రోడ్డు మీదకు వచ్చేసి జనంలో కలిసిపోయాడు ప్రభాకర్.

బస్టాండ్‌కు రిక్షాలో వచ్చి అక్కడినుంచి బస్సులో గుంటూరు వచ్చేశాడు.

అప్పటికి ఉదయం ఏడయింది.

ఓ హోటల్లో కాఫీ తాగి 'హమ్మయ్య' అనుకున్నాడు

ఎనిమిది గంటలకు హైదరాబాద్ బస్సులో కూర్చున్నాడు ప్రభాకర్.

తీరిగ్గా ఉత్తరాలు తీసి చదివాడు.

'మొత్తం మీద నా ప్రయత్నం ఫలించింది' అనుకున్నాడు.

దాదాపు రెండు గంటలకు హైదరాబాదు వచ్చింది బస్సు.

సరాసరి ఇంటికి వెళ్ళాడు.

ఇంటి ఓనరు—"ఇవాళ పొద్దున్న ఎనిమిది గంటలప్పుడు నీకు ఫోను వచ్చింది తాడేపల్లిగూడెం నుంచి. ఎవరో రాజారావుట! ఫోన్‌చేసి నువ్వు కావాలని అడిగాడు. లేవని చెప్పాను. మళ్లీ ఫోన్ చేస్తానన్నాడు. తన నెంబరు ఇచ్చాడు" అని చెప్పి రాజారావు చెప్పిన నెంబరున్న కాగితాన్ని ఇచ్చాడు.

వెంటనే ఆ నెంబరుకు ఫోన్ చేశాడు ప్రభాకర్.

అవతలినుంచి రాజారావు లేడనీ, కాస్సేపట్లో వస్తాడనీ చెప్పారు.

"నా పేరు ప్రభాకర్! హైదరాబాదు నుంచి ఫోన్ చేశానని చెప్పండి."

ఓ గంటపోయాక మళ్లీ ఫోన్ చేస్తాను. ఈలోగా ఆయనే వస్తే నాకు ఫోన్ చేయమని చెప్పండి'' అని ఫోన్ పెట్టేసి తన గదిలోకి వెళ్లిపోయాడు.

స్నానంచేసి, భోజనమైనా చెయ్యకుండా కాస్సేపు అలాగే పడుకున్నాడు.

అరగంట తరువాత మెలకువ వచ్చింది. బయటకు వద్దామని తయారయ్యాడు.

అంతలో రాజారావు ఫోన్ చేశాడు.

''ఎప్పుడొచ్చావు హైదరాబాదు?''

''అరగంటయి ఉంటుంది! ఎందుకు ఫోన్ చేశావుట?"

"ఇక్కడ చాలా గొడవలు జరిగిపోయాయి. ప్రొఫెసర్ అభిరామ్‌కి దెబ్బలు తగిలాయి. ఆసుపత్రిలో చేర్పించాను. గూడెంలోనే ఉన్నామిప్పుడు. నీ వ్యవహారం ఎక్కడిదాకా వచ్చింది?"

"అక్కడికి వచ్చినపుడు చెబుతాను. అంతా సక్సెస్. రాత్రికి గోదావరిలో గూడెం వస్తున్నాను...స్టేషనుకి రా''

"అలాగే''

వెంటనే ఆఫీసుకు వచ్చాడు ప్రభాకర్.

అప్పటికి అభిరామ్ రాసిన ఉత్తరం అందింది. ఉత్తరాన్ని ఇంగ్లీషులో రాశాడు అభిరామ్. దాని సారాంశం-

'ముదునూరులో చేతబడి జరిగిందని ఆ ఊళ్ళోవాళ్ళంతా అనుకుంటున్నారు. ఆ కేసులన్నింటినీ నేను పరిశీలించాను. చేతబడి అనేది సైన్సుకు అందని విషయం. ఇప్పుడు ముదునూరులో ఇంతమంది ఇన్ని రకాలుగా ప్రవర్తించటానికి కారణం వారంతా హిస్టీరియాకు గురవటం! వైద్య పరిభాషలో ఈ స్థితిని 'మాస్ హిస్టీరియా' అంటారు. ఇవన్నీ న్యూరోటిక్ సింప్టమ్స్. భయాలూ,భ్రాంతులూ,మూఢనమ్మకాలవల్ల ఇలాంటి పరిస్థితి కలుగుతుంది. తరతరాలుగా మనలో పేరుకుపోయిన నమ్మకాలను ఆధారంగా చేసుకొని కొంతమంది ప్రయత్నపూర్వకంగా ఊళ్ళోవాళ్ళని ఈ భయాలకు గురిచేశారని అనిపిస్తోంది. చేతబడి చేసే విధానం అలాగే ఉంటుంది. మనుషుల బలహీనతలను సొమ్ము చేసుకోవటం చేతబడిలోని ప్రధానాంశం! వీళ్లని ఇదే స్థితిలో కొంతకాలంవదిలేస్తే ఫోబియాలకు లోనవుతారు. ఆ తర్వాత పరిస్థితి మరీ క్షీణిస్తుంది. ఈలోగానే ప్రభుత్వం పూనుకొని వీళ్ళని మెంటల్ హాస్పిటల్‌లో

చేర్పించి ట్రీట్‌మెంట్ ఇప్పించటం అన్ని విధాలా మంచిది' అని!

ప్రభాకర్ ఆ ఉత్తరంలోని విషయాలను, తాను సేకరించిన సమాచారాన్ని కలగలిపి ఓ న్యూస్ రాసిచ్చాడు. అది ఇలా నడిచింది. 'తాడేపల్లిగూడెం సమీపంలోని ముదునూరులో కొంతమంది చేతబడికి గురయినట్లు వచ్చిన వార్తలను ప్రఖ్యాత మానసిక శాస్త్రజ్ఞుడు ప్రొఫెసర్ అభిరామ్ ఖండించారు. వారి ప్రవర్తనలకు కారణం హిస్టీరియా అనీ; భయాలు భ్రాంతులవల్ల, మూఢ నమ్మకాలవల్ల కొంతమంది హిస్టీరియాకు గురయ్యారనీ, ఇదే పరిస్థితి మరికొంతకాలం కొనసాగితే ఊరు ఊరంతా మాస్ హిస్టీరియా ప్రభావంలో పడగలదనీ ఆయన తెలియజేశారు. ఊళ్ళో జరిగిన ఈ సంఘటనలకు రాజకీయ కారణాలు ఉన్నట్లు తెలుస్తోంది. ఊరి పెద్దలలో ఎవరో కావాలని ఈ ప్రయోగం చేయించినట్లు ఊళ్ళోనే కొంతమంది అనుకుంటున్నారు'.

కొన్ని పరిస్థితులకు లోబడి ప్రభాకర్ ఆ వార్తను అలా రాశాడు.

తాను సేకరించిన సమాచారాన్ని ఎడిటర్‌కు చూపించాడు.

ఆ రుజువులు, సాక్ష్యాలు పోలీసులకు అందజేయటమో లేదా ఆ ఊరి పెద్దలకు ఇచ్చి వాళ్ళచేత పోలీసులకు రిపోర్టు చేయించటమో చేయమని ఎడిటర్ సలహా ఇవ్వటంతో ప్రభాకర్ ముదునూరు వెళ్లి రెండురోజులలో వచ్చేస్తాననిచెప్పి ఆఫీసు నుంచి బయటకు వచ్చాడు. తనకి కావలిసిందదే! ఎలాగైనా ముదునూరు వెళ్ళాలి.

అప్పటికి టైము అయిదయింది.

ప్రొఫెసర్ అభిరామ్ ఇంటికి ఫోన్ చేసి తాను మళ్ళీ ముదునూరు వెళ్తున్నాననీ, ఏమైనా విశేషాలు చెబితే అభిరామ్‌కు అందజేస్తాననీ అడిగాడు. ఆయనకు ప్రమాదం జరిగిన సంగతి అభిరామ్ భార్యకు చెప్పలేదు. ఆమె అనవసరంగా కంగారుపడుతుందని ప్రభాకర్ భయం!

త్వరగా తిరిగి వచ్చెయ్యాల్సిందని చెప్పమని చెప్పిందామె.

అభిరామ్‌కు దెబ్బలు తగిలాయని చెప్పకపోవటం వల్ల తానేదో తప్పు చేసినట్లు బాధపడ్డాడు ప్రభాకర్.

తన పలుకుబడి ఉపయోగించి ఆ రాత్రి గోదావరికి రిజర్వేషన్ సంపాయించాడు.

రెండు రోజుల నుంచి సరిగా నిద్రపోకపోవటంతో, హాయిగా నిద్రపోయాడు.

బెజవాడలో మెలకువ వచ్చిందతనికి.

నాలుగు గంటల ప్రాంతంలో గోదావరి ఎక్స్‌ప్రెస్ తాడేపల్లిగూడెం వచ్చింది.

రాజారావు హడావుడిగా బోగీలు వెదుకుతూ కనిపించాడు.

"ఇదిగో! ఇక్కడ! రాజారావు... ఇటు...ఇటు" అని అరిచాడు ప్రభాకర్.

పరుగుపరుగున అటు వెళ్ళాడు రాజారావు. స్టేషన్‌లోంచి బయటకు వచ్చి రిక్షా ఎక్కారు ఇద్దరూ.

సత్తిరెడ్డి ఇంట్లో దొంగలు పడటం, అభిరామ్‌కు దెబ్బలు తగలటం, జానకి కూడా భయపడి బాహ్య స్మృహ కోల్పోవటం-ఇవన్నీ చెప్పాడు రాజారావు.

ఇద్దరూ ఆసుపత్రి దగ్గర రిక్షా దిగారు. ప్రకాశరావు వాళ్ళిద్దరి కోసం ఎదురు చూస్తున్నాడు ఆసుపత్రి బయట.

అభిరామ్‌కు మెలకువ వచ్చింది.

ప్రభాకర్‌ని చూసి "ఎప్పుడు వచ్చావ్?"

అని అడిగాడు అభిరామ్.

అంతక్రితమే వచ్చినట్టు చెప్పి తాను సేకరించిన సమాచారం గురించి చెప్పాడు.

చంద్రకళ కూడా ఆ విషయాలన్నింటినీ వింది.

ఉత్తరాలు తీసి చదివి వినిపించాడు.

"రెడ్డినాయుడు ఇంత పని చేశాడా?"

ఆశ్చర్యపోయాడు ప్రకాశరావు.

"నేను ముందే చెప్పానుగదా! ఈ కేసు బయటపడింది కనుక తెలిసింది. బయట పడని కేసులు ఎన్నో ఉన్నాయి. ఒక్కొసారి మాంత్రికులే డబ్బుకోసం స్వయంగా ఇలాంటి పన్లు చేస్తూంటారు" అన్నాడు అభిరామ్.

"అయితే ఇప్పుడేంచేద్దాం?"

ప్రకాశరావు రాజారావును అడిగాడు.

ఏం చెయ్యాలో కూడా ప్రభాకర్ చెప్పాడు-

"ఈ ఉత్తరాలను సత్తిరెడ్డి, గోవిందయ్య, బ్రహ్మంతాత వగైరా పెద్దలకు చూపిద్దాం. వాళ్లే నిర్ణయిస్తారు ఏం చెయ్యాలో! నా ఉద్దేశం పోలీసులకు రిపోర్టు ఇవ్వటం మంచిదని! ఈ ఉత్తరాల ఆధారంగా వాళ్లిద్దర్ని అరెస్టుచెయ్యొచ్చు"

ప్రభాకర్ సలహా రాజారావుకు నచ్చింది. జానకి మామూలు మనిషయింది. కాని నీరసంగా ఉండటంతో ఆసుపత్రిలోనే మరో రోజు ఉంచమని డాక్టరు చెప్పాడు.

చంద్రకళ ఆమె దగ్గర ఉండిపోయింది.

ప్రభాకర్, రాజారావు, ప్రకాశరావు- ముగ్గురూ ముదునూరు బయలుదేరి వచ్చారు.

వాళ్లు సరాసరి సత్తిరెడ్డి ఇంటికి వెళ్లారు. విషయాన్ని సత్తిరెడ్డికి చెప్పాడు

రెడ్డినాయుడు - మంత్రగాడు పురుషోత్తానికి రాసిన ఉత్తరాలను చదివి వినిపించాడు-

'మహారాజశ్రీ పురుషోత్తంగారికి,

రెడ్డినాయుడు రాయించెడి విషయాలు ఏమనగా-

మరో అయిదారు నెలల్లో పంచాయితీ ఎన్నికలు జరుగుతాయని పేపర్లలో వార్తలు వస్తున్నాయి. ఈసారి నేను పోటీ చేస్తే గెలవగలననే నమ్మకం కనిపించటం లేదు. ఊళ్ళో రాజారావు అనే మరో వ్యక్తి కూడా పోటీ చేయటానికి సిద్ధంగా ఉన్నాడు. వాడు కనుక పోటీచేస్తే, వాళ్ల వాళ్ళు అందరూ నెగ్గుతారు. అప్పుడు నాకు సర్పంచి పదవి రాదు.

అందువల్ల మీరు మా ఊళ్ళో చేతబడి ప్రయోగం చేయండి. మళ్ళీ మీరే వచ్చి విరుగుడు చేద్దురుగాని. మిమ్మల్ని నేనే మా ఊరు తీసుకువచ్చి పూజలు వగైరాలు చేయిస్తాను. అలా చేయటం వల్ల నాకు పలుకుబడి పెరుగుతుంది. ఊరివాళ్ళందరి మేలుకోరి నేను మీచేత పూజలు చేయించినట్లు అందరికీ ప్రచారం చేసుకుంటాను. మీరు ఈ పని చేసినందుకు మూడువేల రూపాయలు ఇస్తాను. ఏ విషయమూ వెంటనే ఉత్తరం రాయించగోర్తాను,

ఇట్లు
కె. రెడ్డినాయుడు

మరో ఉత్తరం అందుకున్నాడు ప్రభాకర్.

'మహారాజశ్రీ పురుషోత్తంగారికి,

రెడ్డినాయుడు రాయించు విషయాలు ఏమనగా-

మీరు రాసిన ఉత్తరం అందినది. మీరు కోరినట్లు మీకు సాయం చేయటానికి

ఇద్దరు నమ్మకస్తులు ఇక్కడ ఉన్నారు. వాళ్ళిద్దరూ మీ ఊరువాళ్లే. ఒకడు నా దగ్గరే పని చేస్తున్నాడు. రెండోవాడు కూడా మనం చెప్పినట్లు వింటాడు. వాళ్ళకి ఈపని చేయటానికి తలో రెండు వందలు ఇస్తానని చెప్పాను. ఇద్దరూ సరేనన్నారు. మీరు ఎప్పుడు వాళ్ళని అక్కడకు పంపమంటే అప్పుడు పంపుతాను. వెంటనే ఉత్తరం రాయించగలరు.

ఇట్లు
కె. రెడ్డినాయుడు'

మూడవ ఉత్తరం ప్రారంభించాడు ప్రభాకర్.



'మహారాజశ్రీ పురుషోత్తంగారికి,

రెడ్డినాయుడు రాయించు విషయములు ఏమనగా—

సీతయ్య, నాగులు మీరు చెప్పినట్లు పని ప్రారంభించారు. మీరు బయానా పంపమన్నారు. వెయ్యి రూపాయలు ఓ మనిషిచేత మీకు రేపే పంపిస్తాను. అందినట్లు చీటీ రాసి ఇవ్వండి. మావాడితో మీరు ఏ వివరాలూ చెప్పవద్దు.

ఇట్లు
కె. రెడ్డినాయుడు'

మిగిలిన ఉత్తరాల్లో పురుషోత్తం హైదరాబాద్ చుట్టుపక్కలకు పనిమీద వెళ్లినట్లు, అవసరాన్ని బట్టి తానే వచ్చి అతన్ని కలుస్తానన్నట్లు రాసి ఉంది.

అభిరామ్‌కూ, జానకికీ ఎలా ఉందో అడగాలని అప్పటికే చాలా మంది సత్తిరెడ్డి ఇంటికి చేరారు.

ప్రభాకర్ చదివిన ఉత్తరాలన్నీ వాళ్ళు విన్నారు. అందరికీ వళ్ళు



మండిపోయింది.

"ఇంత నాటకమాడాడా ఆడు"

"ఇలాంటోళ్లుండబట్టే ఈ ఊరిలా అదోగతిలో ఉంది"

"నాకొడుకుని ఈడ్సి తన్నాండెహె!".

"మనం సెయ్యి సేసుకొంటే ఆనక పోలీసోళ్ళ గొడవలుంటాయేమో''

''గాడిదగుడ్డు ! ఎవడడ్డొస్తాడో చూత్తా''

ఒక్కొక్కడూ ఒక్కోరకంగా వ్యాఖ్యానించసాగారు. క్రమక్రమంగా జనం పెరుగుతున్నారు.

రణగొణధ్వనీ పెరుగుతోంది.

ప్రతి ఒక్కడూ అసలు విషయం తెలుసుకుంటున్నాడు.

"అసలా మంతరగాణ్ణి తన్నాలి! దొంగ...కొడుకు! డబ్బుకాశపడి మనుసుల పేణా లీత్తాడా?''

"నడండెహె! నడండి. ఈ ఎవ్వారం అటో ఇటో ఇయాలే తేలిపోవాల!''

"నాయుణ్ణి మెళ్లోసెయ్యెట్టి డబ్బ వసూలు సెయ్యాల. ఆడి పదవి కోసం ఊరోళ్ళ దగ్గర సందాలొసూల్చేసి మేర్బానీ సూపిత్తాడా?''

"రాజారావు ముందర్నించీ సెపుతూనే ఉన్నాడు. ఎవడైనా ఇంతేనా?"

సత్తిరెడ్డి ఇంటిదగ్గర జరుగుతున్న హడావుడి రెడ్డినాయుడికి తెలిసింది..

అగ్గిమీద గుగ్గిలమయిపోయాడు రెడ్డినాయుడు.

"అసలాదెవడు ఈ ఊరిసయాలు పట్టించుకోడానికి! ఆ కుర్రనాకొడుకుని మల్లీ లేవకుండా తన్నండి ... ఒరే సీతిగా! ఎల్లరా ఎల్లు! మనోల్లందర్నీ తీసుకెల్లు"

చిందులుతొక్కసాగాడు రెడ్డినాయుడు.

సీతయ్య, నాగులు, పర్వతాలు మరికొందరు కర్రలు తీసుకొని పరుగు పరుగున సత్తిరెడ్డి ఇంటికి బయల్దేరారు.

సత్తిరెడ్డి ఇంటి దగ్గర్నుంచి రెడ్డినాయుడి ఇంటికి బయలుదేరినవాళ్ళు ఓ పక్కనుంచి, రెడ్డినాయుడి ఇంటిదగ్గర్నుంచి సత్తిరెడ్డి ఇంటికి బయలుదేరినవాళ్ళు మరో పక్కనుంచీ వెళ్ళారు.

నారాయుడు, సూరయ్య, ప్రకాశరావు, ఊళ్ళో మరికొందరు రెడ్డినాయుడి ఇంటికి వెళ్లేసరికి మంత్రగాడు ఓ గదిలో నలుగురిని కూర్చోబెట్టి ప్రయోగం చేస్తున్నాడు.

అంతకు రెండు రోజులముందు అయిదుగురిచేత కొబ్బరికాయని పేల్చించి, వాళ్ళందరికీ చేతబడి జరిగిందని పూజలు చేసి తగ్గిస్తానని చెప్పాడు.

ఈసారి మిగిలిన నలుగురు అక్కడ చేరారు.

ఒక్కొక్కడి బుర్రమీద నుంచి ఒక్కొక్క వెంట్రుకలాగి ఆ వెంట్రుకలను ఓ సీసాలో వేశాడు. వెంటనే సీసాకు మూత పెట్టేశాడు.

కొన్నిక్షణాలు గడిచాయి.

సీసాలోంచి తెల్లని పొగలు బయలుదేరాయి. సీసాలోంచి వెంట్రుకలు గాల్లో తేలుతున్నట్లు మూత దగ్గరకు రాసాగాయి.

"మీకు ఏదో శక్తి ఆవహించింది. చూశారా—మీ తల వెంట్రుకలు బయటికి రావటానికి ఎలా పైపైకి వస్తున్నాయో! దీన్ని భూస్థాపితం చేసి పూజలు చేస్తే మీకు నయమయిపోతుంది''

శిష్యుడు పెంటయ్య గురువుగారు ప్రదర్శించిన మాయకు వ్యాఖ్యానం

పదేళ్ళ క్రితం కొండంగి నుంచి పారిపోయాక స్వేచ్ఛంగా మాట్లాడటం నేర్చుకున్నాడు పెంటయ్య. అదంతా పురుషోత్తం చలవే.

ఆ నలుగురూ 'గురువు'గారి కాళ్ళకు సాష్టాంగపడి బయటికి వచ్చారు.

సరిగ్గా అదే సమయంలో నారాయుడు, సూరయ్య వగైరాలు అక్కడికి చేరారు.

ముందూ వెనకా చూడకుండా లోపలికి వెళ్ళి పురుషోత్తాన్నీ, పెంటయ్యనూ బయటకు లాగుకొని వచ్చారు.

రెడ్డినాయుడు వచ్చి వాళ్ళని బెదిరించాడు పోలీసులకు పట్టిస్తానని...!

"ఓయబ్బ పెద్ద మొగోడు బైల్దేరాడు. తీసుకురా పోలీసుల్ని!"

"మేమూ అందుకే సూత్తన్నాం! ఆల్లే వత్తారు ఇంకా సేపట్లో"

"పోలీసులంటే బయపడతావనుకోకు! ఎదవేషాలేసేవోల్లకి బయంకాని మాకెందుకు బయం"

పురుషోత్తాన్నీ, పెంటయ్యనీ వాళ్ళ చేతుల్లోంచి విడిపిద్దామని తీవ్రంగా ప్రయత్నించాడు రెడ్డినాయుడు.

ఆలోగా పెద్దవీధి మనుషులు కొందరు రెడ్డినాయుడికి అండగా వచ్చారు.

పెద్ద ఘర్షణ జరిగింది.

కొందరికి దెబ్బలు తగిలాయి.

పెంటయ్యనీ, పురుషోత్తాన్నీ ఈడ్చుకుంటూ స్కూలు దగ్గరకు తీసుకు వచ్చారు.

సీతయ్య, నాగులు, పర్వతాలు వాళ్ళ మనుషులు సత్తిరెడ్డి ఇంటిమీద పడ్డారు. వాళ్ళందరి దృష్టి ప్రభాకర్ మీదే!

అతన్ని రక్షించటానికి రాజారావు, సత్తిరెడ్డీ కూడా కర్రలు పట్టుకున్నారు.

వాళ్ళు పదిమంది !

వీళ్ళు ముగ్గురు !

గాల్లో కర్రలు గిరగిర తిరుగుతున్నాయి. సందులోనివాళ్ళంతా బయటకు వచ్చేశారు. చేతికి అందింది తీసుకు వచ్చారు అన్నింటికీ తెగించి!

రాజారావును, ప్రభాకర్‌ను రక్షించాలని వాళ్ళ తాపత్రయం !

ఆడవాళ్ళు భయం భయంగా ఇళ్ళల్లో ఉండే బయటకు తొంగిచూస్తున్నారు.

బ్రహ్మంతాతకీ, పెద్ద అప్పన్నకీ, డేవిడ్‌కూ ఈ విషయం తెలిసింది.

అంతే!

తూర్పుపేట, పెద్దగరువు మనుషులు వెల్లువలా రాసాగారు సత్తిరెడ్డి ఇంటికి.

పెంటయ్యనీ, పురుషోత్తాన్నీ కాళ్లూ, చేతులూ కట్టేసి స్కూలు దగ్గర పడేశాక అక్కడ కొందరు కాపలా ఉండి మిగతా వాళ్లు సత్తిరెడ్డి ఇంటికి వచ్చారు.

వాళ్ళందరికంటె ముందు పరుగెత్తుకొంటూ ప్రకాశరావు వచ్చాడు.

తనూ ఓ కర్ర అందుకున్నాడు.

జనం పెరగటంతో పర్వతాలూ, సీతయ్య, నాగులు బృందం పారిపోయారు.

కాని వాళ్ళ ఆటలు సాగనివ్వలేదు జనం!

ఆ కొట్లాటలో ప్రభాకర్‌కూ, రాజారావుకూ గట్టిగానే దెబ్బలు తగిలాయి.

అంత బాధలోనూ యథాలాపంగా నాగులు వైపు చూశాడు రాజారావు.

అతని కాలికి కట్టు వుంది.

అతని మెదడులో హఠాత్తుగా ఓ మెరుపు మెరిసింది.

కుంటుకుంటూ నాగులు దగ్గరకు వచ్చాడు. "కాలుకు దెబ్బ ఎలా తగిలింది నీకు?"

రాజారావు నాగులిని అడిగాడు.

"నిన్న రాత్రి చెర్లో దిగినప్పుడు ఆల్సిప్ప గుచ్చుకొంది"

కంగారుపడుతూ, నట్టుతూ నాగులు చెప్పిన అబద్ధాన్ని రాజారావుతో పాటు ఏ ఒక్కరూ నమ్మలేదు.

"నిజం చెప్పు! నువ్వూ, మరోడూ అభిరామ్‌ని కొట్టటానికి వచ్చినప్పుడు పగిలిన గాజుగ్లాసు నీకే కదూ దిగింది?"

"ఇది మరి బావుందండీ! నిజం సెప్పినా నమ్మరు ఏవిటో?"

పెద్దఅప్పన్న ఉండబట్టలేకపోయాడు.

పరుగు పరుగున నాగులు దగ్గరకు వెళ్లి "ఎదవ లం...కొడక! నువ్వేదో మంచోడివనుకొని ఇన్నాళ్లూ ఇంట్లో ఉండ నిచ్చాను. నా కూతురు సచ్చినప్పుడే నీకూ, నాకూ సంబంధం తెగిపోయింది. అయినా, నీకు ఎనకా ముందూ ఎవరూ లేరని నాకాడుంచుకొన్నాను.." అంటూ నాగుల్ని జుట్టు పట్టుకొని వంచి గుభీగుభీ పిడిగుద్దులు కురిపించాడు.

రాజారావు మాటలు విన్న వెంటనే మరికొందరు సీతయ్యని పట్టుకొని తన్నారు – "నిజం సెప్పు" అంటూ!

ఇద్దరూ వాళ్ళ దెబ్బలకు భరించలేక నిజం చెప్పేశారు.

సత్తిరెడ్డి ఇంటికి వచ్చి అభిరామ్‌ని కొట్టి, అక్కడినుంచి రాజారావు ఇంటికి వెళ్లి దొడ్లో ముగ్గులు వేసింది తానేనని నాగులు చెప్పాడు. డాక్టర్ కృష్ణమూర్తిని ఆసుపత్రిపాలు చేసింది కూడా రెడ్డి నాయుడి వల్లనే అని ఒప్పుకున్నారు.

ఊళ్ళో చేతబడి భయాన్ని ప్రచారం చేసిందీ, రాములినీ, వెంకన్ననీ ఆ భయానికి గురిచేసిందీ తామేనని కూడా చెప్పారు.

"నా అనుమానం నిజమే అయింది" అన్నాడు రాజారావు.

ప్రభాకర్ ఓ పక్కన పడిపోయాడు. అతని తల బద్దలయింది.

శరీరమంతా పచ్చి పుండయిపోయింది.

రాజారావుకూ బలంగానే దెబ్బలు తగిలినా ఓర్చుకుంటున్నాడు.

ఆ హడావుడిచూసి ఊళ్ళో పంచాయితీ ఆఫీసులో ఉంటున్న ఇద్దరు పోలీసులలో ఒకడు సైకిలు మీద వెళ్ళి సబ్‌ఇన్‌స్పెక్టర్నూ, మరికొందరు పోలీసులను తీసుకు వచ్చాడు.

అతికష్టం మీద పరిస్థితి అదుపులోకి వచ్చింది.

ప్రభాకర్ దగ్గరున్న ఉత్తరాలను సత్తిరెడ్డి ఆ సబ్‌ఇన్‌స్పెక్టరుకు చూపించాడు.

వాటిని జాగ్రత్తగా చదివి "మీరు ఓ కంప్లెయింట్ రాసివ్వండి!" అన్నాడు.

రాజారావు ఆ తతంగమంతా పూర్తి చేశాడు.

అభిరామ్‌నీ, ప్రభాకర్‌నీ హత్య చేయించటానికి ప్రయత్నించిన నేరం మీద రెడ్డినాయుడు; మోసం చేశారన్న నేరం మీద పురుషోత్తం, పెంటయ్య; దొమ్మికి పాల్పడ్డారన్న నేరం మీద పర్వతాలు, మరికొందరూ అరెస్టయ్యారు.

ఊళ్ళో న్యూసెన్స్ సృష్టిస్తున్నారనే అంశం ఆధారంగా హిస్టీరియాకు గురయిన వాళ్ళందరినీ మెంటల్ హాస్పిటల్‌కు పంపిస్తానని సబ్‌ఇన్‌స్పెక్టర్ చెప్పాడు.

తన జీపులోనే ప్రభాకర్‌ను ఆసుపత్రిలో చేర్పించాడు ఆ సబ్‌ఇన్‌స్పెక్టర్.

రాజారావు, ప్రకాశరావు, సత్తిరెడ్డి వగైరాలు వెనకాల కారులో గూడెం

వెళ్ళారు.

జరిగిన విషయమంతా అభిరామ్‌తో చెప్పాడు రాజారావు.

ప్రభాకర్, రాజారావుల గాయాలు చూసి చంద్రకళ కంగారుపడి, కళ్ళనీళ్లు పెట్టుకొంది.

మర్నాడు పొద్దున్న ప్రభాకర్‌కు స్పృహ వచ్చింది.

తలకు, కాళ్లకు, చేతులకు ఉన్న కట్లు గమనించి తనకుతానే ఆశ్చర్యపోయాడు ప్రభాకర్!

అభిరామ్ లేచి తిరుగుతున్నాడు.

ప్రభాకర్‌ని పరామర్శించాడు.

"మొత్తం మీద గొప్ప పనిచేశావ్ మిష్టర్ ప్రభాకర్ ! ఇలా చేయటంవల్ల ఇంకెక్కడైనా చేతబడిలాంటి ప్రయత్నాలు ఇంతతేలికగా జరగటానికి అవకాశం ఉండదు. రియల్లీ అయామ్ వెరీ ప్రౌడ్ ఆఫ్ యూ" అన్నాడు.

"దెబ్బలు తిన్నా అసలు రహస్యం బయట పెట్టగలిగినందుకు నాకు చాలా తృప్తిగా ఉంది" అన్నాడు ప్రభాకర్.

"నావల్లే మీరిద్దరూ ఇలా ఆసుపత్రి పాలయిపోవలసి వచ్చింది! నన్ను క్షమించండి" అన్నాడు రాజారావు.

"ఛ ఛ! అదేం కాదు!పదిమందికి మంచి జరగటమే మనకు కావల్సింది" అంటూ రాజారావును ఊరడించాడు అభిరామ్.

ఆ తరువాత...

అభిరామ్, రాజారావు పోలీస్ స్టేషన్‌కు వెళ్లి పురుషోత్తాన్ని కలిశారు.

''ఇంతకీ చేతబడి ఎలా చేయగలుగుతున్నావ్?"

అభిరామ్ అడిగాడు.

"మనవాళ్ళచేత ముందుగా కొందర్ని భయపెట్టిస్తాను. అలా ఒకరిద్దరు ఆ ప్రభావానికి గురవుతారు. తద్వారా ఊళ్లో మిగతావాళ్లకి కూడా అలాంటి భయాలు ఉండటంవల్ల వాళ్ళంతట వాళ్లే చేతబడి ప్రభావంలో పడిపోతారు"

పురుషోత్తం చెప్పాడు.

"మరి నువ్వు చదివే మంత్రాలు వగైరాలు..." రాజారావు కలగచేసుకున్నాడు.

"ఏమో ! అవేమీ నాకు తెలియదు. పూజలు చేసేటపుడు అలా చదవాలని మా గురువు చెప్పాడు. ఆ మంత్రాలకు ప్రభావం ఉందో లేదో నాకు తెలియదు. ఇలా చెయ్యాలని చెప్పాడు. చేస్తున్నాం. మాకు కావలసిన ఫలితాలు వస్తున్నాయి"

పురుషోత్తం చెప్పిన మాటలనే అదివరలో పరోక్షంగా ఇంకోలా చెప్పాడు అభిరామ్. ఆ మాటలన్నీ రాజారావుకు గుర్తు వచ్చాయి !

పోలీస్‌స్టేషను నుంచి బయటకు వస్తున్నప్పుడు రాజారావు అడిగాడు అభిరామ్‌ని !

"నిన్న ఈ ఇద్దర్ని తన్నటానికి మన వాళ్లు వెళ్ళినపుడు పురుషోత్తం సీసాలో శక్తుల్ని బంధించానని చెప్పి సీసాలో పొగలు సృష్టించాడట! అదెలా సాధ్యం" అని అడిగాడు.

''అదేమంత కష్టంకాదు ! హైడ్రోక్లోరిక్ ఏసిడ్‌నీ, అమ్మోనియా ద్రావణాన్నీ కలిపితే పొగలు వస్తాయి.సీసాలో అమ్మోనియా ద్రావణం చుక్కలు, మూతలో హైడ్రోక్లోరిక్‌ఏసిడ్ చుక్కలూ ముందుగానే వేసి, తరువాత ఆ సీసాకు ఆ మూత పెట్టేస్తే అలా పొగలు వస్తాయి" అన్నాడు అభిరామ్. ★

# ఆదర్శ ప్రేమ

## చతుర

భగ్న ప్రేమికులు ఇప్పుడు కాకపోతే మరో జన్మలోనైనా కలుసుకోగలమనే నమ్మకంతో ఆత్మహత్య చేసుకోవడం మామూలు. కానీ సండ్రా కిలింగ్టన్ అనే ఆవిడ సంగతివేరు. ఆవిడకు నాలుగేళ్ల కూతురుంది. ఇప్పటికే ఇద్దరు భర్తల్ని మార్చిన ఘనురాలు. ఈవిడ మూడు శతాబ్దాలనాటి థామస్ అనే చారిత్రకపురుషుడిని



ప్రేమించి అతన్ని కలుసుకోవాలనే ఆకాంక్షలో ఇటీవలే ఆత్మహత్య చేసుకుంది.

బార్కింగ[illegible] అనే ప్రాంతానికి వెళ్ళి వచ్చినప్పటినుంచి ఈమె పిచ్చి పట్టినట్లు ప్రవర్తించిందని, ఎప్పుడూ థామస్ ఫొటో ముందునిలబడి గంటల తరబడి 'అతనితో' మాట్లాడేదనీ తెలుస్తోంది. చివరకు ఆత్మహత్య చేసుకునే ముందు కూడా తాను తన పాత ప్రియుణ్ని తిరిగి కలుసుకోవడానికే వెళ్తున్నాననీ, ఇంకెప్పుడూ వెనక్కు రాననీ తనతాజాభర్తకు చీటీరాసిపెట్టి మరీ వెళ్ళింది. సరాసరి వెళ్ళి ఓ రైలుకింద పడి తన లక్ష్యం సాధించింది. ఈ దుర్ఘటన జరిగిన తీరు అనుమానాస్పదంగా తోచి పోలీసులు తీగలాగగా డొంకంతా విచ్చిపోయి విచిత్రాలు బైట పడ్డాయి. సండ్రా డైరీ నిండా థామస్ జ్ఞాపకాలు మాత్రమే గాక, అతని 'వంశవృక్షం' వివరాలు కూడా ఉండడం విశేషం! అయితే ఇంతటి ఉన్మాదిని అయివుండీ ఆ యువతి తన మొదటి భర్తతోనేగాక ఆ తర్వాత బాయ్ ఫ్రెండ్స్‌తో కూడా చక్కని జీవితమే గడిపిందని దర్యాప్తులో తేలింది. ఈవిడ గారి నంతగా ప్రేరేపింపజేసిన సదరు థామస్ ఫాన్‌షేమ్ 1628- 1705 మధ్య కాలంలో జీవించాడనీ, బార్కింగ్‌టౌన్‌లో అనేక వీధులకు, భవనాలకు అతని పేరు కూడా పెట్టారనీ తెలిసింది.

# ప్రపంచం



## అనుకోని ఆత్మహత్య

ఫొటోగ్రఫీ ఆధారంగా జరుగుతున్న అద్భుతాలకేగాదు అఘాయిత్యాలకు కూడా అంతులేకుండా పోతున్నది. మాంచెస్టర్ సమీపాన 1981 మార్చి 26వ తేదీన జాన్‌హాల్‌స్టెడ్ అనే 32 ఏళ్ల వ్యక్తి ప్రమాదవశాత్తూ అనుకోకుండానే ఆత్మహత్య చేసుకున్నాడు. అతనిలో లైంగిక వాంఛలు వెర్రి తలలువేసి వాటికి బానిసయిపోయాడు. పైగా అలాంటి చేష్టలను తనకుతానే ఆటోమేటిక్ విడియో కెమేరాతో చిత్రబద్ధం చేసి, తర్వాత వాటిని చూసుకుంటూ మురిసిపోతూ ఉండేవాడు. ఆరోజు రకరకాల అసహజ మరణాల వార్తలను ఇంట్లో ఒక కెమేరా విడియో టేప్ పెట్టుకుని రకరకాల భంగిమలలో సెక్స్ ఫీట్స్ చేస్తూ వాటన్నిటినీ విడియోలో కెక్కించాడు. తర్వాత ఏం చేయబోయాడో కానీ ఉరిపోసుకున్నట్లుగా మృతి చెందాడు. ఆ ఉరి ఉదంతం యావత్తూ కలర్ విడియోలో రికార్డయినట్లు పోలీస్ దర్యాప్తులో తేలింది. అతను ఒక నిరుద్యోగి అని, అశ్లీల సాహిత్యంపై మోజు ఎక్కువని, అతని వద్ద ఉన్న లైబ్రరీలో అత్యధికం ఈ బాపతేనని, వాటిని వివిధ పత్రికలనుంచి పెద్ద ఎత్తున కత్తిరించి దాచుకున్నాడని కూడా తేలింది. ఈ లైబ్రరీని తన భార్య, పిల్లలకు అందని విధంగా ఏర్పాటు చేసుకున్నాడు. ముగ్గురు పిల్లలకుపితృదేవుడైన ఈ యువకుడు తన మెడచుట్టూ ఉచ్చు బిగించుకుని రకరకాల పోజులలో స్వయంగా తీసుకున్న ఫొటోలు అనేకం కనిపించాయని కూడా పోలీసులు చెప్పారు. మితిమీరిన లైంగిక వాంఛా ప్రకోపం ఆ యువకుడి జీవితాన్ని అలా యాదృచ్ఛికంగా ముగించాయి గానీ అది కావాలని చేసుకున్న ఆత్మహత్య కాదంటూ జడ్జీగారు కేసు ఫైలు మూసేశారు.

# ఇంటి పోరు

**స**కాలంలో తగిన జంట లభించకపోవడం వల్లగానీ, మరే ఇతర కారణాలవల్ల గానీ ఏకాంతంలో అలమటిస్తూ తోడు కోసం అప్పుడప్పుడు గట్టిగా పరితపించే వారి ప్రయోజనార్థం కిరాయికి తాత్కాలిక భార్యలను అందజేసే కంపెనీలు కొన్ని విదేశాల్లో ఉన్నా, ఆస్ట్రేలియాలో ఈమధ్య మరోరకం సంస్థ వెలిసింది.



ఇది ఒకసారి లేదా అంతకంటె ఎక్కువ సార్లు పెళ్లి చేసుకుని భాగస్వామితో జీవనం పంచుకోలేక విడిపోయి గత జీవిత మధురస్మృతులతో వేడెక్కిపోతూ నిట్టూర్పు విడిచేవారికే ప్రత్యేకంగా సేవ లందిస్తుంది.

అలాంటి వ్యక్తులు ఈ కంపెనీకి అలా ఫోన్‌చేయగానే ఇలా 'కిరాయి' భార్య లేదా భర్త వచ్చేస్తారు. వచ్చిన వ్యక్తి 'భార్య' అయితే వస్తూనే సిగరెట్లు మానెయ్యండంటే వినరుగదా అనో, ఇలా రోజుకి ఎన్ని బుడ్లు తాగేస్తున్నారనో, పప్పులేదు, ఉప్పునిండుకుంది అంటూనో రోజస్తమానం సణుక్కుంటూ సాధిస్తూ దుంపతెంపుతుంది. అదే 'భర్త' అయితే "ఏం వీధిలో నిలబడ్డావు ఎవరికోసమే? నీ మొహం మండ, కూర ఇలాగేనా ఏడిసేది? అలా కొవ్వెక్కించుకోకపోతే కాస్త ఎక్సర్‌సైజులు చేయరాదా" అనో లంకించుకుంటాడు.

సాధారణంగా వీరు ఒకి రోజుకంటే ఎక్కువ ఉండరనీ, లక్ష్యమే వేరుగనుక 'దాంపత్యం' నెరపే ప్రశ్నే రాదనీ ఈ "మారేజ్ అనానిమస్" సంస్థ స్థాపకుడు చెప్పాడు. ఒకటికి నాలుగు పెళ్ళిళ్లు చేసుకుని, నాలుగో సతికి కూడా విడాకులిచ్చాక జ్ఞానోదయమై ఈ కంపెనీ పెట్టాడట ఈ పెద్ద మనిషి.

మద్యానికి అలవాటు పడినట్లే కొందరు వైవాహిక జీవనం వదులుకోలేని వాళ్లుంటారు. ఎన్నోసార్లు వైఫల్యం పొందినా లాటరీ టిక్కెట్లు కొన్నట్లుగా మళ్లీ మళ్లీ యత్నిస్తూనే ఉంటారు. అలాంటివారికి బుద్ధిచెప్పి దోవ మళ్లించడమే మా సంస్థల లక్ష్యం అని హార్డ్ సగర్వంగా ప్రకటిస్తున్నాడు. ఈ సంస్థ 'గ్రూప్ సమావేశాలు' కూడా ఏర్పాటుచేసి పాఠాలు చెప్తూ ఉంటుంది.

# వయసు-రచన

**ఆ**యన ఆరోక్లాసునుంచే అశుకవిత్వం ఒలకబోసేవాడు. కాలేజీలో చేరీచేరగానే

ఇరవై గ్రంథాలు రాశాడు – అంటూ ప్రముఖ కవులను, రచయితలను పొగడడం మనకలవాటే. కానీ, ఎవరూ అలా చిన్నవయసులోనే రచనావ్యాసంగంలో పక్వతచెందజాలరని ఒక సిద్ధాంత కర్త సెలవిస్తున్నాడు. మనిషిలో సృజానాత్మక రచనాసక్తి, శక్తి పక్వత చెందాలాంటే ఆ వ్యక్తికి కనీసం 37 సంవత్సరాల వయస్సు వచ్చి ఉండాలని ఆయన వాదిస్తూ కొన్ని ఉదాహరణలు కూడా చెప్పాడు. పదిమందిచేత ప్రశంసలు



సాహిత్య పూజలు అందుకున్న విలియం షేక్స్పియర్ రచయితగా పరిపూర్ణుడై ప్రపంచం గుర్తింపు పొందేనాటికి ఆయన వయస్సు 37 సంవత్సరాలు. 'అన్నా కెరినీనా' ద్వారా అందరినీ అలరింపజేసిన టాల్‌స్టాయ్ 'శభాష్' అనిపించుకునేసరికి నలభై వసంతాలు పూర్తి చేసుకున్నాడు. ఫీల్డింగ్, టూర్గెనార్, కార్లివ్, అలెగ్జాండర్ డ్యూమాస్ వీరందరూ 42 సంవత్సరాలకు అటూ ఇటూగానే ప్రశస్తిపొందారు. సర్ వాల్టర్‌స్కాట్ పేరు పదిమందికీ తెలిసే సరికి ఆయన 47వ సంవత్సరంలో అడుగుపెట్టాడు. చార్లెస్ డికెన్స్‌కూడా 47 దాటకముందే దిగంతాలకు పేరు వ్యాపింప జేసుకున్నాడని తెలుస్తోంది. ఇక్కడ ఒక చిత్రమైన విషయం ఏమిటంటే ఇప్పుడు పైన పేర్కొన్న వారిలో ఎవరి వయస్సూ 47 దాటకుండానే ప్రశంసార్హులు కావడంవలన, రచయితగా పరిపక్వత చెందేది 37–47 సంవత్సరాల వయస్సులోనే అని చెప్పవచ్చును.

అయితే విక్టర్‌హ్యూగో షష్టిపూర్తి చేసుకునేవరకూ పేరు పొందలేదు. అలాగే రిచర్డ్‌సన్ అనే ఆయన 55వ ఏడు వచ్చేవరకు ఎవరికీ తెలియదు. కాని ఇలాంటివారు తక్కువ సంఖ్యంలోనే ఉన్నారు. వీరికితోడుగా, కీట్స్, షెల్లీ, బైరన్‌లాంటి వారు పాతిక, ముప్ఫైఏళ్ల మధ్యలోనే పేరు ప్రఖ్యాతులు గడించారు. కాని కీట్స్ 24వ ఏటనూ, మిగిలిన వారు కూడా యవ్వన ప్రాయంలోనే మృత్యువాత పడడంతో పెద్దగా చెప్పుకోవల్సిన పని లేకపోయింది.

## గోతిలో డబ్బు

బ్రిటన్‌లో ఓ పెద్ద గుంటలో పెద్ద మొత్తంలో డబ్బు మూలుగుతూ పడి వుందంటే, ఆహా! ఇంకేం ఆ ధనరాశుల కోసం పరుగెత్తుదామనుకోడానికి వీల్లేదు. ఆ ధనానికి బ్రహ్మాండమైన కాపలా వుంటుంది. వారిని దాటుకొని చిన్న చీమకూడా లోపలికి పోలేదు. ఇంతకీ ఈ

ధనరాశులన్నీ బ్రిటిష్ టంకశాల వారివి. ఈ టంకశాల 260 లక్షల నాణాలను అచ్చు పోయగల స్థితిలో ఉంది.

వేల్స్ పట్టణందగ్గిరగా ఉన్న రాన్‌టప్ వద్ద భూగర్భంలో ఈ బ్రహ్మాండమైన బ్రిటిష్ టంకశాల ఇప్పటికీ ఉంది. అత్యంత ఆధునికమైనదిగా ఉన్న ఈ టంకశాల 100 సంవత్సరాలనాటిది.

ఈ టంకశాల ఇంగ్లండ్ దేశానికే గాక కొన్ని ఇతరదేశాలకోసంకూడా నాణాలను అచ్చుపోస్తోంది. దీని ఉత్పత్తిలో 65శాతం విదేశాల అవసరాలను తీర్చడానికే సరిపోతుంది.

ప్రస్తుతం బ్రిటిష్ కరెన్సీ పద్ధతి క్రమంగా దశాంశపద్ధతికి చేరుకుంటున్నది. స్టెర్లింగ్, పౌండ్, షిల్లింగు, పెన్నీలు ఈ కొత్తపద్ధతి ప్రకారమే తయారవాలిగనుక అందుకు బ్రహ్మాండమైన పథకాన్ని తయారుచేసి, బ్రిటన్‌తో పాటు అనేక ఇతర దేశాల కరెన్సీ నాణాల అవసరాలకు తగినట్లు ఉత్పత్తి చేయగలిగే టంకశాలను అభివృద్ధిపరచారు.

ప్రస్తుతం బ్రిటిష్ టంకశాల పూర్తిగా కంప్యూటర్ సహాయంతోనే పనిచేస్తోంది. వృత్తాకారంలోవున్న లోహపు పలకలను, షీట్స్‌ను బెల్టుల్లావున్న వాటిమీద పెడతారు. ఈ బెల్టులు వీటిని కంప్యూటర్‌తో పనిచేసే ముద్రణ యంత్రాలలోకి తీసికెళతాయి. తర్వాత పూర్తిగా కంప్యూటర్‌పద్ధతిలో పనిచేసే బరువుతూచే యంత్రాలు ఈ నాణాల బరువును బట్టి వాటిని లెక్కిస్తాయి. బరువు తూచాక నాణాలను ఓగోతిలో పడేస్తారు.నాణాలతో నిండివున్న ఓ గోతిని ప్రపంచంలోని అత్యంత సమర్థులైన భద్రతాధికారులు కాపలాకాస్తుంటారు. కళ్లల్లో వత్తులు వేసుకొనిచూసే వీరిని దాటి ఆధనరాశులను చేరే దమ్ములెవరికి ఉంటాయిగనక ?

# ప్రాణదాత

'పునరపి మరణం పునరపి జననం' అనే వాక్యం ప్రకారం పునర్జన్మ ఉందని చాలామంది నమ్ముతారు. అలాగే ఒక జీవితంతోనే చస్తోంటే మరో జన్మ కూడా ఎందుకు అని వాపోయేవారూ వున్నారు.

చంగ్ చుంగ్ అనే ఓ 18 ఏళ్ల చైనా అమ్మాయి 1980 సెప్టెంబర్ 11వ తేదీన యథాప్రకారం భవన నిర్మాణంలో పని చేస్తోండగా ప్రమాదవశాత్తు ఎలక్ట్రిక్ షాక్ తగిలి నాలుగున్నర మీటర్ల ఎత్తు నుంచి కిందకి పడిపోయింది. కుడి చేతికి, కుడికాలికి బాగా దెబ్బలు తగిలాయి. కరెంట్ షాక్ వల్ల స్పృహ తప్పిన ఆమెను వెంటనే స్థానిక ఆస్పత్రిలో చేర్పించినా అలాగే స్పృహ లేకుండా నెలరోజులు పడివుంది. కోమాలో వున్న ఆమెకి కృత్రిమ శ్వాస ఏర్పాటు చేశారు.

డిసెంబర్ 30న ఆమెను పెకింగ్‌లోని ఓ ఆస్పత్రికి తరలించి చూడటానికి కుదన్ అనే ఓ లేడీ డాక్టర్‌ని నియమించారు. చంగ్ చుంగ్‌ను ఆ ఆస్పత్రికి తీసుకొచ్చిన సమయానికి ఆమె కేవలం ఓ అస్తిపంజరంలా వుంది. డాక్టర్లందరూ లాభం లేదని పెదవి విరిచేశారు. వారికి కనీసం నాడి కూడా అందలేదు. ఆమె అవయవాలన్నీ వంకర్లుపోయి విరిగిపోయాయి. ఆమె శరీరంలోని నరాలు పని చేయటంలేదు.

ఆ సమయంలో ఆఖరి ప్రయత్నంగా



ఆమెకు ఆకుపంక్చర్ చికిత్స చేశారు. ఈ చికిత్స రెండో దశలో చంగ్‌చుంగ్ మెన్సస్ పీరియడ్స్ క్రమబద్ధమైనాయి. మరి కొన్నాళ్ళకి వంకర్లు తిరిగిన ఆమె అవయవాలు క్రమంగా తిన్నగా అయ్యాయి.

చికిత్స ప్రారంభించిన తొమ్మిదో రోజున లేచి నిల్చోగలిగింది గానీ నడవటం చేతనవలేదు. మరో రెండు వారాలపాటు సూదులను ఆమె వీపు, తల భాగంలో గుచ్చాక ఊహించ లేనంత అభివృద్ధి కన్పించింది. మరో మూడు నెలలకల్లా నడవటం ప్రారంభించింది. జ్ఞాపక శక్తి కూడా తిరిగి వచ్చింది.

ఒక విధంగా చంగ్‌చుంగ్‌కి ఇది పునర్జన్మే. పూర్తి ఆరోగ్యం పొందాక ఆమె కోరిన మొదటి కోరిక– దగ్గర్లో వున్న థియేటర్లో ఓ సినిమా చూడాలని. అందుకు డాక్టర్లు సంతోషంగా అంగీకరించారు. ఇప్పుడామె అందర్లా హాయిగా వుంది. తనకు నూతన జీవితాన్ని ప్రసాదించిన ఆకుపంక్చర్ సూదులను జాగ్రత్తగా దాచిపెట్టింది చంగ్ చుంగ్.

## ప్రేమకోసమై

ఒకే రాజకుమార్తెను దేశం నలుమూలలా వున్న రాజకుమారులు ప్రేమించి పెళ్ళాడుతామనడంతో ఏంచేయాలో తోచని పిల్లతండ్రి స్వయంవరం ప్రకటించి పక్కకి తప్పుకునేవాడు.

కానీ ఇది పూర్వకాలముకాదు, పైగా కాలిఫోర్నియాలోని ఆ అందాల సుందరికి మహారాజులాంటి తండ్రి లేడు. ఓ శుభోదయాన నలుగురు అందమైన యువకులు వచ్చి ఏకకంఠంతో 'నిన్నే పెళ్ళాడుతాం' అనిపాట మొదలెట్టేసరికిఆసుందరికిగొంతు పట్టుకున్నట్లయింది. అయినాపైకికనిపించకుండా నలుగుర్నీ కూర్చోబెట్టి మర్యాద చేసింది. మాటల మధ్యలో వాళ్ళు నలుగురూ మంచి ఈతగాళ్ళని తెలుసుకుని నీళ్లలో ఎవరు ఎక్కువ సేపు మునిగివుంటే వారిని పెళ్ళాడుతానని మాటిచ్చి పంపింది. 'ఓహ్! అదెంత పని' అని నలుగురూ మహా సంతోషంగా వెళ్ళారు.

మర్నాడు సాయంత్రం పోటీలో నలుగురిలోనూ చిన్నవాడు సుందరిని గెల్చుకున్నాడు. మిగతా ముగ్గురినీ స్పృహతప్పిన స్థితిలో వుండగా నీళ్ళలోంచి బైటికిలాగి ప్రథమచికిత్స చేసి మెల్లగా ఆస్పత్రికి పంపారు స్విమ్మింగ్ పూల్ అధికారులు.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. VIPULA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd.No. H/HD/402